# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్



నవంబరు 1971



సంపుటము : 48 : సంచిక 11 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# వి ష యా ను క్ర మ ణి క

## నవంబరు 1971





# సుప్త మందిరం

శ్రీమతి నాయని కృష్ణకుమారి

స్తబ్ధ చైతన్యపు మడతల్లోపల
మంద్రకోడిగా మెరుస్తున్న
మనసు నిలువర్ని వెతుకుతున్నావు నీవు
మసిపాతలోని మాణిక్యాలను
వెలికి తీస్తున్నావు.

నీ చూపుల్లోని
అయస్కాంత శిలా శక్తిని
నిద్రలేపి
అతి సామాన్యంగా మోగే
హృదయ తంత్రుల్ని
నిస్తంద్ర మోహనంగా
నీ వైపుకు లాక్కుంటున్నావు.

రూపం తెలీని
లోపలి కోరికలకు
రెక్కలు మొలిపించి
అక్షర పారావతాలుగా
ఆకాశంలోకి ఎగరేస్తున్నావు.

గొంతులో నుంచి
సుంతైనా వెలికి పెగలని
మాటలనిండా నా మనస్సునే నింపి
నిర్విరామంగా
నీ చుట్టూరా తిప్పుకుంటున్నావు.

శతముఖాలుగా
చెదిరిపోయినా

ప్రతిశకలమూ
నిన్నే పొదువుకునే
అవకాశాన్ని కాంక్షించి
అద్దంలాంటి నా మనస్సు మీద
అశ్మ శకలాల్ని రువ్వుతున్నావు.

మనఃకాసారాంతరంలోకి
మరుద్వేగంతో దూసుకుపోయి
సుప్తగాథాల అట్టడుగున
గుప్తంగా నిన్ను నువ్వు
దాచుకో జూస్తున్నావు.

మరి నా మాటేమిటి
సుడికరువలి వడి కాగలేక
తడబాటు పడుతున్న
తలిరాకువంటి మెత్తని
నా మనసు మాట !

నీ రూపూ, నీ చూపూ
నీదేనని భ్రమిస్తున్న
గాఢమైన నిట్టూరుపూ,
నాలో సృష్టించే సంక్షోభాన్ని
సుంతైనా గమనించవు
నన్ను కరుణించవు.

నా మనస్సును చుట్టుకున్న
చీకటి గోడల్ని తాకి
మధుర సంగీత తరంగ మూర్తి
నీవు ప్రసరించే
ప్రతిధ్వనులఛాయలు
లోలోపల రేపుతున్న
తీయని ఆర్తిని గుర్తించవు
నన్ను జాలి దలచవు.

# సుప్త మందిరం

నిన్ను పట్టుకోడానికి
ఏడుకొండలూ ఎక్క రమ్మనకు
సప్తసముద్రాలూ ఒక్క
లిప్తలో ఈది
అడవులూ అఘంతరాలూ
అడ్డంవస్తే దాటిరమ్మనకు
నా కళ్ళకు గంతలు కట్టి
కడగండ్లపాలుచేసి
కవ్వించకు !
నన్ను చులకన చేయకు !
ఎన్నటికీ చావని
నా ఆశలు అప్సరసలు !
కఠిన శిలలో సైతం
కదలికలు కలిగించగల
గిలికింతలు !
నీ ఉనికిని
నిర్దాక్షిణ్యంగా
శాసించగల
ఐంద్రజాలిక హస్తచామరాలు !

అందుకే
నీవీ గుడిలోపల !
నిద్రిస్తూ మందకొడిగా పడి
నా మనసు అడుగుపొర లోపల !



# శనిగారపు మూడు కాకతీయ శాసనములు*

శ్రీ పి. వి. పరబ్రహ్మ శాస్త్రి

కరీంనగరుజిల్లాలో కరీంనగరునుండి హైదరాబాదు పోవు రోడ్డువెంబడి శనిగార మను గ్రామములో ఈ శాసనములు క్రొత్తగా కనుగొనబడినవి. ఈ మూడు శాసనములు వేరు వేరు తావులందున్నను, అన్నియు ఆ గ్రామమునకు చెందినవే. ప్రాచీన కన్నడమందు చెక్కబడి స్పష్టముగా నున్నవి. ఇవి వరుసగా మొదటి ప్రోలరాజు, రెండవ బేతరాజు, రెండవ ప్రోలరాజులకు చెందినవగుటచే కాకతీయుల ప్రారంభ చరిత్రకు తోడ్పడుచున్నవి.

## మొదటి శాసనము

ఈ శాసనము గ్రామసమీపమందొక పాలములో గలదు.

ఇది పశ్చిమ చాళుక్యచక్రవర్తి యగు త్రైలోక్య మల్లదేవుని విజయరాజ్యకాలమునకు చెందినది. ఈ రాజును ఆహవమల్ల ప్రథమ సోమేశ్వరు డనిగూడ చెప్పుదురు. ఇతడు క్రీస్తు తర్వాత 1042 మొదలు 1067 వరకు కళ్యాణినగరము రాజధానిగ రాజ్యమేలిన గొప్ప చక్రవర్తి. 'తత్పాదపద్మోపజీవి, సమధిగతపంచమహాశబ్ద, మహాసామంత, శ్రీ మత్త్రైలోక్యమల్లవల్లభ ప్రసాదాసాదిత మహా మహిమాస్పద, పరమమాహేశ్వర, పతిహితచరిత' ఇత్యాది ప్రశస్తితోగూడిన కాకతీయ పొళలరసరు శక వర్షములు 975 కు సరియగు విజయ సంవత్సర కార్తిక అమావాస్య ఆదివారంనాడు సూర్యగ్రహణ... పర్వనిమిత్తముగాచేసిన దానవిశేషమునుగూర్చి యీ శాసనమందు చెప్పబడెను. శనిగారమందు మధువయ్య పెర్గెడ ప్రతిష్ఠించిన మధుపేశ్వరదేవునకు స్థానిక గావుండుల యొక్క రెడ్లయొక్క అనుమతితో పన్నెండు గృహనివేశనస్థలములను......మోటబావి, భూములు, మున్నగునవి దాన మొసర్చెను.

ఇందు చెప్పబడిన తేది క్రీ. శ. 1053 నవంబరు 13 నాటి సూర్యగ్రహణ పర్వదినమునకు సరిపోవుచున్నది. కనుక దానకర్తయగు కాకతిపొళలరసరు మొదటి ప్రోలరా జగును. ఇతనికి చెందిన శాసనము లెవ్వియు నింతవరకు లభించలేదు. ఇదియే మొదటి శాసనము. ఇతనినిగూర్చి చెప్పబడు విశేషములన్నియు నింతవరకు తర్వాతివారి శాసనములనుబట్టియే. ఇతనికి 'అరిగజకేసరి'యను బిరుదనామము ప్రసిద్ధమై యున్నది. దీనినిబట్టియే 'కేసరిసముద్రము' లేక 'కేసముద్రము' అనెడి తటాకముతోగూడిన గ్రామము మహబూబాబాదుతాలూకాలో (వరంగల్లుజిల్లా) వెలసియున్నట్లు బయ్యారపు శాసనమునుబట్టి తెలియును.[1] కాని యీ శాసనమందు ఆ 'అరిగజకేసరి'యను బిరుదము కానరాదు. కనుక నిది తర్వాత వచ్చినదై యుండును. ఈతని మొదటి రాజ్య సంవత్సరము క్రీ.శ. 1055 కాదగునని యిప్పటివరకు చరిత్రకారులు తలంచుచుండిరి. కాని దీనినిబట్టి క్రీ.శ. 1053 నవంబరునాటికే యితడు రాజయ్యెనని తెలియుచున్నది.

కాకతీయులనుగూర్చిచెప్పు మొట్టమొదటి శాసనము తూర్పుచాళుక్యరాజగు దానార్ణవుని మాంగల్లు తామ్రపట్టిక[2]. కాకర్త్యగుండ్యన కోరికపై వేంగి

* వీటిని ప్రకటించుట కనుమతించినందుకు ఆం. ప్ర. పురావస్తుశాఖ డైరెక్టరు మహమ్మదు అబ్దుల్ వహీద్‌ఖాన్‌గారికి కృతజ్ఞతలు.

1. భారతి-సంపు. 44: సంచిక 4; 1967 ఏప్రిల్, పుట 5.

2. ఎపిగ్రాఫియా ఆంధ్రికా—(ఆం. ప్ర. ప్రభుత్వ పురావస్తుశాఖ ప్రచురణము) సం. 1—పుటలు 57—70

రాజగు రెండవ అమ్మరాజును తరిమి తాత్కాలికముగ పట్టము గట్టుకొనిన అతని సవతి సోదరుడగు దానార్ణవుడు క్రీ. శ. 955 ప్రాంతమున మాంగల్లు గ్రామమును దొమ్మన (శర్మ) కు దానమిచ్చిన విషయ మిందు కలదు. కాకర్త్యగుండ్యన రాష్ట్రకూటుడైన మూడవకృష్ణుని ఆజ్ఞతో దానార్ణవునకు సహాయముగా వచ్చిన రాష్ట్రకూటసేనాపతియని తెలియుచున్నది. తర్వాత కాకతీయులకు చెందినది క్రీ. శ. 1053 నాటి ఈ శనగార శాసనమే. ఇది మొదటి ప్రోల రాజును మహాసామంతప్రతిపత్తితో తెలుపుచున్నది. ఇతడు మాంగల్లు శాసనమందు జెప్పబడిన కాకర్త్య గుండ్యన పుత్రుడైన గరుడబేతని పుత్రుడు. ఈ ప్రోలరాజు శాసన మిది యొక్కటియే యిప్పటికి లభ్య మైనది. క్రీ. శ. 1052 ప్రాంతమున ఇతని తండ్రి యగు మొదటి బేతరాజు తన చక్రవర్తియైన ఆహవమల్ల సోమేశ్వరుని పనుపున రేచెర్ల బ్రహ్మసేనా పతి సహాయముతో కంచిపై దాడివెడలినట్లు కాజీ పేట దర్గా శాసనము మున్నగువాటిని వివరించు సంద ర్భమున చెప్పబడెను.[3] కాని అంతకుముందే శకము 969 (క్రీ. శ. 1047) నాటి నాందేడు శాసన మొక దానియందు మొదటి సోమేశ్వరుడు చోళమండలమును గూడ జయించినట్లు చెప్పబడియుండెను.[4] మెదకు జిల్లాలోని కొల్చూరు గ్రామములోని శకము 972 నాటి శాసనమందుగూడ మొదటి సోమేశ్వరుని మహా సామంతులలో నొకడగు బిజ్జరసుడు 'పెట్టలనాడు విషయము' నేలుచు తానొక చోళదండయాత్రలో విజయము సాధించినట్లు చెప్పుకొనెను.[5] కనుక క్రీ. శ. 1052 కు పూర్వమే మొదటి సోమేశ్వరుడు చోళసైన్యము నెదిర్చి పోరిన సందర్భములు కలవని తెలియుచున్నది. ఆ యుద్ధములలో కాకతి మొదటి బేతరాజు వేనియందైనను చోళులతో పోరి యుండ వచ్చును. అంతేగాక త్రైలోక్యమల్లుని తండ్రియగు జయసింహునిరాజ్యకాలమందుకూడ చాళుక్యులకు చోళులతో యుద్ధములు జరిగినవి. వాటిలోనైనను మొదటి బేతరాజు పాల్గొనియుండును. కాజీపేట దర్గా శాసనమందు మాత్రమే యితని చోళవిజయ మునుగూర్చి చెప్పబడెను. అందు కంచి దండయాత్రను గూర్చిన ప్రసక్తి కానరాదు.

'సామంత విష్టివంశః
శ్రీమా న్కాకతి పురాధినాథో బేతః
చోళక్ష్మాపాళ చమూ వార్ధి
ప్రమథన సమార్జి తోర్జిత లక్ష్మీః' ||[6]

ఇచ్చట బేతరాజు చోళసైన్యమును జయించె ననియే కలదు. ఈ విజయము చోళసైన్యము చాళుక్య దేశముపై నెత్తివచ్చినపుడు వారిని తరుముట విషయ ములో పొందినదైయుండును. కాగా పాలంపేట శాసన మందు రేచెర్లరుద్రసేనాపతి తన పూర్వులలో నొక డగు బ్రమ్మసేనాపతిని వర్ణించుచు[7]

శ్రీమద్బమ్మాఖ్యసేనాని రభూ ద్భూరిగుణాన్వితః
నిజప్రతాప ప్రాకార పరిత్రాత మహీతలః
తూర్య ప్రణాద సమనంతర మేవ తూర్ణ
మాక్షిప్య యో యవనికా సదృశం కవాటమ్
కాంచీపురస్య సమపాదయ దాశు వీర
లక్ష్మీ వివాహ మివ కాకతివల్లభస్య ||

కాంచీపురకవాటమును అతిసులభముగా భేదించి కాకతివల్లభునికి వీరలక్ష్మితో వివాహ మొనర్చువేళ తెరను తొలగించినట్లు చేసెను.

ఈ బ్రహ్మసేనాపతికిచెందిన యిదే విజయము పిల్లలమఱ్ఱి శాసనమందిట్లు వర్ణించబడెను.[8]

'యః కాంచీనగరీ కవాట హరణం
కృత్వా ప్రచండాహవ

---

3. Early History of the Deccan-Vol.II Ed.G.Yazdani P: 577-8.

4 ,, Vol. I. P. 330.

5. Annual Report on Epigraphy. 1960—'61—No. 91.

6. Corpus of Telangana Ins. Part—II P P. 25—26: lines 1 and 2.

7. H. A. S. No. 3, Palampet Ins. Text verses 10 and 11.

8. Corpus of Tel. Ins. Part. 2, P. 115. V. 4.

క్రీడ శ్చోడనరాధిపస్య కృతవా
న్మానద్రుమోన్మూలనమ్'

కాంచీనగరకవాటమును భేదించి చోళనరాధిపుని యభిమానము నూడబెరికెను. ఈ రెండు సందర్భములలోను కాకతివల్లభు డెవరో చెప్పబడలేదు. పై దర్గాశాసనము నాధారముగాగొని మొదటి బేతరాజే బ్రహ్మసేనాపతితో కంచిపై దాడివెడలెనని యింతవరకు తలంపబడుచుండెను. కాని దర్గాశాసనమందు బేతనిగూర్చి చెప్పుటలో కంచి దండయాత్ర చెప్పబడలేదు. అతడా దండయాత్రలో పాల్గొనియుండినచో అంతటి గొప్పవిజయమును కాకతీయులు తమ శాసనములందు విడుతురా? మరియు ఆ దర్గా శాసనమందు చక్రకూటము, కొంకణము మున్నగు విదేశ దండయాత్రలు మొదటి ప్రోలుని విజయములలో జెప్పబడినవి. అట్టి విదేశ విజయములకు మెచ్చియే త్రైలోక్యమల్లు డతనికి బేతనకాలమందులేని నూతన భాగములతోగూడిన అనుమకొండ విషయమును శాసనబద్ధము గావించెను.[9] కనుక రేచెర్ల బ్రహ్మసేనాపతి కంచి దండయాత్ర బేతరాజుయొక్క సమయములోనే జరిగెనని చెప్పుటకంటె; అతని పుత్రుడగు మొదటి ప్రోలుని సమయమునందైనను జరిగియుండవచ్చు ననుటలో తప్పులేదు. అతడైనను స్వయముగా పాల్గొనక సేనానిని మాత్రము కొంత సైన్యముతో బంపియుండవచ్చును. కనుక కంచిదండయాత్ర విషయ మీ దర్గాశాసనమందు చక్రకూట, కొంకణాది దేశముల విషయములలో జేర్పబడలేదు. ఇంతకు తెలియవచ్చునదేమనగా మొదటి బేతని 'చోళ చమూవార్ధి ప్రమథన' విషయమును రేచెర్ల బ్రహ్మసేనాపతియొక్క కంచి దండయాత్రతో ముడిపెట్ట నవసరము కానరాదు. అది చాళుక్యదేశముపై వచ్చిన చోళదండయాత్ర లనేకములలో దేనికైనను చెందియుండవచ్చును. క్రీ. శ. 1052 లో జరిగిన త్రైలోక్యమల్లుని కంచి దండయాత్రనుబట్టి మొదటి బేతరాజు అప్పటివరకు జీవించియున్నట్లు భావించుట సమంజసముగా తోచదు. దానినే యాధారముగాగొని మొదటి ప్రోలుని రాజ్యప్రారంభము సుమారు క్రీ. శ. 1055 ప్రాంతమై యుండుననుకొనుట జరిగెను. ఈ సనగర శాసనమును బట్టి క్రీ. శ. 1053 నాటికే అతని రాజ్యపాలనము కలదని జెప్పవలెను. బ్రహ్మసేనాపతి కంచి దండయాత్ర యితని సమయమందే జరిగియున్నను కావచ్చును. కనుక మొదటి బేతరాజుయొక్క అంతిమ సంవత్సరమునుగూర్చిగాని మొదటి ప్రోలుని ప్రారంభ సంవత్సరమును స్పష్టముగ జెప్పుట కింకను తగిన యాధారము లభించలే దనవలెను. ఇప్పటికి వీరిని గూర్చి స్పష్టముగ తెలిసిన సంవత్సరము లివి :

1. కాకర్త్యగుండ్యని మాంగల్లు శాసనము. క్రీ. శ. 955 (ప్రాంతము).[10]

2. ప్రస్తుత సనగారపు మొదటి ప్రోలుని శాసనము. క్రీ. శ. 1053.

3. రెండవ బేతరాజుయొక్క అనుమకొండ శాసనము. క్రీ.శ. 1079.[11]

కాకర్త్య గుండడు క్రీ. శ. 955 తర్వాత నెంత కాల ముండెనో తెలియదు. కనీసము రాష్ట్రకూట పతనము అనగా క్రీ. శ. 973 వరకు జీవించియుండును. అతని పుత్రుడగు గరుడబేతడు (మొదటి బేతడు) పిన్నవాడుగనే కామెవసానిచే కాకతిపురమందు నిలుపబడెనని గూడూరు శాసనమునుబట్టి తెలియుచున్నది.[12] అత డెంతవరకు జీవించియుండెనో స్పష్టముగ తెలియదు. అతని పుత్రుడగు మొదటిప్రోలుని ఆరంభమునుగాని తుదినిగాని స్పష్టముగా తెలుపుట కాధార

---

9. Corpus ,, P. 26. V. 3.
'తత్తద్భూయుత మన్మకొండ
విషయం త్రైలోక్య మల్లక్షమా
ధీశా చ్ఛాసనబద్ధ ముద్ధత జంబూ
సంలబ్ధవాన్ శాశ్వతమ్॥'

10. Ep. Andhrica. Vol. I; P. P. 57—70, A. R. E. 1917. P. 47.

11. Corpus. Part 2. No. 6. P. 25.

12. Corpus. Part 2. P. 78, Gudur ins; V. 4.

ములులేవు. పై జెప్పిన 2, 3 సంఖ్యలుగల శాసనములే యాధారము. అనగా క్రీ. శ. 1053 నాటికి పాలనాధికారములో నుండెననియు, క్రీ. శ. 1079 లోపల నంతమొందెననియు మాత్రము తెలియగలదు.

ఇందు 'త్రైలోక్య మల్లవల్లభ ప్రసాదాసాదిత మహామహిమాస్పద' అని ఈ ప్రోలరాజు చెప్పబడుటచే బయ్యారము శాసనమునుబట్టి అనుమకొండ విషయమునకే పరిమితమై యున్న తండ్రియగు గరుడ బేతని (మొదటి బేతని) ఆధిపత్యముకంటె ఇతని యధికారము చక్రవర్తియనుగ్రహముచే సబ్బి మండలమునకూడ వ్యాపించెనని తెలియుచున్నది. ఈ ప్రోలరాజును గూర్చిన యితర విశేషములు కొన్ని కాజీపేట దర్గా శాసనములో చెప్పబడియున్నవి.[13]

ఇందు 41 వ పంక్తిలోని 'ఖణ్డి సణగర' అనునది ప్రస్తుత శనగారగ్రామమై యుండును. 'ఖణ్డి' యనునది యే యర్థములో వాడబడనో తెలియదు. 60 వ పంక్తిలోని 'బెజవాంకె' యనునది సమీపమందున్న వేరొక గ్రామము. ప్రస్తుత మిది బెజ్జంకి యని పిలువబడుచున్నది.

ఈ శాసనము లభించుటతో కాకతీయులు తెలుగుదేశమునందు స్థిరపడినతర్వాత ఒక గరుడబేతని (మొదటి బేతని) నాటి యతని శాసనము(లు) తప్ప మిగిలిన ఆ వంశము వారందరివి దొరికిన వనవచ్చును. మొదటి బేతని గూర్చి కాజీపేట దర్గా శాసనమందును, గూడూరు శాసనమందును, బయ్యారం శాసనమందును విశదముగా చెప్పబడియున్నది.

శాసనాంత మందున్న 'దొణయ్య' అనునది శాసనము చెక్కినవానిపేరు గావచ్చును.

## మొదటి శాసన మూలము

### మొదటి వైపు

1. స్వస్తి సమస్త భువ
2. నాశ్రయ శ్రీ ప్రి
3. థ్వీ వల్లభ మహా
4. రాజాధి రాజ ప
5. రమేశ్వర పరమ
6. భట్టారకం
7. సత్యాశ్ర
8. య కుళతిళకం చా
9. ళుక్యాభరణం శ్రీ
10. మత్రైలోక్య మ
11. ల్లదేవర విజ
12. యరాజ్య ము
13. త్తరోత్తరాభివృద్ధిం
14. ప్రవర్ద్ధమాన మా
15. చంద్రాక్కర్క
16. తారం బ
17. రం సలుత్తుమిరె
18. తత్పాద పద్మోప
19. జీవి సమధి

### రెండవ వైపు

20. గత పంచమహా
21. శబ్ద మహాసా
22. మంతం శ్రీమత్రై
23. లోక్యమల్ల వల్ల
24. భ ప్రసాదాసాది
25. త మహామహి
26. మాస్పద పరమ
27. మాహేశ్వర ప
28. తిహిత చరితం
29. వినయ విభూ
30. షణం శ్రీమన్మ
31. హా సామంత కా
32. కతియ పొల
33. ల రస స్వర్ణక వర్
34. ష 975 నెయ
35. విజయ సంవ

---

13. Early History of the Deccan. Vol. II; P. P. 578–79.



36. త్సరద కార్త్తిక
37. దమావాస్యే యు
38. మాదిత్య వార
39. దన్ను సూర్య్య

మూ డ వ వై పు

40. గ్రహణ పర్వ్వ నిమి
41. త్తదిం ఖణ్డి సణగ
42. ర దొళ్ పెగ్గడ మ
43. ధువపయ్యంగ
44. ళ మాడిసిద మ
45. ధువేశ్వరక్క[డి]యు
46. పూర్వ్వగ పున్నె
47. య గావుణ్డను మం
48. ముప్పదయ్యు గావు
49. ణ్డను మనొడం బడి
50. సి ధారాపూర్వ్వకం మా
51. డి పన్నెరడు మనెయు
52. నివేశనము మాదు
53. గణముం కిఱియ
54. గరి ఱియెంబ రాటణ
55. ము మూరబడగణ
56. ఱాకుంబెయ అయిగి
57. ప్పత్తు మత్తక్కరియ
58. కెయ్యుం మిప్పత్తు
59. మత్త క్కెను కాళుం
60. బెజవాంకెయ కా
61. బె రడ్డియుం దణ్డ

నా లు గ వ వై పు

62. మ రడ్డియుం ప్రభు
63. నాగరాజను మనొ
64. డం బడిసి పిరియ
65. కెఱయ పెఱగా (ం)
66. దు మత్త స్నే నేఱ లనుం
67. సర్వ్వాభ్యంతర సిద్ధి

ములులేవు. పై జెప్పిన 2, 3 సంఖ్యలుగల శాసనములే యాధారము. అనగా క్రీ. శ. 1053 నాటికి పాలనాధికారములో నుండెననియు, క్రీ. శ. 1079 లోపల నంతమొందెననియు మాత్రము తెలియగలదు.

ఇందు 'త్రైలోక్య మల్లవల్లభ ప్రసాదాసాదిత మహామహిమాస్పద' అని ఈ ప్రోలరాజు చెప్పబడుటచే బయ్యారము శాసనమునుబట్టి అనుమకొండ విషయమునకే పరిమితమైయున్న తండ్రియగు గరుడబేతని (మొదటి బేతని) ఆధిపత్యముకంటె ఇతని యధికారము చక్రవర్తియనుగ్రహముచే సబ్బి మండలమునకూడ వ్యాపించెనని తెలియుచున్నది. ఈ ప్రోలరాజును గూర్చిన యితర విశేషములు కొన్ని కాజీపేట దర్గా శాసనములో చెప్పబడియున్నవి.[13]

ఇందు 41 వ పంక్తిలోని 'ఖణ్డి సణగర' అనునది ప్రస్తుత శనగారగ్రామమై యుండును. 'ఖణ్డి' యనునది యే యర్థములో వాడబడనో తెలియదు. 60 వ పంక్తిలోని 'బెజవాంకె' యనునది సమీపమందున్న వేరొక గ్రామము. ప్రస్తుత మిది బెజ్జంకి యని పిలువబడుచున్నది.

ఈ శాసనము లభించుటతో కాకతీయులు తెలుగుదేశమునందు స్థిరపడినతర్వాత ఒక గరుడబేతని (మొదటి బేతని) నాటి యతని శాసనము(లు) తప్ప మిగిలిన ఆ వంశము వారందరివి దొరికిన వనవచ్చును. మొదటి బేతని గూర్చి కాజీపేట దర్గా శాసనమందును, గూడూరు శాసనమందును, బయ్యారం శాసనమందును విశదముగా చెప్పబడియున్నది.

శాసనాంత మందున్న 'దొణయ్య' అనునది శాసనము చెక్కినవానిపేరు గావచ్చును.

## మొదటి శాసన మూలము

### మొదటి వైపు

1. స్వస్తి సమస్త భువ
2. నాశ్రయ శ్రీ ప్రి
3. థ్వీ వల్లభ మహా
4. రాజాధి రాజ ప
5. రమేశ్వర పరమ
6. భట్టారకం
7. సత్యాశ్ర
8. య కుళతిళకం చా
9. ళుక్యాభరణం శ్రీ
10. మత్రైళోక్య మ
11. ల్లదేవర విజ
12. యరాజ్య ము
13. త్తరోత్తరాభివృద్ధిం
14. ప్రవర్ద్ధమాన మా
15. చంద్రార్క్కా
16. తారం బ
17. రం సలుత్తుమిరె
18. తత్పాద పద్మోప
19. జీవి సమధి

### రెండవ వైపు

20. గత పంచమహా
21. శబ్ద మహాసా
22. మంతం శ్రీమత్రై
23. ళోక్యమల్ల వల్ల
24. భ ప్రసాదాసాది
25. త మహామహి
26. మాస్పద పరమ
27. మాహేశ్వర ప
28. తిహిత చరితం
29. వినయ విభూ
30. షణం శ్రీమన్మ
31. హా సామంత కా
32. కతియ పొలు
33. ల ర స స్వర్ణక వర్
34. ష 975 నెయ
35. విజయ సంవ

---

13. Early History of the Deccan. Vol. II; P. P. 578–79.



36. త్సరద కార్త్తిక
37. దమావాస్యె యు
38. మాదిత్య వార
39. దన్ను సూర్య్య

**మూ డ వ వై పు**

40. గ్రహణ పర్వ్వ నిమి
41. త్తదిం ఖణ్డి సణగ
42. ర దొళ్ పెగ్గడ మ
43. ధువపయ్యంగ
44. ళ మాడిసిద మ
45. ధువేశ్వరక్క[డి]య
46. పూర్వ్వాగ పున్నె
47. య గావుణ్డను మం
48. ముప్పదయ్య గావు
49. ణ్డను మనొడం బడి
50. సి ధారాపూర్వ్వకం మా
51. డి పన్నెరడు మనెయు
52. నివేశనము మాదు
53. గణముం కిఱియ
54. గరి ఱియెంబ రాటణ
55. ము మూరబడగణ
56. ఱాకుంబెయ అయిగి
57. ప్పత్తు మత్తక్కరియ
58. కెయ్యుం మిప్పత్తు
59. మత్త క్కెసు కాళుం
60. బెజవాంకెయ కా
61. బె రడ్డియుం దణ్డ

**నా లు గ వ వై పు**

62. మ రడ్డియుం ప్రభు
63. నాగరాజను మనొ
64. డం బడిసి పిరియ
65. కెఱయ పెఱగొ (ం)
66. దు మత్త స్నీ నే లనుం
67. సర్వ్వాభ్యంతర సిద్ధి

68. యాగె కొట్టర్॥ సా
69. మాన్యోయ న్ధర్మ్మః
70. సేతు న్ని (నృః) పాణాం కా
71. లే కాలే పాలనీయో
72. భవద్భిః। సర్వా (ః) నేతా
73. న్భావిన ఞ్పా ర్థి (ః) * వేంద్రా
74. న్భూయో భూయో
75. యాచతే రామ భ
76. ద్రః॥ బహుభి ర్వ్వసు
77. ధాదత్తా రాజభి స్స
78. గరాదిభి (ః)। యస్యయస్య
79. య దాభూ
80. మి స్తస్య తస్య తదా
81. ఫలం (మ్)॥ స్వదత్తాం పర
82. దత్తాం వా యో హరే
83. తి(త) వసున్ధరాం షష్ఠి (ష్టి)
84. వ్వర్షః సహస్రాణి
85. విష్టాయాంజాయతే
86. క్రిమిః। (।) దొణయ్యం

## రెండవ శాసనము

ఈ శాసనము గ్రామమునకు వెలుపల దక్షిణమున జైనవిగ్రహములున్న గుట్టప్రక్కన శిథిల శివాలయముదగ్గర స్థాపితమైయున్న శిలాస్తంభముపై నలువైపుల చెక్కబడినది. ఇది చాళుక్య చక్రవర్తియగు త్రిభువనమల్లదేవుని (ఆరవ విక్రమాదిత్యుని) రాజ్యకాలమునకు చెందినది. ఇందు అతని పాదపద్మోపజీవియు, నన్మకుండాపురవరేశ్వరుడును, సమధిగతపంచమహాశబ్ద మహామండలేశ్వరుడును అగు కాకతీయ బేతరసరు ప్రశంసింపబడెను. తదుపరి సమస్తప్రశస్తోపేతుడును, పంచమహాశబ్దాలంకారాలంకృతుడును, శ్రీ మన్మహామండలేశ్వరుడు నగు జగద్దేవరసరు చెప్పబడి వాని దండనాయకుడగు కొండమయ్య శకవర్షము 1022 వ్యయ సంవత్సరము మాఘశుద్ధ 15 గురువారము చంద్రగ్రహణ నిమిత్తముగా పుల్కునూరు 70 లో చేరిన సనగరము దగ్గర కలెయగావుండ ననుమతితో అచటి స్వయంభు భీమేశ్వరదేవునకు నొక మోటబావి, పన్నెందు మత్తరుల కరంబ భూమి, సర్వబాధా పరిహారముగా నొసంగెను.

ఇందు చెప్పబడిన శకవర్షము 1022 వ్యయ సంవత్సరమునకు సరిసమానము కాదు. కాని వ్యయ సంవత్సరము శకము 1028 కి సరియగునది యొకటి దగ్గరలో కలదు. ఆ సంవత్సరమున మాఘశుద్ధ పౌర్ణమి గురువారమునాడు చంద్రగ్రహణము వచ్చెను. శాసనమందున్న 1022 శకవర్షములోని మాఘ మాసమందు చంద్రగ్రహణము లేదుగనుక 1022ను 1028 గా సరిచేసుకొనుట యుక్తమని తోచును. ఆ విధముగా సరిదిద్దుచో శాసనకాలము క్రీ.శ. 1107 జనవరి 10 వ తేదీ గురువారమునకు సరియగును. కాకతి రెండవ బేతరాజు సుమారు క్రీ.శ. 1098 వరకు జీవించి యున్నట్లును, అప్పటినుండి అతని పుత్రుడు త్రిభువనమల్ల దుర్గరాజు అనుమకొండ పాలకుడైనట్లును కాజీపేట దర్గాశాసనమునుబట్టి చరిత్రకారులు ఇంతవరకు తలంచుచుండిరి. కాని దీనినిబట్టి రెండవ బేతరాజు క్రీ. శ. 1107 వరకు జీవించి యుండెనని నిశ్చయమగుచున్నది. అయితే దుర్గరాజు యొక్క దర్గా శాసనము సంగతి యెట్లు? ఈ శాసనమొక విధముగ నసంపూర్తియైనదని తెలియు చున్నది. శాసన శిలయొక్క పై భాగము కొద్దిగా భిన్నమగుటచే నాలుగువైపుల మొదటి పంక్తులు కొద్దిగా నష్టమైనవి. కనుక శాసనముయొక్క నాలుగు ప్రక్కలలో ముందు వెనుకలు నిర్ణయించుట కూడ సందిగ్ధముగనే యున్నది. దానిలో ఒకవైపు మొదటి పంక్తులలో అస్పష్టముగనున్న (1018 లేక 1012) ప్రమోద సంవత్సర కార్తిక బహుళ అమావాస్య ఆదివారము సూర్యగ్రహణము నాడు బేతరాజు చేసిన దానము చెప్పబడెను. ఈ కార్తిక అమావాస్యనాటి సూర్యగ్రహణముతో గూడిన ఆదిత్యవారము శక. సం. 1012 కు సరియగు క్రీ. శ. 1090 నవంబరు 24 కు సరిపోవుచున్నది.

తర్వాత వేరొకవైపున భిన్నమైన మొదటి పంక్తిలోనే బహుధాన్య సంవత్సరముగలదు. అది క్రీ.శ.1098కి సరిపోవుచున్నది. ఇక్కడ శకవర్షములు కానవచ్చుట లేదు. మరియు ఈ కీర్తిస్తంభమును ప్రతిష్ఠించిన వెవరోకూడ తెలియదు. పై భాగమందు దుర్గరాజే ప్రసక్తమై యుండుటనుబట్టి యీ తేదీని అతనికి చెప్పుకొని 1098 నాటికి అతని తండ్రి మరణించి యుండునని తలంచబడెను. దీనినిబట్టి తేలినదేమనగా ఈ దర్గా శాసనములో చెప్పబడిన రెండు తేదీలు బేతరాజుయొక్కగాని, దుర్గరాజుయొక్కగాని శాసన కర్తృత్వమునుగూర్చి నిశ్చయముగ తెలుపుట లేదు. అట్టిస్థితియందు ఆ శాసనము దుర్గరాజుదేనని నిర్ణయించి చెప్పుటకు తగిన ప్రబలహేతువు గానరాదు. కాగా త్రిభువనమల్ల దుర్గరాజునకు చెందిన ప్రశస్తి దానియందున్న మాట వాస్తవము. ఆ క్రమమిట్లు గలదు.

..........................

..........................

..........................

1. .........[1012] నెయు ప్ర
2. ప్రమోద సంవత్సర కార్త్తిక బహు
3. ల 15 ఆదిత్యవారదందు
4. సూర్య్యగ్రహణ నిమిత్త మా
5. పల్లియం కాళాముఖతపోధన
6. రుం శ్రీపర్వ్వత ప్రసిద్ధ మల్లికా
7. ర్జ్జున శిళామువాచార్య్యరు వ
8. ప్ప పర్వ్వ[తా] వళియ రామేశ్వ
9. ర పండితర్గ్గె తచ్ఛిష్య పరంపరా
10. చార్య్యకముం తదుత్పన్ననిధిని
11. ధానశుల్కదణ్డాధణోపభోగ్యముం
12. త్రిభోగాభ్యంతర సిద్ధియు మప్పన్తు
13. సర్వ్వనమస్యమాగె తత్పాద ప్ర
14. క్షాళన హస్తోదక దానపూర్వ్వక
15. మిత్తు సలిసి దా నిజ గురుధర్మ్మ
16. మం సముద్ధరి సలా బేతరసన
17. సుపుత్ర॥ కుళతిళకం సకల జ
18. గత్తిళకం సౌజన్య సార్వ్వభౌమనె
19. నిప్పగ్గళికెగె[పో]న్త మహామణ్డ
20. ళేశ్వరం దుర్గ్గనృపతి త్రిభువన మల్లం॥
21. పర భూపాళకరుక్కడంగి
    పోణిర్వ్వత్త్తమ్మి
22. క్కె యొళ్ సుక్కిమీయ్య
    రెయల్‌గణ్డన
23. తొణ్డనం కడదటల్యైక్కాళ్తనం బూణె
24. దిగ్భరితాత్మోజ్వళకీర్త్తిపర్వ్వతిరె లో
25. కాలోకమం శాశ్వతం ధరణీచక్రమ
26. నాళ్వతోళ్వలదగణ్డం దుర్గ్గ భూపాళకం॥
27. తన్నప్రధానరం బన్ధువర్గ్గమం పొదయూ

వే రొ క వై పు

........................

............ . ......

1. బహుధాన్య సంవత్సర శాహి
2. యుత్తరాయణ సంక్రాన్తియో ళ్నిజ
3. కులకీర్తిస్తంభస్వరూపమాగె ని
4. లిసిద శాసన గంభ మిదాచంద్రా
5. క్క తారంనిల్కె, మంగళంమహాశ్రీ॥

దుర్గభూపాలుని రాజ్యమును తెలియజేయు శాసనమిది యొక్కటేయని నేటివరకు తలచబడు చున్నది. కాని ప్రస్తుత శనగారపు రెండవ శాసనమునుబట్టి యీ యాధారముగూడ పోయినదని భావించవచ్చును. కాని త్రిభువనమల్ల బిరుదువహించి రాచకార్యములందు తండ్రికి తోడ్పడుచున్నట్లు దీని వలన స్పష్టమగుచున్నది. కనుక యువరాజుగ వ్యవహరించి యుండవచ్చును. ఈ శాసనకాలము అనగా క్రీ. శ. 1107 తర్వాతకూడ రెండవ బేతరాజెంత కాలముండెనో తెలియదు. క్రీ. శ. 1117లో రెండవ ప్రోలరాజుయొక్క మొదటి శాసనముగా భావించబడు చున్న అనుమకొండ పద్మాక్షి దేవాలయము దగ్గరి శాసనమునుబట్టి[14] రెండవ ప్రోలుడిప్పటికి రాజయ్యె

14. Ep. Ind. Ix. P. 256,

నని స్పష్టము. మధ్యనున్న పదిసంవత్సరముల వ్యవధిలో దుర్గరాజు రాజయ్యెనో లేదో సంశయము కలుగుచున్నది. కాని రెండవ బేతరాజు పుత్రులలో నితడే జ్యేష్ఠుడై రాజ్యార్హతకలవాడై యుండెననుటకు పైజెప్పిన దర్గాశాసనము తగు నిదర్శనము కాగలదు. అంతేగాక ఇటీవల నల్లగొండజిల్లా కొత్తపల్లి గ్రామము నందు కాయస్థ వంశ్యుడగు గంగయసాహిణియొక్క శాసనమొకటి బయల్పడెను. అందు కాకతి గణపతిదేవుని వంశమును వర్ణించుచు ఈ ప్రోలునిగూర్చి యిట్లు చెప్పబడెను.

'కాకేత్త వంశ తిలకః కులవర్ధనోఽభూత్
ప్రోలాఖ్య భూపతి రనంత గుణ ప్రవీణః
భ్రాతృవ్య మ ప్యవతి య శ్శరణం గతం స్వం
యేనోదయ క్షితిపతిః స్వపదే న్యధాయి'

ఇచట ప్రోలుడు తనను శరణుజొచ్చిన సోదర పుత్రునైనను రక్షించు ననుటలో నితనికి భ్రాతృవర్గముతో కలహము సూచితమగుచున్నది. దాయాద వర్గముతో నిట్టి కలహ కారణము అన్నయగు దుర్గరాజునుగాని వానికుమారునిగాని త్రోసిరాజని రాజ్యమపహరించు యత్నమే కాగలదు. ఆ కలహములో రెండవ బేతని యనంతరము రాజ్యార్హతగల దుర్గరాజు ప్రోలునిచే నిహతుడైనను కావచ్చునను సంశయముకూడ కలుగుచున్నది. పై శ్లోకములో 'కాకేత్త వంశ తిలకః' అను విశేషణము సరిపోవుచుండగా 'కులవర్ధనః' అను మరియొక విశేషణము ప్రోలుడు దుర్గని వంశమును తప్పించి తన వంశ వృద్ధిగావించెనని యూహించవచ్చును. కాకతీయ చరిత్రలో నిదియొక నూతనాంశము.

ఈ శనిగర శాసనమందు మహామండలేశ్వర బేతరసుని తర్వాత మహామండలేశ్వరుడైన జగద్దేవరస యొకడు పేర్కొనబడి యతని దండనాయకుడైన కొండమయ్య దానకర్తగా జెప్పబడెను. బేతరసరుకు జగద్దేవునకుగల సంబంధము 'తత్పాద పద్మోపజీవి' ఇత్యాది పదములతో సూచింపబడక పోయినను శాసనరచనావిధానములో పౌర్వాపర్యమును బట్టి బేతనికి జగద్దేవుడు ఉపసామంతుడై యున్నట్లూహించవచ్చును. ఈ జగద్దేవుడెవరు? ఇతడేల కాకతి బేతరాజునకు ఉపసామంతుడయ్యెను? అను విషయములు యోచింపవలయును. పరమార వంశమునకు చెందిన మాళవాధీశ్వరుడగు భోజరాజునకు పినతండ్రి మనువడు జగద్దేవు డొకడు కలడు. మాళవదేశము క్రీ. శ. 1062 ప్రాంతమున కాలచురి కర్ణునిచే నాక్రమించబడగా చాళుక్య ప్రథమ సోమేశ్వరుడు కుమారవిక్రమాదిత్యుని సైన్యముతో మాళవాధీశుని సహాయార్థము పంపెను. విక్రమాదిత్యుడు మాళవమునకేగి కాలచురి కర్ణుని తరిమి పరమార యుదయాదిత్యునికి మాళవరాజ్య మిప్పించి యతని పుత్రుడగు జగద్దేవుని స్నేహపురస్సరముగా కుంతల దేశమునకు తనతో గొనివచ్చి పుత్రప్రేమతో ఆదరించుచు గొప్ప పదవులలో నుంచినట్లు కొలనుపాక శాసనములలో జగద్దేవుడు చెప్పుకొనెను.[15]

'సశ్రీ చాళుక్యరామః సకల నృపశిరో
మణ్డ నాభ్యర్చితాంఘ్రిః
స్నేహా నానీయ ధారాపురవిభు విభవం
నిర్విశంతం వసంతమ్
దత్వార్ధం కున్తలోర్వ్యాః పితృజన
చరితైః పుత్రవ న్నానయం స్తం
లోకాలోకాద్రిసీమావనిపతి రభవ
త్తత్కుమార ప్రతాపాత్.'

ఈ కొలనుపాకశాసనము క్రీ. శ. 1104 నాటిది. క్రీ. శ. 1108 నాటి యితని వేములవాడ శాసనమం దితనిని గూర్చిన సంక్షిప్త ప్రశస్తి యిట్లు కలదు.[16]

'స్వస్తి శ్రీ లేంబాలవాడ [ద]
సమావాసో సమస్త ప్రశస్తో
పేత సమధిగత పంచ మ

15. A. P. Arch. Series No. 3. Pages 57-61 (V. 41).

16. ,, ,, ,, ,, Page. 19. Lemulavada.

హా శబ్దాళంకారాళంక్రిత శ్రీమ
న్మహా మండళేశ్వరం పా
రవార కుళతిళకం శ్రీ మజ్జ
గద్దేవరసరు......'

క్రీ. శ.1107 నాటి యీ శనిగర శాసనమందు కూడ నిదేవిధమగు ప్రశస్తి కలదు. (శాసనమూలము పంక్తులు 21—26 చూడవలెను.) వీనిని పోల్చి చూడగా ప్రస్తుత శాసనమందలి జగద్దేవుడు పరమార జగద్దేవుడేనని నిర్ణయించవచ్చును. (పాలవాసాధి పతియగు మేడరాజ పుత్రుడగు జగద్దేవుడొకడు ఇదే కాలమందు అనుమకొండ విషయమునకు సమీపముగా నరసంపేట ప్రాంతమున పాలన మొనర్చుచుండెను. అతనిని ఈ జగద్దేవునిగా భావించుట తగదు.)

గొప్ప రాజవంశమునందు జన్మించి చక్రవర్తి యొక్క ప్రత్యేకాభిమానమునకు పాత్రుడై యితర సామంతులకన్న మిక్కుటమగు నధికారప్రతిపత్తితో కొలను పాక రాజ్యమునకు రాజప్రతినిధిగా నియమింప బడెను. చాళుక్యసామ్రాజ్యమునందు ప్రాచ్యదక్షిణమున స్వయంపాలితమగు నేడువేల్గ్రామములతో గూడిన నొక ప్రధాన రాష్ట్రమునకు కొలనుపాక రాజధాని. ఇచటినుండి వేములవాడకుపోవు త్రోవలోనే ప్రస్తుత శాసనమున్న శనగరగ్రామమున్న సబ్బిసహస్రము కలదు. దానిని చక్రవర్తి యనుమతిపొందియో పొందకనో జగద్దేవుడు దురాక్రమణ చేసియుండును. ఈ విషయము తెలిసినను చక్రవర్తి ఉపేక్షించియుండును. కాని మొదటి ప్రోలుని కాలములోనే యిరుగుపొరుగు మండలములతోగూడిన అనుమకొండ విషయమును త్రైలోక్యమల్ల చక్రవర్తి శాశ్వతముగ కాకతీయులకు శాసనబద్ధముగా నిచ్చెనని వెనుక చెప్పబడెను. ఆ యిరుగుపొరుగు మండలములలో సబ్బినాడు చేరియున్న దనుటకు మొదటి ప్రోలుని శనిగరపు మొదటి శాసనమే నిదర్శనము. కనుక కాకతీయులకు శాశ్వతభుక్తమై యున్న సబ్బిమండలమును రెండవ బేతరాజు తన యేలుబడినుండి పోగొట్టుకొనెను. యుద్ధముద్వారా వ్యవహారము నిర్ణయించుకొనుటకు జగద్దేవుడు రాజాభిమానియగు మండలాధిపతి. అతనితో యుద్ధము చేయుటయనగా స్వయముగ రాజు నెదుర్కొనుటయే. కొలనుపాక—7000 స్వయంపాలిత రాష్ట్రముగదా. కనుక రెండవ బేతరాజు చేయునదిలేక తనకు జరిగిన అన్యాయమునుగూర్చి చక్రవర్తికి సవినయముగా విన్నవించుకొనవలసివచ్చెను. ఈ సందర్భమున ప్రజ్ఞావంతుడగు తన మంత్రి వైజదండాధిపతి యితనిని (రెండవ బేతరాజును) చక్రవర్తియొద్దకు గొనిపోయి తదనుగ్రహపాత్రునిజేసి, సబ్బిసహస్రమండలమును తిరిగి కాకతీయుల యేలుబడిలోనికి వచ్చునట్లొనర్చెనని అనుమకొండ పద్మాక్షిగుడి యొద్దనున్న రెండవప్రోలుని క్రీ.శ. 1117 నాటి శాసనము[17]నుబట్టి తెలుసుకొనవలసివచ్చుచున్నది.

క్రీ. శ. 1107 నాటి యీ శాసనమందు తత్సూచకముగా ముందు బేతరాజు చెప్పబడి తర్వాత 'తత్పాద పద్మోపజీవి' మున్నగు సామంత సూచక విశేషణములు లేకుండ జగద్దేవుడు చెప్పబడెను. కాని జగద్దేవుడు తాత్కాలికముగ చక్రవర్తి నిర్ణయమునకు బద్ధుడై సబ్బిసాయిరమును బేతరాజున కిచ్చినను మనసులో వైరమును మాత్రము విడువలేదు. సమయము కనిపెట్టి మరికొందరు మాండలికులను కలుపుకొని అనుమకొండను ముట్టడించెననియు బేతరాజుయొక్క పుత్రుడైన రెండవ ప్రోలరాజు అట జగద్దేవుని తరుమగొట్టెననియు వేయిస్తంభముల గుడిలోని రుద్రుని శాసనమందు జెప్పబడెను.[18]

పంక్తి 37. అన్యచ్చానుమకొండ నామ నగరీం
సంవేష్ట్యయో యం స్థితో నానామండలికా
,, 38. న్వితో భువి జగద్దేవస్సదేవప్రభః।
స్తబ్ధ స్తంభిత ఏవ కార్యకరణే౽శక్తః
,, 39. క్షణా న్నిర్గతః శ్రీ మత్ప్రోలనృపస్య
తస్యజయినః కింబ్రూమహే గౌరవమ్॥

జగద్దేవునియొక్క యీ యనుమకొండ ముట్టడి యే సందర్భములోజరిగెనో ప్రస్తుతము

17. Ep. Indica IX, P. 263, lines 31-37.
18. Corpus—Part 2; Page 10.

తెలియదు. రెండవ ప్రోలుడు రాజ్యమునకు వచ్చు నపుడు తన అన్నయగు దుర్గరాజుతోగాని వాని సంతతితోగాని కలహించి యుండునని వెనుక చెప్పబడెను. ఆ సందర్భము నందైనను జగద్దేవుని యనుమకొండ ముట్టడి జరిగి యుండవచ్చును.

ఈ రెండవ శాసనమందు కాకతి బేతర సరుకు తన కితరత్ర చెప్పబడు 'త్రిభువనమల్ల' బిరుదు చెప్పబడలేదు. ఇతనికి చెందిన యితర శాసనములందు కూడ నితడాబిరుదుతో జెప్పబడలేదు. అతని సంతతి వారి శాసనములందే యా బిరుదు అతనిపరముగా వాడబడియున్నది.

స్థల నామములలో 33 పంక్తిలోని పుల్గునూరు—70 నేటి సిద్దిపేట తాలూకాయందలి పుల్లూరు గ్రామమునకు చెందినదై యుండును.

శాసనము చెక్కినవాడు దామరసుడని తుది పంక్తులలో గలదు.

## రెండవ శాసనమూలము

### మొదటి వైపు

1. స్వస్తి సమస్త భువనాశ్రయ
2. శ్రీ ప్రిథ్వీవల్లభ మహారా[జా]
3. ధిరాజ పరమేశ్వరం ప
4. రమ భట్టారకం సత్యాశ్రయ
5. కుళతిళకం చాళుక్యా
6. భరణం శ్రీమత్రి (త్రి)భు
7. వన మల్లదేవర విజ
8. యరాజ్య ముత్తరోత్తరా
9. భివిద్ధి ప్రవర్ద్ధమాన
10. మాచంద్రార్కతార[o]బ
11. రం సలుత్తమిరె తత్పా
12. ద పద్మోపజీవి సక(మ)
13. ధిగత పంచమహా శ
14. బ్ద మహామండళేశ్వరం
15. న[న్మ]కుండా పురవ
16. రేశ్వర [పర]మ మాహే
17. [...] పతిహిత చరి[తం వి]
18. [న]య విభూషణ [...]
19. మన్మహామణ్డళేశ్వరం
20. [కాక]తియ బేతరసర్

### రెండవ వైపు

21. సమస్త ప్రశస్తోపేత స
22. మధిగత పంచమహా
23. శబ్దాళంకారాళంక్రితం
24. శ్రీ మన్మహామణ్డళే
25. శ్వరం జగద్దేవరసర



26. దండనాయకం కొణ్డ
27. మయ్యు సకవర్షద
28. 1022 నెయ వ్యయ స[ం]
29. వత్సర మాఘ సు 15
30. గురువార దన్దు సోమ
31. గ్రహణ నిమిత్త మాగి
32. ధారాపూర్వ్వకం మాడి
33. పుల్గునూర 70 అ బ
34. ళియ సనగరద కళె
35. య గావుండన్మనొడం
36. బడిసి అల్లి న స్వ
37. [యం]భు భీమేశ్వర దే
38. వర్గె [పూ]ర్వ్వదలు నడవ

మూ డ వ వై పు

39. బాడెన పరిగె యెంబ
40. రాటణమం దేవర ప
41. దువణ దెసయ హన్నెర
42. డు మత్త క్క రంబద కె
43. య్యుం సర్వ్వబాధా ప
44. రిహార వాగి ప్రతి
45. పాళిసి ఖండ స్ఫటిత
46. నవసుధా కమ్మక్కం దే
47. వరనివేద్యక్కం కొట్ట
48. ర్॥ సామాన్యోయం
49. ధర్మ్మ సేతుర్నిపాణాం
50. కాలే కాలే పాలనీయో
51. భవద్భిః। సర్వ్వా నేతాన్
52. భావినః పార్త్థి వేంద్రాం (న్) ,
53. భూయో భూయో యా
54. చతే రామభద్ర [ః]*॥ మ
55. ద్వంశజాః పరమహీప
56. తి వంశ జాతా పాపా ద

నా లు గ వ వై పు

57. పేత మనసో భువి
58. భావి భూపా [ః]* యే పా
59. లయన్తి మమధర్మ్మ
60. మిధుం (దం) సమస్తం తేషా [ం]
61. మయా విరచి తోంజ
62. లి రేషమూర్ధ్ని॥ బహు
63. భిర్వ్వసుధాదత్తా రా
64. జభి స్సగరాదిః య
65. స్య యస్య యదాభూ
66. మి స్తస్య తస్య త
67. దాఫలం॥ స్వదత్తాంప
68. రదత్తాం వా యోహరే
69. తు (త) వసున్ధరాం॥
70. షష్టి (ష్టిం) వ్వర్ష సహస్రాణి
71. విష్ఠాయాం జాయతే
72. క్రిమి॥ – దామరసన
73. బరహ మంగళ మ
74. హా శ్రీ శ్రీ శ్రీ.

మూడవ శాసనము*

ఈ శాసనము రెండవ ప్రోలరాజునకు చెందినది. ప్రస్తుతము గ్రామములో నొక శివమందిరమునబడు రేకులషెడ్డులోనున్న శివలింగమున కెదురుగా నిలబెట్టబడి యున్నది. స్తంభమునకు నాలుగు వైపుల శాసనము చెక్కబడియున్నది. శాసనభాష కన్నడమైనను తెలుగుచాయ లచ్చటచట కాననగును. చాళుక్యచక్రవర్తియగు శ్రీ మజ్జగదేకమల్లదేవుని విజయరాజ్యమునందు అన్మకుండాపురవరేశ్వరుడైన మహామండలేశ్వర కాకతీయ ప్రోలరసరు చెప్పబడెను. అతని పాదపద్మోపజీవియగు మహాసామంతాది ప్రశస్తోపేతుడగు సబ్బిసవదొర రేపొల్ల కురువరసరు వర్ణింపబడెను. అతనిదండనాయకుడును కమ్మకులాభరణుడును ఆత్రేయగోత్రపవిత్రుండును శ్రీ మద్దండనాయక మండపరసరు శ్రీ పార్త్థేశ్వరదేవునకు నైవేద్యాదికముకొరకు, తపోధనుల ఆహారవస్త్రములకు శకవర్షము 1071 కు సరియగు శుక్ల సంవత్సర

---

* భారతి. జూన్, 1970 (సంపు. 47. సంచిక. 6) పుట. 28 లో ముద్రితమైనది.

చైత్రశుద్ధ 15 గురువారము సోమగ్రహణ నిమిత్తమున కొంతభూమి గానుగ మున్నగు వాటిని ఇచటి (స్థానపతియగు) చంద్రాభరణపండితునికి ధారాపూర్వకముచేసి సమర్పించెనని చెప్పబడెను.

ఇందలి దానకాలము క్రీ. శ. 1149 మార్చి శుక్రవారమునాటి చంద్రగ్రహణమునకు సరియగుచున్నది. అది కళ్యాణిరాజగు ప్రతాపచక్రవర్తి యిమ్మడి జగదేకమల్లుని అంతిమరాజ్యకాలము. దీనిని బట్టి కాకతీయ రెండవ ప్రోలుడు క్రీ. శ. 1149 వరకు చాళుక్యులకు విధేయసామంతుడై యుండెనని స్పష్టము. ఇతని మొట్టమొదటి శాసనము అనుమకొండ ప్రక్కనున్న గుట్టమీది పద్మాక్షి ఆలయమందుగల శిలా స్తంభముపై గలదు. అది క్రీ. శ. 1117 నాటిది.

ఈ మూడు శాసనములవలన తెలియవచ్చు విశేషాంశములు :

1. కాకతీయులు తెలుగుదేశమందు స్థిరపడిన తర్వాత లభించిన మొదటి శాసనము మొదటి ప్రోలునిది:

2. మొదటి ప్రోలుని రాజ్యపాలనము క్రీ. శ. 1053 నాటికే కలదనియు, రెండవ బేతరాజు 1107 వరకును, అట్లే రెండవ ప్రోలరాజు క్రీ. శ. 1149 వరకును జీవించియుండిరనియు నిశ్చయముగ తెలియుచున్నది.

3. సబ్బిసాయిరము మొదటి ప్రోలుని రాజ్యములో చేరియున్నను రెండవబేతరాజుకాలమున అన్యాక్రాంతమై మరల కాకతీయులచే సంపాదించబడెనని తెలియుచున్నది.

4. క్రీ. శ. 1149 వరకు రెండవ ప్రోలుడు చాళుక్య చక్రవర్తికి విధేయసామంతుడుగనే యుండెను.

5. మొదటి ప్రోలుడు, రెండవ బేతరాజు, రెండవప్రోలరాజు ముగ్గురు పరమ మాహేశ్వరులని యీ శాసనములందు చెప్పబడి, వారు చేసిన దానములుకూడ మధువేశ్వర, భీమేశ్వర, పాణేశ్వర దేవళములకు చెందినవగుటచే మొదటి కాకతీయులు కేవలము జైనమతానుయాయులనెడి యుపోహ నిరాధారమైనది. వారు జైనమతముతోపాటు శైవమతాభిమానులుకూడనై యుండిరి.

6. వేయిస్తంభములగుడి రుద్రుని శాసనమందు అనుమకొండను ముట్టడించినట్లు చెప్పబడిన జగద్దేవుడు పరమారజగద్దేవుడని చెప్పవీలగుచున్నది.

## మూడవ శాసనమూలము

### మొదటి వైపు

1. స్వస్తి సమస్త భువ
2. నాశ్రయ శ్రీ
3. ప్రిథ్వీ వల్లభ మహా
4. రాజాధి రాజ పరమే
5. శ్వర పరమభట్టారకం
6. సత్యాశ్రయ కుల
7. తిలకం చాలుక్యాభర
8. ణం శ్రీమ జ్జగదేక మ
9. ల్లదేవ విజయ
10. రాజ్య ముత్తరోత్తరా
11. భివిద్ధి ప్రవర్ధ్ధమా
12. న మాచంద్రార్క్కతా
13. రం సలుత్తు మిరె త
14. త్పాద పద్మోప జీవి
15. త సమధి గత
16. పంచమహా శబ్ద మ
17. హా మండళేశ్వరం న
18. న్మకుండా పురవరేశ్వ
19. శ్వరం పరమ మాహే శ్వ
20. రం పతిహిత చరి
21. తం వినయ విభూషణం
22. శ్రీ మన్మహా మండ
23. ళేశ్వరం కాకతీయ

### రెండవ వైపు

24. ప్రోళలరసర తత్పాద
25. పద్మోప జీవిత సమ



26. స్తోత్రేత సమధిగత
27. పంచ మహాశబ్ద మ
28. హా సామంతం విజయ
29. లక్ష్మీకాంతం కామినీ కామ
30. దేవ మతెవుగె కావ నా
31. మాది సమస్త ప్రశస్తి సహి
32. తం శ్రీమతు సబ్బి సహ
33. స్రము సవదొర రేపొల్ల
34. కుఱువరసరం తత్పాద
35. పద్మోపజీవిత సమ
36. స్తోత్రేత సమధిగత పంచ
37. మహాశబ్ద మహాసామం
38. తాధిపతి మహాప్రచం
39. డ దండనాయకం వస్తుగు
40. ణ వస్తునాయకం కమ్మ
41. కులాభరణం యాశ్రిత జ
42. నపోషణం సుజనపవి
43. త్రం యాత్రేయగోత్రం శ్రీ
44. మద్దండనాయకం మండ
45. పరసరు శ్రీ పార్త్వేశ్వర
46. దేవరిగె నిత్యనివేద్య
47. క్కం నందాదివిగం త
48. పోధన రాహార క

**మూ డ వ పై పు**

49. ప్పడదానక్కం శక వ
50. ష 10[7]1 నెయ
51. శుక్ల సంవత్సరద చై
52. త్ర సుద్ధ [1]5 యు గు
53. రువారం విషు సంక్రాం
54. తి వ్యతీపాత సోమ
55. గ్రహణాధి పుట్ప(వ్య)?
56. కంనూ యొంబ రాటదం
57. తొఱెయ మూడణద
58. నీరునేల మత్తరుం కి
59. సు కాడద మత్తు రు [...]
60. త్తుమ నికరద మత్త
61. రు పత్తుమం రాటన (దనే)
62. ల పన్నెరదు కొల్ల బంత్త
63. ము (మ)ంగాణము మం చం
64. ద్రా భరణ పండితదేవ

65. ర కాలు (లం) గచ్చిఁ ధారా పూ
66. ర్వఁకంమాడి కొట్టరు॥
67. గోకర్ణ్ణఁవంశ ప్రిప
68. భూషణ శీత గోమా
69. న్ ధామ త్రిలోక్యోభవ సం
70. స్థిత సత్రపభు (ణ్యా) (।) భాగీరథీ
71. జల విజాట శరణ్య దేవ
72. యాత్రేయ గోత్ర నిధి వ
73. ర్ధఁను మండ పాయ్యఁన్॥[19]
74. సామాన్యోయం ధమ్మఁ
75. సేతు (ని (నృఁ) పాణాం కా
76. లే కాలే పాలనీయో (భ)

నాలుగవ వైపు

77. వద్భి స్సర్వాఁ న్యే(నే)తా న్భావినః
78. పార్థిఁవేంద్రా న్భూయో
79. భూయో యాచతే రా
80. మచంద్రః॥ బహుభిర్వఁసు
81. ధా దత్తా రాజభి స్సగరాది
82. భిః (।) యస్య యస్య యదా భూ
83. మి త్త (స్త)స్యతస్య తదాఫలం(మ్)॥
84. కపాలం నా(భిదా)నేన స్వమాం
85. సం సురయా సహ (।) ఇంద్రప్రి (ప్ర)
86. చ్ఛతి చాండాలః కి మమేధ్య
87. మతః పరం(మ్) ॥దేవి (వ)బ్రాంహ్మణ
88. విత్తం హి యోహరేతి (త) మనీషి
89. ణ (ః) పాదపాంశుగతః కల్ప
90. కోటి దుగ్గఁతి సంస్థితే॥ కోటిప
91. య కొలె పన్ని కోఁటి తపో
92. ధనర వేద ద్విజ (ర)ం కొదకోటి
93. యెనె కోటి తీర్థఁది కోటి
94. మహాదీన దొళలిద నింతి
95. దనళిద॥ స్వదత్త(త్తాం)ం
పరదత్తం (త్తాం) వా
96. యో హరతి (రేత) వసుంధరాం షష్టిః
97. ర్వఁషఁ సహస్రా (ప్రా) ణి
మి (వి) ష్ఠాయాం
98. జాయతేక్రిమి [ః]*॥ చిత్తపె (వి) ళితి
99. ధమఁ మానెత్తానుంకిది [స్మె]
100. మిదుబగె [ద]ధు నరస్సాత్తి
101. ద కుటుంబ సహితం య[న్ని]
102. న్నడ రౌరవక్కె పుళ...
103. పుళను బొదురు...
104. కొండోజన మగనెను...
105. ...పాజ...

19. ఇది తెలుగు విభక్త్యంతములతో సంస్కృత వసంతతిలకవృత్తమును పోలియున్నది.



# మన పదకవితా పద్ధతి: హరిదాస-దాసకూటములు

డా. వేటూరి ఆనందమూర్తి

మన దేశమున ప్రాచీనమగు 'వచన సంకీర్తన పద్ధతి' యొక ప్రక్కన ప్రచారమునకు వచ్చు చుండగా మఱియొక వంకన భాషా వ్యుత్పత్తియు సంగీత పరిజ్ఞానమును పుష్టిగాగల శిష్టులగు వాగ్గేయ కారులు'కొందఱుసంకీర్తనాపరిశుద్ధిన్ దగఁ జేయబూని' లక్ష్యలక్షణసమన్వయముతోఁ బదకవితా పద్ధతికిఁ గూడ చక్కని మార్గమును గల్పింపసాగినారు. వారిలో క్రీ॥ శ॥ 15 వ శతాబ్ది నడిమి భాగము నుండియు లక్షణశుద్ధిగల పదకవితలతో దేశము నుఱ్ఱూత లూగించిన తాళ్లపాకవారే ప్రముఖులును ప్రథమా చార్యులును అనవలసి యున్నది. వారికిఁ బూర్వమిట్టి పదకవితలు దేశీయతాముద్రకలిగి జానపదుల వాగ్వ్యవ హారముననేగాని లక్షణశుద్ధిగలిగి శిష్టసాహిత్యమున జేర్పఁదగినవియు, కాలమును గర్తృత్వమును గుర్తింప వీలగునవియు నధికముగ లేవనియే చెప్పవలెను. ప్రాచీ నుల ద్విపదలు, రగడలు, తరువోజలు కాక—అట్లు కాలమును కర్తృత్వమును గుర్తింపఁదగిన పాటలలో పదములలో నాచనసోమునిదని చెప్పఁబడు జాజ్జరయు; గార్లపాటి లక్ష్మయ్యగారివని యిటీవలనే తలఁపఁబడు చున్న ఏగంటి (లేదా యాగంటి) వారి పదములలోని 'శివశివ యనమేలు తుమ్మెదా' అను తుమ్మెదపదమును, 'సూర్య సోమా వహ్ని నడుమా, శౌర్యమానే చిలుకా గంటి' అనెడి ఏలయు—కొన్ని మాత్రమే కనపడు చున్నవి. వీనిలో ఏగంటి వారి పదముల రచనాకాలము విషయమున విమర్శకులలో నభిప్రాయభేదము లేక పోలేదు. శ్రీ మల్లంపల్లి శరభయ్యగారు 'ఏగంటి గ్రామమున వెలసిన నంజేశ్వరున కంకితములు'గా 'ఏగంటి వారి వచనములను శైవవేదాంత ప్రతిపాద కములైన గేయము'లను రచించిన లక్ష్మయ్యగారు (ఏగంటి లక్ష్మయ్యయు, పిడుపర్తి లక్ష్మయ్యయు గారనియు) పోసెట్టి లింగకవిచేత నవచోళ చరిత్ర ప్రస్తావనలో నాదిమ శివ కవిస్తుతిలో బాల్కురికి సోమనాథుని పిమ్మట సుప్రసిద్ధ గేయ రచయితగా స్తుతియింపఁబడిన గార్లపాటి లక్షయ్యగారే' యనియు వివరించినారు.[1] కాని ఆంధ్ర వాగ్గేయకార చరిత్రను (1958 లో) ప్రకటించిన శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావుగారు ఏగంటివారినిగూర్చి చర్చించుచు 'వీరు తాళ్లపాకవారికి సమీపకాలంలోని వారనిగాని, తరువాతి వారనిగాని అనడానికి ఇబ్బంది ఉండదు. తాళ్లపాకవారిలో పదకర్తలలో మూడవ వాడయిన చినతిరుమలాచార్యుడు 16 వ శతాబ్ది చివరివఱకూ ఉండినవాడే. యాగంటివారూ వీరబ్రహ్మంగారూ కూడా ఆ కాలంలోకానీ, 17 వ శతాబ్ది మొదటి భాగంలో పుట్టి మధ్యభాగం వఱకు ఉండినవారని చెప్పుకోవచ్చు — వీరబ్రహ్మంకంటే అన్యుడైన యాగంటి గురుదెవ్వడో మరొక వ్యక్తిగాని, తాళ్ల పాకవారివలె యాగంటివారని వరుసగా కొందరు తత్త్వకర్తలుగాని ఉండి ఉండాలి' అని అభిప్రాయ ములను వెలిబుచ్చియున్నారు. (చూ. వాగ్గేయకార చరిత్ర—పుటలు 452-453.)

ఏది యెట్లున్నను ఏగంటి సిద్దప్ప, సిద్దయ్య నామకులు కొందఱు భిన్నులుకూడ నున్నట్లు తెలి యుటచేత 'ఏగంటివారు' ఒక్కరుకాక పలువురని శ్రీ రజనిగారు భావించినట్లే తలఁపవలసియున్నది. యాగంటిలింగని సంబోధించి ఏలలు రచించిన

---

1. చూ. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార సంచిక (మద్రాసు) వా. III. నెం. 1. 1954.

లక్ష్మప్పగారే గార్లపాటి లక్ష్మప్పగారై సోమనాథుని కించుక తరువాతివారు కావచ్చునేమోగాని యాగంటి వారి (యాగంటి ఇంటిపేరేమో!) పదాలుగా ప్రసిద్ధి గాంచిన

ఓపితే పుణ్యము చేయుము ఓపకుంటే
ఊరకుండుము
పాపము సేయుకు మింతే పదివేలు జీవుడా!'
'పారలి సంసారమ్ము బొరయు కుండెడియోగి
యరసి కోర్కెలయందు నంట బోడు'

మొదలగు లక్షణశుద్ధిగల పదములను రచించినవారు మాత్రము తాళ్లపాకవారి రచనల తెలిగెఱిగియుండిన వారుగానె తోచుచున్నారు. వారి పదములలోని రచనా నిర్మాణము, పదప్రయోగసరళి నా కట్టి యూహను కల్గించుచున్నది. తాళ్లపాకవారు తమ సంకీర్తనచ్ఛాయాపహారులనిట్లు తెగడినారు.

'వెఱ్ఱులాల! మీకు వేడుక కలిగితేను
అఱ్ఱువంచి తడు కల్లంగ రాదా?'॥ పల్లవి॥

ఉమిసిన తమ్మలో నొక కొంత క్రమము
సమకూర్చి చవిగొని చప్పరించనేల
అమరంగ ఛాయాపహారము చేసుక
తమ మాట గూర్చితే దైనము వగడా? ॥3॥

చిబికి వేసిన గింజచేతఁ బట్టగనేల
గబుక కెంగిలి బూరె గడుగంగ మఱియేల
తొబుక కవిత్వాల దోషాలఁ బొరలితే
దిబుకార నవ్వడా దేవుడైనాను ॥4॥

ఎన్నగ శ్రీ వేంకటేశుఁ దాళ్లపాక
అన్నమాచార్యులు అఖిల దిక్కులు మెచ్చ
ఉన్నతిలోఁబాడి రొకఁ డెవ్వఁడో తాను
సన్న నొరసునట సమ్మతా హరికి ॥10॥[2]

'వీరశైవాచార విభవము మదిలోను గోరక శివుని గొలువనేరక వేంొక్కమతమున విహరించు హీనుల జేరంగ నేగంటి సిద్ధయ్య నగెబో' అను నాదిగాగల యాగంటివారి పదాలను స్మరించి తిరస్కరించినదేనా పై సంకీర్తనము? ఏమో! కాకున్న వారి సన్నిహితకాలమున వర్ధిల్లి వారివలెనే పదరచనగావించి వారి యాగ్రహమున కట్లు పాల్పడినవారు వేరెవ్వరో తెలుగువారే పదకర్తలేఱయి యుండవలెనుగదా!

తెలుగున విమాత్మనుగు నీ పదకవితా ప్రక్రియకు సురూపమును గల్పించుటలో తాళ్లపాక వారి కంతకుఁ బూర్వపు సంస్కృత కర్ణాటకాది భాషలందలి వాగ్గేయకారుల రచనలు చాలవఱకు దోహదమిచ్చియుండునను విషయము నీవఱకే తద్‌జ్ఞులు పలువురు వ్రాసియున్నారు.[3] తాళ్లపాకవారే తమ సంకీర్తన లక్షణమున జయదేవుని గీతగోవిందమును స్మరించినారుగదా! అందలి యష్టపదులను బోలిన రచన లెన్నియో తాళ్లపాకవారివి సంస్కృతాంధ్ర భాషలం దున్నవి. కావున ఆ విషయమున చర్చకుఁ దావులేదు. ఇక కన్నడభాషయందలి ప్రాచీన గేయ రచనలను గూర్చి—కర్ణాటక సారస్వతమున 'ప్రాచీన మగు వీరశైవయుగమునకుఁ జెందిన నిజగుణశివ యోగి, బసవేశ్వరుఁడు మున్నగువారు గావించిన భక్తి జ్ఞాన వైరాగ్య బోధకములగు గేయాత్మక రచనలు వందలకొలదిగా నున్నవి. వానిని గనుక కళాకోవిదు లందముగా నాలపించు సంప్రదాయము నేటికిని కన్నడదేశమున గలదు. ఈ కృతులను శాస్త్రము లనియే వీరశైవ విద్వాంసులు వ్యవహరింతురు. ఇవి ప్రాయికముగా మన 'వచన సంకీర్తన పద్ధతి'కిఁ జెందిన రచనలవంటివే యనవచ్చును. ప్రాచీనములగు నీ కర్ణాటక శైవవచన గీతములే మనవారి వచన సంకీర్తనములకు మూలప్రాయములగు రచనలు. అటు తర్వాత దాససాహిత్యయుగమున మధ్వాచార్య పరంపరకుఁ జెందిన నరహరితీర్థులు, శ్రీపాదరాయరు ప్రభృతులు కూడ సంకీర్తన పదరచన గావించినారనియు, వారి రచనలు కొంతవఱకు అన్నమాచార్యులు నిర్వచించి చెప్పుకొన్న పదరచనలకు దోహదమిచ్చి యుండుననియు పూజ్యులు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తెలిపియున్నారు. ఆ యభిప్రాయము సమంజసమైనదే కాదగును. వీరిలో నరహరితీర్థులు పూర్వులేగాని

2. ఈ కీర్తనము అన్నమాచార్యుని రచనగా అధ్యాత్మ సంకీర్త సంపుటములందు ముద్రితమైనది. అన్నమయ్య రచనలను భూతకాలిక క్రియారూప ముతోఁ బేర్కొన్న యీ రచన నాకుఁ జూడఁగా పెద తిరుమలాచార్యులుఁదిగా తోచుచున్నది.

3. చూ. వాగ్గేయకార చరిత్రము. శ్రీ రజని గారు. పు. 120. 152—153

శ్రీపాదరాయరుమాత్రము అన్నమాచార్యులవారికన్నను వయసున నించుక పెద్దలైనను దాదాపు సమకాలికులే. ఇక నటుతర్వాత కన్నడమున పదరచనలో విశిష్టతను గడించుకొన్న వ్యాసరాయ పురందరదాసాదులు, సమకాలికులేయయ్యు పదరచనా విషయమున అన్నమయ్యకుఁ దరువాతివారే. ఇటు చూడఁగా ఆంధ్ర కర్ణాటక సాహిత్యములందు కొంచె మెచ్చుతగ్గుగా సమకాలమందే లక్షణశుద్ధిగల పదరచనకును సంగీత సంప్రదాయమునకును బునాదులు పడినవేమో అనిపించును. తెలుఁగున అన్నమాచార్యుఁడుఁ పదకవితా పితామహుఁ డనిపించుకొన్నట్లే కర్ణాటకమున అంతకుఁ బూర్వపు పదకవు లొకరిరువురున్నను పురందరదాసే ఆ స్థానము నలంకరించెను. ఆ నాళ్లలో నీ పదకవు లిరువురును గలసికొనినారు కూడ.

## అన్నమయ్య—పురందరదాసు

అన్నమాచార్య చరిత్రమున చిన్నన్న యిట్లు వ్రాసినాడు.

> 'గద్య పద్యముల డెబ్బదిరెండుమంది
> యాద్యులచేఁ గొని యాడించుకొన్న
> రసికుండు శ్రీ పండరంగ విట్ఠలుఁడు
> కొసరెడు భక్తి చేకూరఁ జేసేత
> నెనయు సంధ్యలకు నీళ్లియ్యఁ జేకొనుచుఁ
> దనరు పురందరదాసాహ్వయుండు
> పరమ భాగవతుఁడై పరగుచు నంద
> వరకులాగ్రగణియైన వైష్ణవోత్తముఁడు
> సవరించు మురవైరి సంకీర్తనములు
> కువలయంబునఁ జేరుకొన్న మాత్రమున
> తలఁచిన భూత భేతాళ పిశాచ
> ములు పాఱిపోవ నిమ్ముల శుభంబెసగ
> విని కనియును లోన వెఱఁగంది కొనుచు
> చని తాళ్లపాకశాసనుఁ డన్నమయ్య
> వెన్నునిఁగానె భావించి కీర్తించి
> సన్నుతిసేయు నాచార్య వర్యుండు
> నతని విట్ఠలునిఁగా ననయంబు దలఁచి
> ప్రతిలేని గతుల సంభావించెనపుడు.'
>
> (పుటలు 44—45)

దీనినిబట్టి వారిరువురును గలసికొని రన్నది చారిత్రిక సత్యమే. కాని ఈ యుదంతమును సందేహించుచు వ్రాసిన శ్రీ పంచముఖిగారి అభిప్రాయములతో నేనేకీభవింపఁ జాలకున్నాను.[4]

ఏలన వ్యాసరాయపురందరదాసుల జీవిత విశేషములనుగూర్చి సంప్రదాయజ్ఞులు పలు పలు విధముల వాకొనుచున్నను శ్రీ బి. వెంకోబరావుగారు ప్రత్యక్షరప్రమాణ మనదగు సోమనాథ కవీశ్వరుని వ్యాసయోగి చరితమునకు వెలయించిన సమర్థమును, సమగ్రమును నగు పీఠికలోని చారిత్రిక విషయములను బట్టి పై విషయమున సందేహములకుఁ దావులేదని చెప్పవచ్చును. వ్యాసరాయలవారు (క్రీ॥ శ॥ 1446—1539) పంద్రెండేండ్లపాటు తిరుపతిలో శ్రీనివాసుని యాలయమున నర్చకత్వము నెఱపుచు క్రీ॥ శ॥ 1486—1498 సం॥ ల నడుమ ననేక పర్యాయములు విద్యానగరమునకు వెళ్లివచ్చు చుండినవారలే! 1498 లో వెళ్లి యక్కడే స్థిరపడినవారును, అందువలన ఆ పంద్రెండేండ్ల వ్యవధిలో గాని, కాదనుకొన్న పక్షమున 1498 లో గాని పురందరదాసు వ్యాసరాయల నుపదేశగురువుగా గ్రహించి యుండును. అట్లయెడ చిన్నన్న వ్రాసినట్లు 'పరమ భాగవతుఁడగు' పురందరదాసాహ్వయుఁడు మహా మహిమోపేతంబులగు సంకీర్తనముల రచించి విఖ్యాతిగాంచిన వృద్ధుఁడగు అన్నమయ్యను (అతని యవసాన కాలమగు) క్రీ॥ శ॥ 1503 లోగా వెన్న దర్శించియుండఁడు

4. చూ. కర్ణాటకద హరిదాససాహిత్య—విద్యారత్న శ్రీ ఆర్. ఎస్. పంచముఖి. ఇందు వారి సమావేశము అసంభవ మనుటకు వీరిచ్చిన యుపపత్తులివి. 1. చిత్తశుద్ధిగల మాధ్వుఁడగు పురందరదాసు అన్నమాచార్యుని వెన్నునిగానె భావించి కీర్తించుట జరిగియుండదు. 2. ఈతడు విద్యానగరమున వ్యాసరాయఁలకడ నుపదేశమును పొందిన పిదపనే పురందరదాసాహ్వయుడై పదరచనకుఁ కడంగెను. వ్యాసరాయలవారు క్రీ॥ శ॥ 1500 తర్వాతగాని విద్యానగరమునకు రాలేదు. అందువలన అటు తర్వాత వారి అనుగ్రహము పొందిన పురందరదాసు అన్నమయ్యను

డేని దర్శించి యుండుటలో నసంభావ్య మేమియును లేదు.5

ఇక మాధ్వుఁడగు పురందరదాసు అన్నమయ్యను 'వెన్నునిగానె భావించి కీర్తించుట' పొసగదను శ్రీ పంచముఖిగారి యాక్షేపణమునకు అదియా సమావేశము జరిగినే యెంతోకాలమునకు వైష్ణవుఁడగు చిన్నన్న చెప్పిన తీరని సరిపెట్టు కొనుటయే సమాధానము కాగలదు. కావున నాయిరువురి చారిత్రిక సమావేశమును గూర్చి మనము సందేహింప నవసరములేదు. ఇక వ్యాసరాయుల వారిని దర్శించుటకుఁ బూర్వమే పురందరదాసునకు వైరాగ్య మబ్బినది. అప్పటికే యాతఁడు దేశము నలుమూలల వ్యాపించుచున్న భక్తిగేయసారస్వతమును వినివిని జీర్ణించుకొని యున్నవాఁడు. కావుననే అనతికాలము ననే గొప్ప పదరచయితగా పేరుపొందిన పురందర దాసు నంతటి వానిని శిష్యునిగాఁ బడయుటయే విశేషమన్నట్లు వ్యాసరాయలవారు 'దాసరందరె పురందర దాసరయ్య' అనియు, వారి రచనలను 'పురందరోపనిషత్తు' అనియు బేర్కొని ప్రశంసించి నట్లు చెప్పుకొనుట.

వ్యాసరాయలవారును, పురందరదాసులును ఆనాళ్లలో ద్వైతమత ప్రచారమున కెంతయో బాటు బడిరి. తుళువ నరసానాయకుని కాలమున తిమ్మరుసయ్య ప్రోద్బలమున విద్యానగరము చేరుకొన్న వ్యాస రాయలవారు తరువాత శ్రీ కృష్ణదేవరాయల కాధ్యాత్మిక దేశికులై తమ మతమునకుఁ బ్రగొత్తరూపు గల్పించి వ్యాసకూటమును నిర్వహించినారు. ఈ కూటము పండితవర్గమునకు జ్ఞానబోధ కల్గించుట కేర్పడినది. అట్లే పురందరదాస కనకదాస విజయదాసాదులతో గూడిన 'దాసకూటము'ను గూడ నిర్వహించి పామర లోకమునకు గేయరచనల మూలమున భక్తిభావమను భిక్షను పంచిపెట్టినారు. కన్నడనాడున ప్రసిద్ధమగు నీ వ్యాసదాసకూటసంప్రదాయములకు ఒకవిధముగా నాటి వైష్ణవకూటములు దోహద మిచ్చినవేమో అని పించును. నాటి జియ్యర్‌మఠము, అహోబలమఠము మున్నగువానికి సంబంధించిన వైష్ణవకూటములు దేశమునందలి యాధ్యాత్మిక వికాసమునకై పాటుపడి మతసంప్రదాయమును బోషించెడివి. తోడ్తో వానికి సహకారముగా సుగమమగు భక్తిమార్గమున వైష్ణవ మత ప్రచారమునకై తాళ్లపాక వాగ్గేయకారు లవత రించి 'హరిదాసకూటము' నిర్వహించినారు. అన్నమాచార్యాదులు 'నీ దాసుండనై దాసరినైతి' ననియు, 'భువిహరిదాసుల'మనియు, 'దాసవర్గ' మనియుఁ దమ్ముదాము వర్ణించుకొనినారు. తెలుగు దేశమందలి వైష్ణవ దాసరి భజన (హరిదాస) కూటములకు పాళ్లపాకవారే భిక్ష పెట్టినవారు—ఇటు చూడఁగా నాటి వైష్ణవకూటములే ద్వైతుల వ్యాసకూట సంప్రదాయమునకును, తాళ్లపాకవారు నిర్వహించిన 'దాసరి కూటము'లే కర్నాటక 'దాసకూట' సంప్రదాయమునకును దారి చూపినవేమో అనిపించును.

### హరిదాసకూటము—దాసకూటము

శ్రీ రామానుజుల విశిష్టాద్వైత సంప్రదాయమునకును శ్రీ మధ్వాచార్యుల ద్వైత సంప్రదాయమునకును సూక్ష్మమగు తత్త్వ విషయముననే తప్ప స్థూలమగు హరిభక్తి విషయమున నెట్టి విభేదమునులేదు. రెండు సంప్రదాయములును భక్తి భావమునకు పట్టముగట్టునవియే. కనుక జన సామాన్యమున హరిభక్తిని వ్యాప్తికిఁ దెచ్చి మధుర మగు భక్తిగేయ సారస్వతమున దేశమును రసప్లావితము గావించుటలో నాఁడీ హరిదాస—దాసకూటములు రెండును కలసికట్టుగ వ్యవహరించిన వనియే నా విశ్వాసము. ఈ రెండు కూటములకును మూల

---

5. పురందర దాసులవారి జన్మదేశ కాలము లనుగూర్చి కర్ణాటక విద్వాంసులలో నేకాభిప్రాయము లేదు. శ్రీ వేంకోబరావుగారు వ్రాసిన చారిత్రిక విషయములను సమన్వయించుకొని అన్నమాచార్యుని పురందరదాసు దర్శించినట్లు చిన్నన్నచెప్పిన చారిత్రిక సంఘటనము క్రీ॥ శ॥ 1500 ప్రాంతమునందు జరిగియుండునని విశ్వసించి 'యౌవన దల్లి శ్రీ హరి పాదనం బదే మూవత్తువరుష మోహాబ్ధి యల్లిబదు' అని పురందరదాసే చెప్పుకొన్నపదము ననుసరించి చూడఁగా నాతని జననము సంప్రదాయజ్ఞులు తలపోయునట్లు క్రీ॥ శ॥ 1484 న కాక క్రీ॥ శ॥ 1470 ప్రాంతమగునని తెలియనగును. దీనిని బట్టి యాతని జీవితకాలము క్రీ॥ శ॥ 1470—1564 కాఁదగునని నా భావన.

పురుషులనఁదగు మహనీయులు అన్నమాచార్య వ్యాస తీర్థ వరేణ్యు లిరువురుమ సమకాలికులే. ఇరువురును సాళ్వ నరసింగరాయనిచే సత్కరింపఁబడినవారే. వీరి తరువాత నీ విషయమున విజయనగర ప్రభువుల యౌదార్యము నూతగాఁ గొని వైష్ణవులగు పెద తిరుమల చినతిరుమలాచార్యులును, మాధ్వులగు పురందరదాసులవారును కలసి గణనీయమగు సేవ గావించిరి. వీరికాలముననే కర్ణాటక సంగీత సంప్రదాయమునకుఁ గూడ చక్కని పునాదు లేర్పడినవి. ఈ నా భావమున కీ క్రిందచూపు నుపపత్తులే కారణము.

1. వృద్ధుఁడును, పదకవితాపితామహుఁడును నగు అన్నమాచార్యుఁడు పురందరదాసులను వయసునఁ చిన్నవారైనను ఘనముగా సంభావించి కీర్తించినారు.

2. తాళ్లపాకవారును పురందరదాసాదులును భజనకూటముల నిర్వహించిరి. ఉభయకూటముల వారును తిరుమలయందును, విద్యానగరమందును భజనకూటముల నడుపుచు శ్రీనివాసునిమీది భక్తి గేయముల నాలపించినారు. [6] పాండురంగ విట్ఠలుని మీద పదులకొలదిగా పదములు రచించినారు. [7] ఆంజనేయస్వామి నారాధించినారు.[8]

3. తాళ్లపాకవారి రచనలకును, పురందర దాసాదుల కీర్తనలకును భావమునందును, పదప్రయోగము నందును మాత్రమేకాక పదరచనా వైవిధ్యము నందును పదస్వరూపమునందును సామ్యమెంతో యున్నది. దీనికా భజనపరుల సాన్నిహిత్యమే కారణమని నా తలంపు.

'శరణు శరణు సురేంద్ర సన్నుత
శరణు శ్రీసతి వల్లభ
శరణు రాక్షస గర్వసంహర
శరణు వేంకటనాయకా'

అని భజన పద్ధతిరో అన్నమాచార్యునిదిగా నాటి నుండి నేటిదాక సాగుచున్న యీ పై సంకీర్తనమును జదివి పురందరదాసులవారి యీ కీర్తనము గూడ జదువుఁడు.

'శరణు శరణు సురేంద్ర వందిత
శరణు శ్రీపతి సేవిత
శరణు పార్వతి తనయ మారుతి
శరణు సిద్ధి వినాయక'

(చూ. అన్న. చరిత్ర. పీఠిక—పు—67.)

ఇట్లే నేటికిని దక్షిణదేశమందలి హరిభజన సంప్రదాయమున 'తోడయమంగళం' అనఁబడు తొలి పాటలలో నొక్కటిగా సర్వత్ర వ్యాప్తిలోనున్న 'నారాయణతే నమో నమో—భవనారద సన్నుత నమోనమో' అను కీర్తనము తాళ్లపాక వారిదిగా రాగిరేకులలో నున్నది. అందు దీనిది పాడి రాగము. వ్యవహారమున నిప్పుడిది మధ్యమావతి రాగమున నాలపింపఁ బడును. దీనినే కడపటి చరణమునగల 'నాదప్రియ తే నమో

---

6. 'ఇతవు చేసినవారికిది—

సిగ్గుతో విజనగర శృంగారవనములోన
వెగ్గళించి కోనేటి శ్రీ వేంకటేశుండు.'

(అన్నమా—3—583.)

'విట్ఠలయ్య వీధికేగి వేగవచ్చేవో—
విజయనగరములో వీధుల వీధులవెంట
భుజమురికలతోడఁ బొద్దుపుచ్చేవో
త్రిజగములు నేలిన తిరువేంకటేశుండ
భజన నిలిచితి భూపతి చెరువుకాడను.'

(అన్నమా—4—40)

7. చూ — తాళ్లపాకవారి సంకీర్తనములు. (3—228, 229, 269, 287, 482) మఱియు—

'వసుధఁజూడఁ చిన్నవానివలె—పరగ నేడు
మూటడెబ్బది యేడుగురి చేత
నిరవైపొడించుకొన్నాఁ డీ విట్ఠలుడుఁ
గట్టిగాఁ బుండరీకుఁడు కడువేడుకఁ బెట్టిన
యిట్టికపై నున్నాఁ డీ విట్ఠలుఁడు.'

(6—217)

8. చూ—తాళ్లపాకవారి సంకీర్తనములు. 8—138; 9—230; 6—223. విజయనగరమందలి హనుమంతుని గూర్చిన యీ కీర్తనలే కాక దేశమున, బలుతావుల నెలకొన్న ఆంజనేయస్వామిని గీర్తించిన పదము లెన్నో యున్నవి.

నమో' అనుదానిని 'పురందర విఠలతే నమోనమో' అని మార్చి పురందరదాసరాయుల పదముగా కర్ణాటకులు కొందరు పాడుచున్నారు (చూ. తాళ్ల సంకీర్తనములు. 11 వ సం|| పీఠిక పు. 2)

4. తాళ్లపాక పెదతిరుమలాచార్యుడును, పురందరదాసాదులును అచ్యుతదేవరాయల వారిచేత నాదరింపఁబడి వారి కభీష్టముగా సంకీర్తనములు చెప్పినవారే.[9] తాళ్లపాకవారి సంకీర్తన భండాగార వ్యవస్థను సుస్థిరపఱచి, రాగిరేకులపై వారిపదముల నన్నిటినిఁ జెక్కించి భద్ర పఱచుటకుఁ దగిన యవకాశము గల్పించినది అచ్యుతదేవరాయలే. శ్రీ కృష్ణదేవరాయల యనంతరము వ్యాస దాస కూటములకు అచ్యుతదేవరాయలు ఆయనలేని కొరతను దీర్చినవాడే. తదాస్థాన సంగీత విద్వాంసుడును, తోడరమల్ల బిరుదాంచితుఁడును నగు బయకార రామామాత్యుఁడు నాటి సంగీత ప్రపంచము నుత్తేజపఱచినవాడే. చిన్నన్న అష్టమహిషీకళ్యాణమున తోడరమల్లుని స్మరించినాడు.

5. నాటివారి సంకీర్తనములకు సమకాలమున చిన్న ప్రదేశములలో ప్రచారమును గల్పించుటకై స్వరసాహిత్యములతో వానిని నేర్పుటకును, వ్రాయించుటకును అచ్యుతదేవరాయల కాలమున గొప్పకృషి జరిగినది. తత్ఫలితమే తాళ్లపాకవారి సంకీర్తన భండాగార వ్యవస్థ. మంగళగిరి, సింహాచలము మున్నగుచోట్లగల వైష్ణవాలయములలోఁ జెక్కింట ఆనాడు 'సంకీర్తన అరుళప్పాడు' సాగుచుండినది. ఆ దృష్టితో సంగీతాభ్యాసమునకును, శిక్షణకును నా డవసరమేర్పడినది. అప్పటికే ప్రత్యేకత గడించుకొనుచుండిన కర్ణాటక సంగీత పద్ధతికి కట్టుదిట్టములు కల్పించుటకై పురందరదాసు సంగీత విద్యాభ్యాసమున కనువగు రీతిని సరళి జంటవరుసలను, బహువిధ గీతాలంకారములను రచించెను. సంకీర్తన భండాగారమున సంగీతవిద్వాంసు లుండిరి. వారు పాడెడివారు. అర్హులకు నేర్పెడివారు. వారు 'పాటలెల్లా పాడుమంటూ భూమికెల్ల నోర నూరిపోసి' నారు. నరసింగన్న 'పాడఁ జెప్పను వర్ణపద్ధతి నీడు జోడు లేదన సభఁజొచ్చి వాదించి వరగిన ధీశాలి.' సంగీతవిద్యాభ్యాసతత్పరులు అప్పటికే పురందర దాసులవారి యలంకారాదులను నేర్చుచుండిరి.

'సరిగమ పదనిస సనిధప మగరి
సరిగమ రిగమప—సనిధప మనుచు
బహువిధాలంకృతు ల్పాడుకొల్పి—

'గ్రామ సంతతుల మేళముల్ సేసి ఆళాప మార్గమును జూపుచు' ప్రారంభకులు పాడుకొనుచుండినట్లు చిన్నన్న ఉషాకళ్యాణమున వివరించెను.

'జోడుకూడి గురుశిష్యు లిరువురును ఆవృత్తి చేయుచు—తద్దివ్య ప్రబంధ నివహంబునెల్ల తాళమాడితముగ' పాడుకొనుటను చిన్నన్నయే పరమయోగి విలాసమున విశదీకరించెను.

తాళ్లపాకహరే స్వరసాహిత్యములతోఁ గూడిన తమ సంకీర్తనములను (రాగిరేకులపైఁ జెక్కించుటకు వీలులేక కాఁబోలును) విలువెత్తు శిలాశాసనములందు లక్ష్య లక్షణ సమన్వయముతోఁ జెక్కించుకొనినారు. ఆలయప్రాకారకుడ్యములలో నిలిపి స్వామిసందర్శనమునకు వచ్చువారికెల్ల వానిని చూచి నేర్చుకొను భాగ్యమును గల్పించుటకే వారట్టి యత్నము సల్పిరోయేమో !'

చినతిరుమలాచార్యుఁడు 'సంకీర్తన లక్షణము'ను తెనిగించెను. బయకార రామామాత్యుఁడు అచ్యుతదేవరాయలకుఁ దోడుగనుండిన ఆరవీటి రామరాయల కభీష్టముగా స్వరమేళకళానిధిని రచించెను. పురందరదాసు సరళి జంటవరుసలకును లక్షణ గీతములకును నెన్నుకొన్న మాయామాళవగౌళమేళము యొక్క ప్రాశస్త్యమునే రామామాత్యుఁడం దుగ్గడించినాడు.

ఒక్క సంగీత విద్యకేకాదు అచ్యుత దేవరాయలు సంకీర్తనవిద్యకు దోడుగా నాట్యవిద్యను గూర్చికూడ మిక్కిలి శ్రద్ధవహించెను. విద్వత్సభారాయరంజకు రాండ్రని ప్రసిద్ధిగాంచిన ముద్దుకుప్పాయి, హనుమసాని మున్నగు నట్టువకత్తెలను ప్రత్యేకించి యతఁడు

---

9. చూ. తి. తి. దే. శాసన సంపుటము. సం|| 4—సంఖ్య 20, 1532 క్రీ. శ.

రాజధానినుండి సంగీతనృత్యవిద్యోపదేశమునకై తిరుపతి యాలయమునకుఁ జేర్పించెను.

ఇటుచూడఁగా అచ్యుతదేవరాయలు, అళియ రామరాయలు, వారి ననుసరించి తాళ్ళపాకవారు, పురందరదాసులవారు, బయకార రామామాత్యులు నందరును కలసి కర్ణాటక సంగీత పద్ధతికి 'పట్టాభిషేకము గావించినట్లున్నారు. కాని స్వరసాహిత్యములతో నుండిన అప్పటి వాగ్గేయకారుల పదము లీనాడు మనకు కనుమరుగై పోవుట కాతరువాత జరిగిన విద్యానగరవినాశమే ప్రధానకారణమై యుండును. శిలాబద్ధమై తాళ్ళపాకవారి కీర్తనము లొకటి రెండును, ఎట్లో సుబ్బరామదీక్షితులవారికి చిక్కి సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో నుదాహృతములైన పురందరదాసులవారి కీర్తనలు కొన్నియును రూపు చెడక స్వరసహితముగ నేటికి మనకు లభించియున్నవి. ఆనాటి సంగీత సంపద నేటికి మనకు మిగిలిన దంతియే !

6. క్రీ. శ. 1540 ప్రాంతమున చిన తిరుమలాచార్యుడు పునర్నిర్మించిన అలమేల్మంగాపురాలయమున గోపురప్రాకారమంటపశిలాస్తంభకుడ్యాదులం దెచ్చటబట్టిన నచ్చట నాటి వాగ్గేయకారుల వ్యక్తిత్వమును వెల్లడించు శిల్పము లెన్నియో నాకుఁ గానవచ్చినవి. చిన తిరుమలయ్య అచటి యాలయమున పదకవితాపితామహుని శిలామూర్తినే ప్రతిష్ఠించి యుండెను. కాని నేడది కానరాకున్నది. ఇక నచటి శిలాస్తంభములందు అన్నమార్య, పెద తిరుమలార్య, చిన తిరుమలార్యుల శిల్పములున్న విషయమును మన్మిత్రులు శ్రీ ఏ. వి. శ్రీనివాసాచార్యులవారు వ్రాసియే యున్నారు. నాకుఁ జూడఁగా వారివేకాక వ్యాసరాయలు, పురందరదాసులు, రామామాత్యులు అచ్యుతదేవరాయలు ప్రభృతుల యాకృతులుగా గుర్తింపఁదగిన శిల్పములుగల శిలాఫలకములుగూడ నందున్నవి. కొండమీద నేడు మనకు లభించిన తెలుగు లిపి స్వర శాసన ఫలకముల వంటి వీ యలమేల్మంగాపురాలయ ప్రాకారకుడ్యములందుగూడ నేమేని యుండునేమో అని చూచితినిగాని శిథిలమైన యాప్రాకారమునందట్టి శిలలేవియు నాకుఁ గానరాలేదు.

పైని వివరించిన హేతువులను బురస్కరించుకొని అచ్యుతదేవరాయలవారి కాలమున వారి ప్రోత్సాహమున కళాదృష్టితో నీ హరిదాస దాసకూటములు రెండును నేకముఖమై పరిశ్రమించిన వనుట విస్పష్టము. నాటి వైష్ణవాలయములే ముఖ్యముగ తిరుమలమీది శ్రీనివాసాలయమే—కళానిలయమై కళాకేంద్రమై వర్తిల్లినది. ఉదారులగు ప్రభువులయు, సమర్థులగు వాగ్గేయకారులయు, లక్షణజ్ఞులగు విద్వాంసులయు, కుశలురగు కళాకారులయు ప్రాపున నాటికళాలతిక చక్కగా చిక్కగా దేశమంతయు నల్లుకొని మూఁడు పూవులు నారుకాయలునై వర్ధిల్లినది.

---



# దొరకని బొమికముక్క

శ్రీ ఆర్. యస్. కె. మూర్తి

ఎండిపోయిన బొమికె ముక్కకోసరం ఆ రోజల్లా ఆరాటపడుతూ తిరుగుతూనే ఉంది, వీధి చివరన ఉండే ఎర్రకుక్క.

ఏ పెంపుడు కుక్కలాగానో అది బిస్కెత్తులు తినాలనో, చేపలసూపు తాగాలనో, హాయిగా అమ్మగారి ఒళ్లో పడుకోవాలనో కోరుకోలేదు. అది కోరుకున్న దల్లా కేవలమొక బొమికెముక్కమాత్రమే.

అదీ ఎండిపోయి, బోలుపడిన బొమికె ముక్కే. ఏముంటుంది దాంట్లో? మాంసమా? మజ్జా? ఏమీ ఉండదు. మరీ ఎర్రకుక్క దానినే ఎందుకు కోరుకుంది?

ఇంకేదీ ఆ వీధి కుక్కకు అందుబాటులోకి రాదు కాబట్టి, ఎండిపోయిన బొమికె ముక్కనే కాసేపు నోట కరుచుకొని సరదాగా ఆనందించాలని ఆశ పడింది, వీధి చివరన ఉండే ఎర్రకుక్క.

రోజల్లా ఆరాటపడినా దాని కా బొమికె ముక్క దొరకలేదు.

*  *  *

రోజల్లా బొమికె ముక్కకోసరం, ఎండిపోయి బోలుపడిన బొమికె ముక్కకోసరం, ఆరాటపడుతూనే ఉన్నాడు, గోపాలం. ఆ రోజతనికి సెలవురోజు.

ఆ సెలవు రోజున అతను ఏ క్లబ్బుకోవెళ్లి రమ్మీ ఆడుకోవాలనో, బారుకువెళ్లి బీరుతాగుదామనో, లేదా ఏ నైటుహోంటుకోవెళ్లి హాట్‌ప్యాంట్ అమ్మా యిలతో డ్యాన్సు చేద్దామనో కోరుకోలేదు.

అతను కోరుకున్నదల్లా ఆ సెలవు రోజున తీరికగా టిఫినుచేసి, హాయిగా ఏ మ్యాటినీకోవెళ్లి, తీరుబాటుగా రోజును గడిపివేద్దామని మాత్రమే.

టిఫినుతిని, సినిమాకు వెళ్లటంకూడ పెద్ద సరదాయేనా? ఏముంటుందా సినిమాలో? చెత్త కాఫీహోటలు టిఫినులో? రెండు రూపాయలతో తీరే సరదా. ఇంత స్వల్పమైనదానినే ఎందుకు కోరు కున్నాడతను?

అంతకంటే పెద్దసరదాలు అతనికి అందు బాటులోకి రావుకాబట్టి.

ఏదో ఎండిపోయిన బొమికెముక్కనే నోట కరుచుకొని, తృప్తిగా ఆనందించాలని ఆశపడ్డాడు, గోపాలం—ఎవరి అభిమానపుత్రుడు (ఆర్) పెంపుడు కుక్క కానందువల్ల యమ్. ఎ. చదివికూడ ఎల్. డి. సి. ఉద్యోగం చేస్తున్న గోపాలం.

రోజల్లా ఆరాటపడినా గోపాలాని కా సరదా తీరలేదు.

*  *  *

ఆరోజుకి తనను వేధించబోయే సమస్యలేమిటీ అని ఆలోచిస్తూ కాసేపు నిద్ర మంచంమీద దొర్లా డాడు, గోపాలం. రోజూ అతనికదో అలవాటు. ప్రతి రోజూ నిద్రలేస్తూనే ఆ రోజుకి తానెదుర్కోవలసిన సమస్యలేమిటా అని ఆలోచిస్తాడతను. అలా ఆలో చిస్తే ఎన్నో సమస్యలు! బద్ధకంతో పేర బెట్టు కున్న ఆఫీసుపని. స్నేహితునికి అప్పుయిస్తాననీ నాలుగు రోజులుగా దాటవేస్తున్న యాభైరూపాయలు. తాను బట్టలకొట్లో కట్టవలసిన వందరూపాయలు. ఫెయిరు కాపీ చెయ్యవలసిన కథ. అమ్మ ఉత్తరం...యిలా ఎన్నోసమస్యలు, ఆరోజున పరిష్కారంకోసరం అతని ముందు నిలబడతై. అయితే యివి ఫలానా అని ముందుగానే నిర్ధారణ కావటంతో అవి గోపాలాన్ని బాధించవలసినంతగా బాధించలేవు.

అయితే ఆరోజున మాత్రం గోపాలానికి చాల రిలీఫు కలిగింది, ఆ ఆలోచనల చివర. ఎందుకనంటే

ఆరోజు కతన్ని బాధించే సమస్యలేవీ అతనికి స్ఫురించలేదు. ఆ రోజతనికి సెలవురోజు. ఎవరో ప్రముఖ అతిధులు వస్తున్నారుట. వారికి స్వాగత మివ్వటానికి స్టేషనుకి రండంటూ ఆఫీసు లన్నింటికీ సెలవుయిచ్చారు. గోపాలాని కిలాంటి సెలవులు మామూలే. కాని అత నేనాడూ స్టేషనుకు వెళ్ళడు. అందువల్ల అది అతనికి పూర్తిగా సెలవురోజు.

పైగా ఆ రోజున అతని ఆలోచనల తీవ్రత ప్రసరించినంతమేర అతనికి ఎక్కడా నల్లమేఘాలు కనిపించలేదు. చాల ప్రశాంతంగా ఉంది, ఆ రోజుకి రోజుఫలం. పైగా యింకో సువార్త ఏమిటంటే ఆ రోజున గోపాలందగ్గర సినిమాకు వెళ్ళటానికి డబ్బు లున్నయి. ఇలాంటి సెలవురోజున వెళ్ళటానికి డబ్బు ల్లేకనో, లేక, చూడటానికి మంచిసినిమా లేకనో అతను బాధపడిన అనుభవం లేకపోలేదు. ఈ రోజు దగ్గరి థియేటర్లో చాలమంచి సినిమాకూడ ఉంది. కాబట్టి నిదానంగా స్నానంచేసి, నింపాదిగా టౌన్‌లో కాస్తంత టిఫినుతిని, మార్నింగుషోకి వెళ్ళివచ్చి, భోంచేసి, పడుకొని, నిద్రలేచి, సాయంత్రం సరదాగా అలా ఏ పార్కుకో వెళ్ళివచ్చి, రాత్రి కేదైనా మంచిపుస్తకం చదువుకుంటూ పడుకుంటే...

ఈ ఆలోచన గోపాలానికి ఎంతో హాయినిచ్చింది. అమిత సంతృప్తితో అతను నిద్ర మంచంమీదనుండి లేచాడు. ముఖం కడుక్కొచ్చేసరికి కాఫీ యివ్వకపోతే అతను చాల చిరాకుపడతాడు. కాని సరోజ ఒక్కనాడూ అతనికలా కాఫీ యివ్వదు. ఆ చికాకుతోనే అతని చిరాకుజీవితంలో కొత్తరోజు ప్రారంభమౌతూ ఉంటుంది. కాని ఆ రోజున అదేమిటో అతను ముఖం కడుక్కొచ్చేసరికి సరోజ కాఫీయిచ్చింది. 'శుభ శకునం!' అనుకున్నాడు. భార్యమీద ఓ చిన్నజోకు వేద్దామనుకున్నాడు. కాని దానికి ఆమె ఏదో పుల్లవిరుపు సమాధానం చెప్తుంది. అతనిజోకుల నెన్నడూ సరోజ సరదాగా తీసుకోదు. ఎంత పెళుసుగా సమాధానం చెప్పటానికి వీలవుతుందో అంత పెళుసుగానూ సమాధానం చెప్తుంది. దాంతో బోలెడంత ఆత్మ పరిశోధన. 'ఈ నాటి తన సంతోష సరోవరంలో ఈ రాయి మునకపడటం గోపాలాని కిష్టం లేదు. అందుకని చిరునవ్వుతో కాఫీతీసుకొని, పేపరుతో పడక్కుర్చీలో చేరగిలపడ్డాడు, గోపాలం.

అరే, యిదేమిటీ గవర్నరు మళ్ళా వీళ్ళను పిలిచాడేమిటి ? ప్రభుత్వం ఏర్పరచటానికి ? గోపాలం కృంగిపోయాడు. అతనికి రాజకీయాలలో ఆసక్తి ఉంది. అతనో పార్టీని సమర్థిస్తాడు. ఇప్పుడీ గవర్నరు తన వారిని పిలవకుండా ఎదుటివార్ని పిలిచాడు, ప్రభుత్వంలోకి. ఈ నిరాశను ఎలా భరించాలో తెలియలేదు, గోపాలానికి. రాజకీయాలు మనలాంటివాళ్ళ చేతుల్లో ఉండే విషయాలుకావు; వాటిల్లో తీవ్రమైన ఇన్వాల్వు మెంటు ఉండకూడదని అనుకుంటూనే ఉంటాడు, గోపాలం. కాని ఉండలేదు.

ఇక ఆ రోజుకి పేపరు చదువబుద్ధి పుట్ట లేదు, గోపాలానికి. కాని యింకా అతనిచేతుల్లో కొంత కాలముంది, ఖర్చుపెట్టటానికి. ఏం చెయ్యాలి? నాలుగైదు పుస్తకాలు తిరగేశాడు. అవి చదవటానికి మన సొప్పటంలేదు. ఏం చెయ్యాలో తోచని ఆ శూన్యత్వంలో పాత ఉత్తరాల కట్ట ముందేసుకు కూర్చున్నాడు, గోపాలం.

అతనికదో హాబీ. ఏమీ తోచనప్పు డతను పాత ఉత్తరాలు చదువుతుంటాడు. అనేక రకాలైన ఉత్తరాలు. బంధువులు, స్నేహితులు, పత్రికలవాళ్ళు— రకరకాల వ్యక్తులు వ్రాసినవి. ఈ ఏడాదివి. నిరుటివి. కొన్ని సంవత్సరాల నాటివి. అందులో కొన్ని తాను వ్రాసినవే. తాను పొరుగూరు వెళ్ళినప్పుడు యింటికి వ్రాసిన ఉత్తరాలు. ఈ ఉత్తరాలు మొదట్లో, మొదట్లో భార్యపేర వ్రాస్తుండేవాడు. ఇప్పు డిప్పుడు కొడుకుపేర వ్రాస్తున్నాడు. అలా చూసుకుంటూపోతే, ఏడెనిమిది సంవత్సరాలనాడు మొట్టమొదటిసారిగా తాను కొడుక్కివ్రాసిన ఉత్తరం కనిపించింది.

ఆ ఉత్తరం చూడంగానే తేలుకుట్టినచోట కలుక్కుమన్న ట్లయింది; గోపాలం మనస్సుకి. అప్పుడు గోపాలం ఏదో ట్రైనింగుకని బెజవాడలో ఓ నెల రోజులు ఉండవలసి వచ్చింది. రూములో ఉండేవాడు. అలా ఉండగానే అతనో రోజున చిన్న ఎంగిలిపడ్డాడు. గోపాలమేదో సినిమాకు వెళ్లాడు. అక్కడే కలుసుకున్నాడామెను. పిల్లలున్న సంసార స్త్రీ. హాలంతా ఖాళీగా

ఉష్ణ వచ్చి అతని పక్కనే కూర్చొన్నది. అతనికేదో మనసు పీకింది. ధైర్యంచేసి పలకరించాడు. 'మాది ప్రక్కనేఉన్న పల్లెటూరండీ. లాస్టుబస్సు అందలేదు. ఈ రాత్రి కిక్కడే ఉండిపోవలసి వచ్చింది. ఎక్కడుం నాలో తోచక కొంతకాలమన్నా గడుస్తుందని యిలా సినిమా కొచ్చాను.' అన్నదామె. 'పోనీ ఈ రాత్రికి నా రూములో ఉందురుగాని రండి' అని ఆహ్వా నించాడు;

'ఎందుకులెండి, మీకు యిరుకుగా ఉంటుం దేమో?'

'ఫరవాలేదు. రూములో నేనొక్కడ్నే ఉంటు న్నాను' అన్నాడు గోపాలం. ఆమె సందేహమేదో ఊహించి నివృత్తి చేశాననుకున్నాడు.

క్యారియరు భోజనం ఆమెకూ, పిల్లలకూ యిచ్చి హోటలుకు వెళ్లివచ్చాడు, గోపాలం. పిల్లల కంటూ ఏవో మిఠాయిలూ అవీ పట్టుకొచ్చాడు. 'అమ్మాయికి పెట్టండి. బంతి పువ్వులా ఉంది' అంటూ తెచ్చిన పూలచెండు ఆమె చేతికిచ్చాడు. 'అది నిద్రపోతున్నదిలెండి. నేనేపెట్టుకుంటాను. రేప టికి వాడిపోతైకూడ.' అంటూ, తలలో పూలు తురుముకుంటూ, ఆమె చూచిన చూపుకు గోపాలం కంగుతిన్నాడు. తర్వాత జరిగిందంతా ఓ కలగా జరిగిపోయింది. గోపాలం ఎంగిలిపడ్డాడు. తెల్లవారిలేచి చూస్తే పర్సు, వాచీ, ఉంగరమూతోపాటు ఆమె మాయమైంది.

ఆమెను గురించి ఏమనుకోవాలో తెలియలేదు గోపాలానికి. అదో మురికి సంఘటన. దానికతడు పశ్చాత్తాపపడ్డాడనే గ్యారంటీ ఏమీ లేదు. కాని చేతిలోఉన్న డబ్బు అలా ఖర్చు కావటంతో యింటికి వ్రాయవలసి వచ్చింది. సరోజకు వ్రాయలేక కొడుక్కి వ్రాశాడు. అమ్మను బ్యాంకునించి డబ్బు తెప్పించి, పంపించమని.

అప్పట్లో సరోజ పేరకూడ విడిగా బ్యాంకు ఎకౌంటు ఉండేది. ఇప్పుడలా ఎకౌంట్లూ అవీ లేక పోయినా మొత్తానికి గోపాలం డబ్బుకాట్టే యిబ్బంది పడడు. అయితే ఒక్కోరోజున మాత్రం దగ్గర డబ్బు లుండక అతను బలే యిబ్బంది పడతాడు. ఆ రోజు సెలవురోజున అతని దగ్గర నాలుగు రూపాయలు మాత్రమే ఉన్నాయి. ఆ రోజుకి సినిమా ఖర్చు గడిచిపోతే రేపు ఆఫీసులో ఎవరో ఒకరు చేయి తడపక పోరు. ఆ తడపటమే లేకపోతే...మరొక్కసారి తేలుకుట్టుకలుక్కుమంది.

మరచిపోవాలని మనసు కోరుకుంటున్న విష యాలలా ఒకదాని వెంబడి ఒకటి గుర్తుకు రావ టంతో చికాకుపడ్డాడు, గోపాలం. తాపీగా గడపాలను కున్న సెలవురోజు ఏ పుల్లిస్తరాకో అయ్యేటట్లుంది. గబుక్కునలేచి స్నానానికి వెళ్ళాడు, గోపాలం.

బట్టలువేసుకుంటుంటే సరోజవచ్చింది; సస్పెన్సు చిత్రంలో వెనుకనుంచిపడే చేయికి మల్లే. 'బయటకు వెళ్తున్నారల్లే ఉంది. బియ్యం తెప్పించాలి'.

స్టన్ అయ్యాడు గోపాలం. 'ఎప్పటికి?'

'ఈ రోజుకే?'

'ఈ రోజుకి బియ్యం కావాలని యిప్పుడు చెబితే ఎలా చెప్పు? ఈ రోజు కెలాగో సర్దేయి. రేపు తెప్పిస్తాను' సాధ్యమైనంత అనునయంగా చెప్పాడు గోపాలం. సమాధానం లేదు. అంటే ఫరవా లేదు. తాను సినిమాకి వెళ్లవచ్చు. త్వరగా బయట పడాలి. లేకపోతే ఈ నాలుగురూపాయలూ ఎవరో ఒకరు తన్నుకుపోవచ్చు. నింపాదిగా బయలుదేరిన మురుగుకాలువ వేగం పుంజుకుంటున్నది!

'నాన్నా నాకో నాలుగు రూపాయలు కావాలి'. శాపం!

'ఎందుకమ్మా?'

'మా స్కూల్లో ఎందుకో కట్టమన్నారు.'

'రేపు కడదాంలే. ఇవ్వాళ సెలవేగా?'

'మాకు స్కూలుంది నాన్నా'.

నిజమే. ఆహ్వాన సంఘంలో వాళ్ల పంతు లమ్మలు లేరుగా?

'రేపిస్తాలే అమ్మా'.

ఏదో గొణుక్కుంటూ వెళ్లిపోయింది కూతురు.

గబ, గబా బయటపడ్డాడు, గోపాలం. టిఫిను తిని, తాపీగా థియేటరుకు వెళ్ళాడు, రిక్షాలో. తీరా చూస్తే ఆ రోజు ఆ సినిమాకి మార్నింగుషో లేదు. తాను చూడదలుచుకున్న సినిమాకి మార్నింగుషో లేదు. బొమికె ముక్కకోసరం దగ్గరకుపోతే అది మరీ జాన్నచొప్ప అయింది.

వేరే ఏదన్నా సినిమాకి పోవటానికి మనసొప్ప లేదు. పోనీ యిప్పు డింటికి వెళ్ళిపోయి, మ్యాటనీ చూసి, సాయంత్రం మలా షికారువెళ్ళొచ్చి, భోంచేసి పడుకొని, మంచిపుస్తకం చదువుకుంటూ పడు కుంటే ...

కాళ్ళీడ్చుకుంటూ యింటికిచేరాడు, గోపాలం. పిల్లలంతా బడికివెళ్ళారు. 'సర్ఫు ఉతుకును అమిత తెల్లగా'—అనే సత్యంమీద ఏదో రీసెర్చి చేస్తున్నది, సరోజ. గోపాలానికేం చేయాలో తోచలేదు. మన సంతా ఏదో గాలిపోయిన బ్లాడరల్లే తయారవుతున్నది. పేపరు చదువలేదు. ఉత్తరాలు...నో ... నో...పాత పుస్తకమేదో తీసుకొని తిరగేయసాగాడు. అదో పెర్రీ మాసను నవల. గోపాలం ఈ నవలను విపరీతంగా చదివేవాడు, ఒకప్పుడు. అతని దగ్గరున్న నవలలన్నీ రైలు ప్రయాణాలలో కొన్నవే. అతనిప్పుడు చదవ టానికి తీసుకున్న నవలమీద 'రేణిగుంట 6/5 అని వ్రాసిఉంది.

రేణిగుంట స్టేషనులో గోపాలం ఆ నవలను కొన్నాడు, ఎప్పుడో పదిహేను సంవత్సరాలనాడు. ఆ రోజు నతను తిరుపతినుంచి వస్తున్నాడు. తిరుపతి స్టేషను కొచ్చేసరికి రైలు బయలుదేరు తున్నది. టికెట్టు తీసుకోకుండానే రైలెక్కాడు. రేణిగుంట స్టేషనులోదిగి, పెర్రీమాసను కొనుక్కొని, దర్జాగా వెళ్ళి వెయిటింగురూములో కూర్చొన్నాడు. పోర్టరొచ్చాడు, ఏబండికెళ్తారు, బాబూ — అంటూ. 'నెల్లూరు వేళ్ళాలోయి. ఓ టికెట్టు తెచ్చిపెట్టు'— అంటూ పోర్టరికి డబ్బుయిచ్చాడు, గోపాలం. దొంగ తనాన్ని కప్పిపుచ్చుకోటానికి దర్జా నిలుపుకోవాల్సి వచ్చింది. ఆ దర్జాకోసరం రెండవతరగతి టికెట్టు కొన్నాడు, గోపాలం. రైల్వేవాళ్ళకి ఎక్సెసు కట్టేయ వచ్చుగా? వెధవబుద్ధి! తేలుకుట్టు కలుక్కుమంది. మురికి గుంటను కదిలించినట్లయింది. పుస్తకమవతల పారేశాడు, గోపాలం.

మనస్సు ఘోరంగా ఉంది. ఎలా ఈ శూన్య త్వాన్ని భరించటం? ఏమైంది తానూహించుకున్న ఆనందం? ఎండిపోయిన బొమికె ముక్కకూడ కుళ్ళు వాసనలు వెదజల్లుతున్న దేమిటి? లేచి భోజ నానికి వెళ్ళాడు, గోపాలం.

భోంచేసి, పడుకున్నాడు, గోపాలం. కాసేపు నిద్ర పోవాలి. నిద్రలేచి, శుభ్రంగా సబ్బుతో ముఖం కడుక్కొని, కాఫీతాగి, మాటినీకి వెళ్తే......

కాని నిద్రపట్టేటట్టు లేదు. గత జీవితంలోని మధురస్మృతులను నెమరువేస్తూ పడుకుంటే నిద్ర పడ్తుందేమో? తన మనస్సు కోరిన సౌఖ్యాలను ఊహించుకుంటూ, ఆ ఊహాలోకం నుంచి నిద్రా లోకంలోకి జారిపోతూ ఉండేవాడు, యువకుడైన గోపాలం. కాని యిప్పుడతనికా ఊహాలోకం చాల యిరుకుగా, మురికిగా ఉంటున్నది. అందుకని యిప్పుడు గోపాలం గతాన్ని తడుముకోసాగాడు, మధుర స్మృతులకోసరం. తడమటమని ఎందుకన్నానంటే, అతని గతమంతా అతనికేదో చీకటి గహ్వరంలా ఉంది. ఆ చీకట్లో మధురానుభూతులేవీ కన్పించ టం లేదు. ఆ చీకటి ఏమంత భయంకరంగా లేదు. మామూలు శూన్యత్వంతప్ప మరొకటి భాసించటం లేదు.అలా తముడుకుంటూ పోంగా,పోంగా ఒక కాంతి కిరణం ఎక్కడినుంచోవచ్చి గబుక్కున అతని గత జీవితానుభవ గహ్వరాన్ని కాంతివంతం చేసినట్లని పించింది.

అవి గోపాలం బెనారసు వెళ్ళినరోజులు. పది మంది స్నేహితులతో కలసి బెనారసు వెళ్ళాడు, గోపాలం. నెలరోజులు వారంతా కలిసి తిరిగొచ్చారు. ఆ నెల రోజులు నిజంగా అతని జీవితంలో మరుపురాని రోజులు. రోజూ యిష్టమొచ్చినంత టిఫిను చేయటం, చచ్చేటట్టు తిరగటం, ఎప్పుడూ నిద్రమత్తుతోనే యాక్టివ్‌గా ఉండటం—అదొక చక్కటి అనుభవం.

బెనారసులో ఉండగా ఒక రోజునో తమాషా జరిగింది. మిత్రులంతా కలసి నగరంలోకి షికారెళ్ళారు. ఆ టౌను జాగ్రఫీ అంతా తెలిసిన వాడల్లే రామ్మూర్తి 'మనమిలావెళ్తే విశ్వనాధ గల్లీలోకి వెళ్తాం' అంటూ

ముందు నడిచాడు. ఎంతదూరం వెళ్ళినా పరిచయమైన గల్లీరాదే? చివరకో సన్నటిగల్లీలోకి వచ్చారు. రెండువైపులా పూల అంగళ్లు. వాటివెనుకనున్న ద్వారాలలో, పైనున్న కిటికీలలో అంగనలు. అనుమాన మేసింది; రాకూడని చోటికొచ్చినట్లు. నలుగురూ కలిసి ఉండటంవల్ల, ఎవరికివారే సచ్చరిత్రులైనారు. వచ్చీరాని హిందీలో అడిగారు, 'విశ్వనాథ్ గల్లీ కహాఁహై' అంటూ. అది విన్నవారంతా ఒకటే నవ్వటం. మొత్తానికెలాగైతేనేం రాత్రి పదిగంటలకు లాడ్జికి చేరారు. రామ్మూర్తి యిప్పుడెక్కడున్నాడో? అమ్మో, తెలుకుట్టు! ఈ రామ్మూర్తి దగ్గర గోపాలం అప్పడో యాభై రూపాయలు అప్పు తీసుకున్నాడు. ఇంతవరకా డబ్బు అతనికి తిప్పిపంపలేదు. ఎప్పుడూ పంపుదామని అనుకోవటమే. మనస్సు కుట్టినట్లయింది. యివాళ యాభై రూపాయలుంటే పంపేవాడే, ఏదో అడ్డసుకు. కాని లేవుగా? పాల బిందెలో విషపుబొట్టు. 'మధురస్మృతి' బాధావహమైంది. ఛీ. ఛీ. ఇంకేం నిద్రపట్టుంది? అలా ఆరాటపడుతూవే ఎప్పుడో నిద్రలోకి జారిపోయాడు, గోపాలం.

కర్మ! గోపాలానికా రోజున నిద్రమెలకువ వచ్చేసరికి సరిగ్గా మూడున్నరైంది. మ్యాట్నీ టైము దాటిపోయింది. ఇక సాయంత్రందాకా ఏం చేసేటట్లు? ప్రతినిమిషమూ బాధాకరంగానే నడుస్తున్నది. శూన్యత్వం. అంతులేని శూన్యత్వం. తాపీగా గడపాలనుకున్న సెలవు రోజున ఏమిటీ శూన్యత్వం? ఎలా దీనిని జయించటం? మరొక్క గంటసేపు నిద్ర పోగలిగితే? సాయంత్రమట్లా కాసేపు తిరిగి, ఫస్టు షోకి వెళ్ళొచ్చి, రాత్రి యింటికి వచ్చేటప్పటికి పిల్లలంతా నిద్రపోతుంటారు కాబట్టి, సరోజతో కాసేపు సరదాగా కాలక్షేపం చెయ్యవచ్చు. పిల్లలమధ్య పడుకున్న భార్యను లేపుకు రావటమంటే బాధగా ఉంటుంది, గోపాలానికి. సినిమాకి వెళ్ళివస్తే ఆ బాధ ఉండదు. అన్నం పెట్టటానికి తానే యింట్లోకి వస్తుందిగా ? మరొకసారి ఎండిపోయిన బొమికెముక్క తళుక్కుమంది, గోపాలం మనోలోకాలలో. ఎండమావులలో నీళ్ళ గలగలలు వినిపించినై.

కాని యింకో గంటకాదుకదా, ఇంకొక్క క్షణం నిద్ర పట్టేటట్టు లేదు. పిల్లలు చాల గోలచేస్తున్నారు. కాస్త టిఫినన్నా ఏదన్నా చేసిందేమో, సరోజ ? కాసేపు కాలక్షేపం. అడగటానికి భయమేసింది. ఏ నూనో అయిపోయింది, డబ్బులివ్వండి. తెప్పిస్తానంటే ? ఇక గోపాలందగ్గర మిగిలిందే మూడు రూపాయలు. టిఫినుచేస్తే ఆమే పెడుతుందిగా ? అలాగే పడుకున్నాడు.

ఐదు గంటలప్పుడు లేచి, శుభ్రంగా సబ్బుతో ముఖం తోముకొని యింట్లోకొచ్చాడు, గోపాలం. మంచి 'డ్రెస్సు' వేసుకోవాలని మనసైంది. పాత టెర్లినుషర్టుతీసి వేసుకుంటే, దానిగుండీలు రెండు ఊడిపోయి ఉన్నయి. మామూలు చొక్కాతోనే సరిపెట్టుకోవలసి వచ్చింది. తీరా బయటికి వెళ్ళబోతుంటే, 'మీ నాన్న బయటికి వెళ్తారేమో ? టిఫిను చేస్తున్నాను, ఉండమనిచెప్పవే పెద్దదానా?' అంటూ కేకపెట్టింది, కుంపటి అంటిస్తున్న యింటియిల్లాలు. ఇప్పుడా టిఫిను! కాని, టిఫిను యింట్లో చేసిపోతే, ఓ రూపాయి చిల్లరతో సినిమాలో కూర్చోవచ్చు.

అరగంట తర్వాత టిఫిను ప్లేటుతో దిగడ్డది, కూతురు. గోపాలాని కిష్టమైన టిఫినే. సంతృప్తిగా టిఫినుచేసి బయటపడ్డాడు, గోపాలం. ఆరైపోతున్నది. తొందరగా వెళ్ళకపోతే టిక్కెట్లందవు !

'ఏంయి గోపాలం ! ఎక్కడికోయి అంత హడావుడిగా వెళ్తున్నావు ?'

జిడ్డుగాడు. జిడ్డామృదంగాడు. ఒకందాన వదిలిపెట్టడీ శర్మగాడు. ఏవో కబుర్లుచెబుతూ కూర్చుంటాడు. పోనీ వాడ్నికూడ సినిమాకి తీసికెళ్దామంటే, డబ్బుల్లేవుగా ?

'అలా పనిమీద వెళ్తున్నానోయి. మాబంధువుల అమ్మాయికి సంబంధం సంగతేదో కనుక్కురమ్మంటే?' తప్పించుకో జూచాడు, గోపాలం.

బోనులో పడ్డపక్షిని, అలా ఎగిరి ఆనంద లోకాలకి వెళ్లనిస్తాడా, శర్మగాడు?

'అలాగా, మాచెల్లెలుకీ సంబంధం కుదిరింది, తెలుసా?'

'అలాగా, ఏవూరు?' మర్యాదకోసరం అడగాలి కదా?

'మా మేనమామగారి ఊరే. మాకు తెలిసిన సంబంధమే. రెండేళ్ల క్రిందట వెళ్లామంటిమే. అదే. అప్పుడు వాళ్లేదో చెప్పి పంపేశారు. ఇప్పుడు వాళ్లే మా మేనమామద్వారా కబురు పెట్టారు...' ఆకాశ పురాణం! సాగిపోతున్నది. ఎన్నో పాత్రలు ప్రవేశించి, నిష్క్రమిస్తున్నాయి. ఆరుగంటలు దాటిపోతున్నది. ఎప్పటికి వదిలిపెట్టాడో!

పురాణం ఏ ఘట్టంలో ఆగిందో, ప్రశ్న మాత్రం వినిపించింది, గోపాలానికి. 'ఎటు వెళ్లావోయి, నువ్వు?'

తడబడ్డాడు గోపాలం. 'అదే మనపురాణం వాళ్లు లేరూ, వారింటికి?'

'సరేపద నేనూ అటే వస్తాను' మళ్లీ పురాణం ప్రారంభించాడు, శర్మగాడు.

చచ్చాంపో. యిప్పుడా పురాణం వాళ్లింటికెళ్లి ఏమని చెప్పాలి? ఎట్లా. ఈజిడ్డు వదిలించుకోవటం? హేలుమీదుగా దారితీశాడు, గోపాలం. హౌసుఫుల్! గోవిందా! ఎండిపోయిన సముద్రం కళ్లముందు మెదిలింది, గోపాలానికి.

ఇకనైనా ఈ జిడ్డుగాడ్ని వదిలించుకుంటే యింటికివెళ్లి ముసుగుపెట్టుకు పడుకోవచ్చు.

'మరిచి పోయాను మనరావుగా డొచ్చాడు, తెలుసా?' శర్మగాడి మాటల మేడలోకి గబుక్కున ఏకిటికీగుండానో ఈప్రశ్నను విసిరేశాడు, గోపాలం.

'ఎప్పుడొచ్చాడు?'

'నిన్ననేవచ్చాట్ట పలకరించి వద్దామా?'

'నువ్వు పురాణంవాళ్ళ యింటి కెళ్ళాలన్నావుగా?' తనపురాణం గొడవలోకూడ పురాణంవాళ్ళ సంగతి మరచిపోలేదు; పాపాత్ముడు!

'రేపు వెళ్తాలే. రావుగాడ్ని చూసొద్దాం, పద.'

రావుగాడ్ని పలకరించి, శర్మగాడ్ని వదిలించుకొని యింటికి చేరేటప్పటికి మూడోవాడు ఇల్లెగురకొట్టేస్తున్నాడు. కాగుతున్నపాలు, కాలిమీద పోసుకున్నాట్ట! మందు తెప్పించాలి. జేబులోఉన్న మూడు రూపాయలూ యిచ్చి పంపించాడు, గోపాలం.

పోనీలే, శర్మ కనపడటమే నయమైంది. కుర్ర వెధవ! బాధతో గోల పెట్టేస్తున్నాడు!

పెందలాడే స్నానంచేసి, భోంచేసి, పుస్తకం చదువుకుంటూ పడుకుంటే, ఈలోగా పిల్లలు నిద్ర పోతారు. ఆ తర్వాత సరోజతో కాసేపు సరదాగా కాల క్షేపం చెయ్యవచ్చు. ఎండిపోయిన బొమికెముక్కను తెచ్చి గూట్లో దాచుకున్నాడు, గోపాలం.

క్రమక్రమంగా ఇంట్లో నిశ్శబ్దం పరచుకొంటున్నది. ఎడారిలోని లైట్లు ఒక్కొక్కటే ఆరిపోతున్నాయి. ఇంట్లో ఎలుకలేవో గోలచేస్తున్నట్లున్నయి. 'సరోజా! ఎలుకలేవో పడగొడ్తునట్లున్నయి చూడు!' అని బొమికె ముక్కకోసం, కేకపెట్టాడు. గోపాలం.

'ఎలుకలుకాదు. పాడుకాదు. నేనేలెండి. ఆపెద్ద దాన్నిలేపి, ఆ చాపా, పాతచీరె పడేయమనండి.' ఎండమావులలోని నీళ్లనుతోడి, ఎడారిలో కలాపి చల్లింది, సరోజ.

గూట్లో దాచుకున్న ఎండిపోయిన, బోలు పడిన బొమికె ముక్కను ఎలుకలు ఎత్తుకుపోయినై!

* * *

ఎండిపోయిన బొమికె ముక్కకోసరం రోజల్లా ఆరాటపడుతూ, తిరుగుతూనే ఉంది, వీధి చివరన ఉండే ఎర్రకుక్క.

రోజల్లా బొమికె ముక్కకోసరం, ఎండిపోయి, బోలుపడిన బొమికె ముక్కకోసరం, ఆరాటపడ్తానే ఉన్నాడు, గోపాలం.

---

# తెలుగు కావ్యావతారికలు - కొన్ని విశేషములు

డా. జి. నాగయ్య

ఆంధ్ర కావ్యములలోని ప్రథమాశ్వాసాంతర్గత మయిన అవతారికాభాగము ఒక విలక్షణ సాహిత్య సంప్రదాయము. కావ్యకర్త కథలోనికి దిగుటకు పూర్వము స్వర్గముననున్న దేవతను భూమికి అవతరింపజేయుటకు కృత్యారంభమున స్తుతిపూర్వకముగా చెప్పిన మంగళాచరణమే అవతారిక అని ఆప్టే (Apte) తన నిఘంటువున 'అవతరణిక'[1] అను మాటకు చెప్పిన వివరణమును బట్టి తెలియును. కాని కాలక్రమమున మంగళాచరణమే గాక పెక్కు అంశములు అవతారికలో చోటు చేసికొనినవి.

ప్రథమాంధ్ర కవియగు నన్నయకు పూర్వము తెలుగున కవిత్వ మున్నదనుకొన్నను కావ్యమేదియు ఇంతవరకు లభింపలేదు. నన్నయకు సంస్కృత కావ్య నాటకాదులును, ప్రాకృత గ్రంథములును, తమిళ కన్నడ దేశభాషా కావ్యములును తన రచనా వ్యాసంగమునకు కొంతవరకు ఆధారములై యుండవచ్చును. ప్రాచీన సంస్కృత కావ్యములందు అవతారికా సంప్రదాయము మృగ్యము. బాణుడు మాత్రము తక్కిన సంస్కృత కవులవలెగాక హర్షచరిత్ర ప్రారంభమున స్వీయవృత్తాంతమును సంగ్రహముగా వర్ణించి తరువాత కథాకథనమును నిర్వహించి యున్నాడు. ఇందు పూర్వకవిస్తుతి, కుకవినిందకూడ కలదు. సంస్కృతములో ప్రాచీన పద్య కావ్యములందు కానరాని అవతారిక హర్షచరిత్ర వంటి గద్యకావ్యములందు కన్పించుట ఒక విశేషము. గంగాదేవి (1380) మధురావిజయము, కృష్ణదేవరాయల నగరి సంగీత విద్వాంసుడైన బండారు లక్ష్మీనారాయణ సంగీత సూర్యోదయము ఇత్యాది సంస్కృత గ్రంథములందు కొన్నిట కృత్యాదిని అవతారిక లున్నవి. ఆంధ్రులు రచించిన ఈ సంస్కృత గ్రంథములందలి అవతారికాభాగము తెలుగు కావ్య సంప్రదాయము ననుసరించిన దనవచ్చును. మొత్తముమీద సంస్కృత కావ్యములందులేని అవతారికా సంప్రదాయమును తెలుగు కవులు నియతముగా పాటించి యుండుట ఎన్నదగిన విశేషము.

భారతారంభమున నన్నయ రచించిన అవతారికా లక్షణ సామ్యముచే సంస్కృత నాటకములందలి నాందీ ప్రస్తావనలను బోలియున్నదని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు వ్రాకుచ్చినారు.[2] కాని సంస్కృత నాటకములందలి ప్రస్తావనాభాగమునకును తెలుగు కావ్యావతారికలకును ప్రత్యక్ష సంబంధమును నిరూపించుట దుష్కరము. ఇక తమిళ కావ్యావతారికలకును పోలికలున్నట్లు కానరాదు. క్రీ. శ. 8 వ శతాబ్ది ప్రారంభమున వెలువడిన 'గౌడవహ' (గౌడవధ) అను ప్రాకృత కావ్యమునందలి కృత్యాది చాల దీర్ఘమును బహువిషయములతో కూడినదియునని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు తెల్పియున్నారు.[3] 'గౌడవహ' కర్త భవభూతి శిష్యుడైన వాక్పతి రాజదేవుడు. 'గౌడవహ' కృత్యాదిని దేవతాస్తుతి 61 శ్లోకములలో గావింపబడినది. పిమ్మట 37

1. అవతరణికా—A short prayer at the beginning of a work which, it is supposed, causes the divinity so addressed to descend from heaven.

2. ఆంధ్ర వాఙ్మయారంభదశ — ద్వితీయ సంపుటము. పుట. 701.

3. నన్నెచోడుని కవిత్వము—పుట. 66.

శ్లోకములలో కవి ప్రశంస కలదు. ఇందు సుకవి పద్ధతి, కుకవి పద్ధతులు కూడ వివరింపబడినవి. ప్రాకృత కన్నడ కవులు పెక్కుమంది జైనమతాభిమానులగుటచే వారి కావ్యములందు కొన్ని సామ్యము లున్నవి. లభ్యమగు కన్నడ గ్రంథములలో మొదటిదగు కవిరాజ మార్గము (850 A. D) కావ్యాదిని మంగళాచరణము, పూర్వకవిస్తుతి, సభావర్ణనము, సుకవిత్వప్రాప్తి విధానము, అపండిత నింద, కుకవి నింద, సుకవి కావ్య ప్రశంస మొదలగు అంశములతో కూడిన అవతారికా భాగము 'గౌడవహ' ప్రాకృత కావ్యమునందు వలె విపులముగా కలదు. 'దేశీయ భాషా కవితలలో అవతారికా రచన కిదియే మొదటిది'4. అని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి అభిప్రాయము. కవిరాజమార్గ కర్త తరువాత పంపకవి (902) విక్రమార్జునవిజయము, ఆదిపురాణము లందును, పొన్నకవి (950) శాంతిపురాణమందును, రన్నకవి (993) అజిత పురాణము, గదాయుద్ధము లందును, నాగవర్మ (990) ఛందోంబుధి యందును కృత్యాదివి అవతారికలను రచించినారు. శ్రీకారముతో కృతి నారంభించు సంప్రదాయము కన్నడ కావ్యములందు కన్పట్టు చున్నది.

నన్నయకు కన్నడ భాషాసాహిత్య పరిచయమును కలదందురు. అష్టభాషా కవీశ్వరుడని ప్రసిద్ధిగాంచిన నారాయణభట్టు తనకు భారతరచనమున తోడ్పడినట్లు తానే గ్రంథావతారికలో స్పష్టముగా చెప్పియున్నాడు. కనుక నన్నయ తనకు ముందున్న కన్నడ భాషాసాహిత్య లక్షణములను కొన్నింటిని తనకు హితమైనవానిని తన భారత రచనా సందర్భమున గ్రహించి యుండును. నన్నయ భారతావతారికను రచించుటలో సంస్కృత నాటకములలోని నాందీ ప్రస్తావనా భాగముల ననుసరించి నాడనుటకంటె కన్నడభాషాలక్షణముల ననుసరించి నా డనుటయే సహేతుకముగా నుండును.

ప్రథమాంధ్ర కావ్యమనదగు నన్నయ భారతమునందే అవతారిక పెక్కు పద్యములలో వివిధాంశములతో కూర్పబడినది. నన్నయ పూర్వకవిస్తుతిలో మొదట వాల్మీకిని ఒక పద్యములో స్తుతించి తరువాతి పద్యమున వ్యాసుని స్తుతించి యుండుట గమనింప దగినది. చారిత్రక దృష్ట్యా భారతరచనకు తరువాతనే రామాయణ రచన జరిగినట్లు యభిప్రాయమున్నది. 'గురుపద్య విద్యకు నాద్యుడు' వాల్మీకియని స్తుతించి యుండుటచే నన్నయకు భారత కవితకంటె రామాయణ రచనలోని రామణీయకత ఎక్కువగా గోచరించి యుండునని చెప్పవచ్చును. పద్యవిద్య యందు ప్రథముడగు వాల్మీకి రచనను ఒరవడిగా పెట్టుకొని నన్నయ తన పద్య రచనను సాగించినట్లు చెప్ప వచ్చును. ఈ 'పద్యవిద్య' ప్రయోగమును బట్టి నన్నయ నాటికే పద్యరచన ఒక కళగా సిద్ధించి యుండెనని తలంచినారు శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావుగారు.5 భారత రచనచే నన్నయ 'పద్యవిద్య'కు స్థిరత్వము కల్పించి దానినొక కళగా తీర్చిదిద్ది ఆదికవియను గౌరవమును పొందినాడు.

నన్నయకు తరువాత సకలావయవముల పరిపూర్ణమైన దివ్యకావ్యమగు నన్నెచోడుని కుమార సంభవమున కూడ విస్తృతముగా అవతారికా భాగము నిర్వహింపబడినది. నన్నెచోడుడు తన అవతారికలోని వివిధాంగములను కన్నడ కవుల ననుసరించి రచించినను కన్నడ కావ్యములందు కానరాని షష్ఠ్యంతాదులను కూడ చేర్చియున్నాడు. శ్రీ తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు నుడివినట్లు 'నన్నెచోడుని యవతారిక యొక్క స్వప్నవృత్తాంతమును దప్ప దక్కిన యంగముల నన్నిటిఁ గలిగి తరువాతి తెలుగు కవులకు వరవడి యయినది'6. ఇక తిక్కన భారతావతారికతో తెలుగు కావ్యావతారికకు సమగ్రరూపము కుదురు కొన్నది. తిక్కనకు పిమ్మట కావ్యావతారిక లేని కావ్యము తెలుగునందు లేదనిన అతిశయోక్తి కాదు. భాస్కరరామాయణము, ఉత్తర హరివంశము, షోడశ కుమార చరిత్ర, విష్ణుమాయా నాటకము, షట్చక్రవర్తి చరిత్ర, కవిజనరంజనము, చేమకూర వేంకటకవి సారంగధర చరిత్ర — ఇత్యాది కొన్ని కావ్యములకు మాత్రము అవతారిక లభ్యము కాలేదు. సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని జైమినీభారత

4. ఆంధ్ర కవుల అవతారికలు — భారతి. తారణ—మార్గశీర్షము.

5. నన్నయ కవిత్వము-సాహిత్యోపన్యాసములు-1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ .

6. కవిరాజ శిఖామణి—పుట. 102.

మను 5 ఆశ్వాసముల వచనకావ్యమునందు కూడ పద్యప్రబంధమునందు వలె అవతారిక, ఆశ్వాసాంత పద్యములు, ఆశ్వాసాంత గద్య మొదలగు నియమములు పాటింపబడియున్నవి. ఇటు ప్రాచీనకాలమున చంపూ కావ్యములందేగాక ద్విపదకావ్యములు, యక్షగానములు మొదలగువానియందుకూడ కృత్యాదిని అవతారిక నియతముగా కన్పించును. ఆధునిక కవులలో కొందరు అవతారికా సంప్రదాయమును అంతగా పాటించినట్లు కానరాదు.

తెలుగుకావ్యములు పెక్కింటికి కృతిపతులో కృతి ప్రేరేపకులో యుందురు. వారికి ఆశీస్సులు ముఖ్యము. దేవతాస్తుతి పూర్వకముగా కృతిపతికి ఆశీస్సు లొసంగు పద్యములు తెలుగు కావ్యములలో ఆరంభ మున నియతముగా కన్పించు ముఖ్యవిశేషము.

'శ్రీ'కారములో, మూడు గురువుల 'మ'గణ ముతో కావ్యమారంభించుట శుభప్రదమను నమ్మకము ప్రాచీనకవుల కుండినది. కొన్ని అచ్చతెనుగు కావ్యము లందు ఆయాకవులు బుద్ధిపూర్వకముగానే గ్రంథా రంభమున 'శ్రీ'కి బదులు 'సిరి' వాడినారు. కూచి మంచి తిమ్మకవి అచ్చతెనుగు రామాయణ కావ్యా రంభమునందు 'శ్రీ'కారమును లోపింపజేసి 'సిరులకు మన్కియై హొయలు...' అని రచించినను నీలా సుందరీపరిణయము నందు మాత్రము గ్రంథారంభ మున 'శ్రీ'కారమును నిల్పియున్నాడు. చేమకూర వేంకటకవి విజయవిలాసములో కృతిపతియైన రఘునాథరాయలకు మూడింతలు మంచి కలగాలని కాబోలు మొదటి మూడు పద్యములను శ్రీకారము తోడనే ప్రారంభించినాడు. కృత్యారంభమునందే గాక ప్రతి ఆశ్వాసాది పద్యమును 'శ్రీ'తో ప్రారంభించు సంప్రదాయము తెలుగు కావ్యములందు నియతముగా కలదు. శ్రీకారముతో గ్రంథారంభము చేయుటేగాక 'శ్రీ'తో ముగించు నియమమును గూడ నన్నెచోడుఁడు, పాల్కురికి సోమనాథుడు, జక్కన, నందిమల్లయ ఘంటసింగనలు (ప్రబోధచంద్రోదయములో), ముక్కు తిమ్మన, కాణాదం పెద్దన సోమయాజి (అధ్యాత్మ రామాయణములో) మొదలగువారు పాటించి యున్నారు.

కృత్యాదిని సంప్రదాయముగా నేర్పడియుండిన దేవతాస్తుతి సాధారణముగా కవుల, కృతిపతుల మత భావరీతుల ననుసరించియే యుండును. ఇది కవుల కృతిపతుల ఇష్టదేవతలు తెలియుటకేగాక వారి మత భావము లెరుంగుటకును కొంతవరకు తోడ్పడుచున్నది. కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద యందు ఇష్ట దేవతాస్తుతిలో వాడుకగా చెప్పు దేవతలను గాక సర్వ విలక్షణముగా శుద్ధ వైష్ణవ దేవతలనే పేర్కొని స్తుతించినాడు. ఆముక్తమాల్యద కృత్యారంభమున రాయలు తన ఇష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరుని మొదటి పద్యమున స్తుతించినాడు. రెండవ పద్యమున 'భజింతున్నిరంతరముం దాంతుని నయ్యనంతుని నతీత బ్రహ్మకల్పాంతునిన్' అని విష్ణుశయ్య యగు అనంతుని స్తుతించినాడు. మూడవ పద్యమున విష్ణువాహనమగు గరుడుని'పతగస్వామాత్పుత్ర ప్రభంజనము'అని వర్ణించి నాడు. నాల్గవ పద్యమున విష్వక్సేనుని జెత్తమును 'సైన్యపతి కాంచనవేత్రము నాశ్రయించెదన్' అని వర్ణిం చెను. అయిదవ పద్యమున 'పాంచజన్య మొసగుం గళ్యాణ సాకల్యమున్' అని పాంచజన్యమును స్తుతిం చెను. ఆరవ పద్యమున 'నందకం బఘలతా శ్రేణి చ్ఛిదం జేయుతన్' అని నందకమును, ఏడవ పద్య మున 'కౌమోదకి మోదకీలిత సముజ్జ్వల కల్పక మాల్య గొల్చెదన్' అని కౌమోదకమును, ఎనిమిదవ పద్యమున 'శార్ఙ్గ ధనుర్లత కాచుఁ గావుతన్' అని శార్ఙ్గ మనెడి ధనువును, తొమ్మిదవ పద్యమున 'సుద ర్శనదేవు కొల్చెదన్' అని సుదర్శనమును వర్ణించెను. పదవ పద్యమునందు 'ఇలఁ బన్నిద్దఱు సూరులం దలఁతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్' అని పన్నిద్ద ఱాళ్వారులను స్తుతించెను. ఇట్లు ఇష్టదేవతా స్తుతి పది పద్యములలో విపులముగా నున్నను ఇతర కావ్యావతారికలలో తరువాత కానవచ్చెడి గుర్వుస్తుతి, సుకవిప్రశంస, కుకవినింద ఇత్యాదులు ఆముక్త మాల్యదలో కానరాకుండుట ఒక అపూర్వ విశేషము. శ్రీ వేంకటేశ్వరుని, విష్ణువు పరివార దైవతము లను కావ్యారంభమున పలురీతుల పేర్కొని స్తుతిం చుట వలనను, తక్కిన దైవతములను పేర్కొనక పోవుట వలనను రాయల వైష్ణవ మతాభిమానమ్ము విదితమగుచున్నది.

పింగళిసూరనతండ్రి సోమారాధ్య శిష్యుడై శివభక్తి నెక్కువగా చూపినవాడు. పితాచారమును బట్టి 'అలాపేక్షణ భక్తి శీలు' డైన సూరనయు అద్వైతియే. రాఘవపాండవీయ రచనాకాలము నాటికి 'ఫలాపేక్షలేని' ఈ కవి కృతి పేరకుని ధర్మ మను సరింపనక్కరలేకయే సహజమైన శివభక్తి నెక్కువగా చూపినాడు. కాని అందును విష్ణుస్తుతి చేయకపోలేదు. సూరన, కళాపూర్ణోదయమునందు కృతి ధర్మము ననుసరించి అందు విష్ణుభక్తి నెక్కువగా కొనియాడి నను సందర్భవశమున అందుకూడ శివస్తుతి చేసి యున్నాడు. కేవల విష్ణుభక్తుడగు కృష్ణభూపాలుని (కళాపూర్ణోదయ కృతిపతి) మెప్పు కాంచుటకు కళాపూర్ణోదయమున సూరన ఇట్లు విష్ణు స్తుతి నెక్కువగా చేనాడనవచ్చును. ప్రభావతీ ప్రద్యుమ్నములోని దేవతాస్తుతిని బట్టి చూచిన సూరన అద్వైతి అనియే చెప్పవచ్చును. పింగళి సూరన రాఘవపాండవీయము రచనాకాలము నాటికి అందరి దేవతాస్తుతిని బట్టి శుద్ధాద్వైతి యని, కళాపూర్ణోదయమును బట్టి విశిష్టాద్వైతి యని, ప్రభావతీ ప్రద్యుమ్నమునుబట్టి అద్వైతియని చెప్ప వచ్చును.

ఇష్టదేవతాస్తుతిని కవులు తమ అభిమతాను సారముగనేగాక కృతిపతుల అభీష్టము ననుసరించి కూడ చేయుచుండుట కన్నడములో కలదు. పంపకవి జైనమతాభిమానియైనను విక్రమార్జునవిజయమున తన ప్రభువగు అరికేసరి వైదికమత పక్షపాతము గలవాడగుటచే అందు పంచాయతన దైవతములను, మన్మథుని, సరస్వతిని స్తుతించి యున్నాడు. ఆదిపురాణమున మాత్రము పంపకవి పంచాయతన దైవతముల ప్రశంస చేయలేదు అందు జైనమత సంప్రదాయానుకూలముగా అర్హత్సిద్ధ, ఉపాధ్యాయ, ఆచార్య, సాధు, యక్షి, సరస్వతుల ప్రశంస కలదు. పంపకవి సరస్వతిని మాత్రము జైనవైదికమతములకు రెండింటికిని సామాన్యమగు దేవతగా గ్రహించినట్లు తోచును

కృతిపతి ఇష్టప్రకారము ఇష్టదేవతాస్తుతి నాచరించుట తెలుగు కవులును అనుసరించియున్నారు. నందిమల్లయ ఘంటసింగనలు ప్రబోధ చంద్రోదయమును తత్కృతిపతి చెందలూరి గంగయామాత్యుడు శైవుడగుటచే శివస్తుతితో ప్రారంభించినారు. ఈ కవులు వరాహపురాణము కృత్యారంభమున వరాహావతార స్తుతిని గావించినారు. వరాహ పురాణమును కృతిగొన్న ఈశ్వర నృసింహదేవరాయలు వైష్ణవుడు. ఇట్లే పారిజాతాపహరణములో ముక్కు తిమ్మన తన ఇష్టదైవతము శివుడైనప్పటికిని ('శ్రీ మదుమామహేశ్వర వరప్రసాద లబ్ధ...' అని ఆశ్వాసాంత గద్య) కృతిపతి యగు కృష్ణ దేవరాయల ఇష్ట దైవమగు వేంకటేశ్వర స్తుతితోడనే గ్రంథ మారంభించినాడు. చేమకూర వేంకటకవి విజయ విలాసములోని 'ఇష్టదేవతాస్తుతిలో' ఒక ప్రత్యేకత కలదు. వేంకటకవి సూర్యవరప్రసాది. భక్తివిశ్వాస ములన్ నీ సొమ్ములు సామాన్యుడవే? సూర్య వరప్రసాది విజ్జగమెఱుగన్' అని రఘునాథరాయలు చెప్పుటచే వేంకటకవి ఇష్టదైవము సూర్యుడనుట స్పష్టము. కాని వేంకటకవి తన విజయవిలాస కావ్యాదిని దేవతాస్తుతిలో మొదటి పద్యమున సూర్యుని కాక శ్రీరామమూర్తిని స్తుతించి యున్నాడు. విజయవిలాస కృతిపతియైన రఘునాథనాయకుని ఇష్టదైవము శ్రీరాముడగుటయే దీనికి కారణము. రెండవ పద్యమున 'రంగభర్త'ను స్తుతించినాడు. తంజావూరు నాయకరాజులు శ్రీరంగములోని రంగ నాథుని భక్తిప్రపత్తులతో సేవించుచు అమూల్యాభరణములను సమర్పించి యున్నట్లు రఘునాథాభ్యుదయము మున్నగు గ్రంథములను బట్టి తెలియు చున్నది. కనుక కృతిపతియగు రఘునాథరాజుల కుటుంబదైవమగు శ్రీరంగనాథస్వామిని విజయ విలాసము రెండవ పద్యమున వేంకటకవి స్తుతించి నాడు. ఇక మూడవ పద్యమున వేంకటేశ్వరస్తుతి కలదు. కృష్ణదేవరాయలకు వారివంశమువారికి ఇష్టదైవము తిరుపతివేంకటేశ్వరుడు. రాయల బాంధవ్యము తంజావూరి నాయకరాజులకు కూడ నుండుటచే కృతిపతి బంధువర్గము దైవమగు వేంకటేశ్వరుని వేంకటకవి మూడవపద్యమున స్తుతించినాడు. నాల్గవపద్యమున బ్రహ్మను, ఈశ్వరుని స్తుతించియున్నాడు. ఇట్లు త్రిమూర్తులను స్తుతించిన పిమ్మట అయిదవ పద్యమున తన ఇష్టదైవ

మును, త్రిమూర్త్యాత్మకుడు నైన సూర్యుని స్తుతించుచు రఘునాథరాయలను పరాక్రమవంతునిగా చేయుమని కోరినాడు. తరువాత గణపతిని, సరస్వతిని ఒకపద్యములోను, లక్ష్మీపార్వతులను మరొక పద్యములోను, గంగాదేవిని వేరొక పద్యమందును వేంకటకవి స్తుతించి యున్నాడు. సాధారణముగా దేవతాస్తుతిలో గంగను ప్రార్థించినవారు అరుదు గంగ విష్ణుపాదమున జన్మించినది శూద్రులు బ్రహ్మ పాదమునుండి పుట్టినారని ప్రతీతి. పాదములందు పుట్టుటచేత శూద్రకులమునకును గంగకును చుట్టరికము. కాబట్టి శూద్రకులములో ప్రసిద్ధుడైన రఘునాథనాయకునికి ఆ కులముతో సంబంధమున్న గంగ సకలైశ్వర్యములను తనవశవర్తుడైన శివుని చేత ఇప్పించును గాక అని వేంకటకవి గంగాస్తుతిని ఇట్లు చేసినాడు.

> 'ప్రకటశ్రీహరి యంఘ్రిఁ బుట్టి హరు మూ
> ర్ధం బెక్కి యాపాదమ
> స్తకమున్ వర్ణనకెక్కు దేవి సహజోదం
> చత్కులోత్పన్న నా
> యకరత్నంబని యచ్యుతేంద్ర రఘునా
> థాధీశ్వరస్వామికిన్
> సకలైశ్వర్యములు స్విజేశు వలనన్
> దాఁ గల్గఁగాఁ జేయుతన్.
>
> —విజయవిలాసము (1—8)

కవియు, కృతిపతియు నిర్వురును నాలవ జాతి వారే. వేంకటకవి గంగాస్తుతివలన తమ జాతి ఉత్కృష్టతను ప్రకటించినాడనవచ్చును. గంగ అటు దేవత. ఇటు రాజైన రఘునాథరాయలకు తోబుట్టువు. కనుక కృతిపతి వంశావళిని ప్రారంభించుటకు ముందు దేవతాస్తుతి, కృతిపతి వంశావళి అను రెండంశములను కలుపుటకు వేంకటకవి గంగా స్తుతిని చేసియున్నాడు.

చేమకూర వేంకటకవి ఇష్టదేవతాస్తుతిని ఎనిమిది పద్యములలో గావించి యున్నను తాను కోరిన కోరికలన్నియు కృతిపతికి సంబంధించినవే. తన అభ్యుదయమును ఏ ఒక్క పద్యమందును కోరలేదు.

స్వార్థచింతన కొంచెమైనను చూపినట్లు కానరాదు. రాజైన రఘునాథరాయలు బాగున్నచో తానుకూడ బాగుందునను భక్తివిశ్వాసములను నిరూపించినాడు. కృష్ణదేవరాయల మన్నన లనేకము పొందిన అల్లసాని పెద్దన వంటివాడు 'గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికై' అనినాడు. బమ్మెర పోతన 'దుర్గ మాయమ్మ కృపాబ్ధి యీవుత కవిత్వ పటుత్వ మహత్త్వ సంపదల్' అని తన సొంతమునకు కోరినాడు. చేమకూర వేంకటకవి తన ఇష్టదైవమగు సూర్యుని స్తుతించినపుడైనను తన్నుగురించి ఒక్క కోరికైనను కోరలేదు. కనుకనే 'భక్తివిశ్వాసముల్ నీ సొమ్ములు' అని రఘునాథరాయలు చేమకూర వేంకటకవిని మెచ్చుకొని యుండుట.

ఒక జాతియొక్క సాంఘిక రాజకీయాది చరిత్ర నిర్మాణమునకు శాసనాది సాక్ష్యములే గాక కవుల కావ్యములును ఎక్కువ తోడ్పడుచున్నవి. కావ్యావతారికలలో కృతికర్తృ కృతిభర్తల వర్ణనాదికములందు చారిత్రకాంశములతోపాటు సాంఘికజీవిత విశేషాదులుకూడ సూచింపబడి యున్నవి.

శ్రీనాథుడు కవిమాత్రమే గాక ఉత్తమచరిత్రకారుడుకూడ. కృతిపతి వంశచరిత్ర వ్రాయుచున్నపుడత డెన్నియో చారిత్రకవిశేషములను చెప్పును. రెడ్డిరాజుల చరిత్రను సమన్వయము చేయుటకు వారి ధార్మిక చరిత్రను, వాటి సంస్కృతిని తెలిసికొనుటకు శ్రీనాథుని కావ్యావతారికలు ఎక్కువగా తోడ్పడుచున్నవి. రెడ్డిరాజుల చరిత్రమునకు శ్రీనాథుని కావ్యావతారికలలోని కవిత ఒక దర్పణము వంటిది.

రెడ్డిరాజుల కాలములో సముద్రయానము, విదేశ వ్యాపారము, సుగంధ ద్రవ్యముల దిగుమతి అధికముగా నున్నట్లు హరవిలాస అవతారికనుబట్టి తెలిసికొన వచ్చును. సుగంధ ద్రవ్యములు దిగుమతి చేసిన దేశములు, దీవులు ఎక్కువభాగము ఆంధ్రదేశమునకు తూర్పున నున్నవి. అనేక భాషలనుండి నౌకాజీవన పారిభాషిక పదములు తెలుగుభాషలోనికి ప్రవేశించినవి. విదేశవ్యాపారాభివృద్ధికై ఆంధ్ర వ్యాపారులు మధ్యయుగములో నుపయోగించు పడవలను శ్రీనాథుడు హరవిలాసకావ్యావతారికలో పేర్కొనినాడు. కప్పలి, జోగు, వల్లి, వలికా—అనువానిని గురించి శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 'History of Reddi Kingdom' (P. 405—406) లో వివరించి యున్నారు. కప్పలి: స్వదేశీ ఓడ. ఇది తమిళపద వికారము. దీనికి నాల్గు-లేక అయిదు తెరచాప లుండునట. దీని అడుగుభాగము తుఫానులకు నిలుచుటకై ముప్పేటగా కల్పెట్టితో నిర్మించెడివారని వర్ణింపబడినది. ఇది జంతువులను, సరకులను కొనిపోవునది.

జోగు: 'జావా'లో మనుష్యులెక్కు పడవకు 'జోంగ్' అనిపేరు. అది మనభాషలో జోగు'గా మారి ఆ యర్థముననే ప్రయోగింప బడుచున్నది. 'జోంగు' చీనాదేశపుటోడ. ఇది చాల భారీనౌక. 12 తెర చాపల వరకునుగల ఓడలుండెడివి.

కప్పలి. జోగు—ఇవి సుదూరప్రయాణము చేయగల బలిష్ఠమైన నౌకలు. వల్లి, వలికా అనునవి చిల్లర నౌకలు.

హరవిలాస కృతిపతి యగు నవచితిప్పయ కీర్తికి మూలకారణమైన వసంతోత్సవముల వర్ణనను శ్రీనాథుడు హరవిలాసావతారికలో ప్రత్యక్షముగా గాక పరోక్షముగా కొంత చేసినాడు. శివపార్వతుల మధుకేళి సంభ్రమము చాటున కొండవీటి మధుకేళి సంభ్రమమును చవి చూపినాడు. చూడుడు.

'వేదండవదనశుండాదండ గండూష
కాండ సిక్తాప్సరోమండలములు
కంఠావలంబిత కనకసౌగంధిక
మాలికాలగ్నషణ్మాతురములు
నందీశ్వర క్షిప్త నారంగ ఫలపాక
తరళ విద్యాధరీస్తనభరములు
గరుడ లీలావతీ కస్తూరికా పంక
పిహిత నిశ్శేషాంగ భృంగిరిటులు
వీరభద్ర వికీర్ణ కర్పూర చూర్ణ
ధవళితాకాశచరవనితాముఖములు

శాంభవీ శంభు మధుకేళి సంభ్రమములు
పొదలి వాసించుఁ గాత నా హృదయవీథి.'

—హరవిలాసము 1—

గజాననుడు తొండముతో నీటిని పీల్చి అప్సరః స్త్రీమండలము మీద వెదల్రగక్కు చున్నాడు. గంధర్వకన్యలు కుమారస్వామిని కనక సౌగంధిక మాలికలతో బంధించుచున్నారు. నందీశ్వరుడు రువ్విన ఫలములచేత విద్యాధరకాంతల స్తనములు తరళము లైనవి. గరుడలీలావతులు కస్తూరి పంకము తయారుచేసి భృంగిరిటి శరీరము సందులేకుండ పులిమిరారు. వీరభద్రుడు కర్పూర చూర్ణమును విరివిగా వెదజల్లగా దిగంగనల ఆననములు తెల్లనైనవి. ఇచట వీరభద్రుని స్థానమున కొండవీటి ప్రభువగు కొమరగిరిరెడ్డిని నిలుపుకొన వలెను. పెద్ద, పిన్న భేదములేకుండ అందరు వసం తోత్సవములో తరుణీతరుణులుగా మారిపోయి యుందురు. ఇట్లు శ్రీనాథుడు తన కావ్యావతారి కలలో తన కాలమునాటి పలువిధములగు చారిత్రక సాంఘికాది విషయములనుగూడ వివరించి యున్నాడు.

అవతారికా రచన, తెలుగు గ్రంథ నిర్మాణము నందు పరిణమించిన స్వతంత్ర సంప్రదాయము. పైని పేర్కొనబడిన అంశములే గాక కృతికర్త, కృతిభర్త, కావ్యేతి వృత్తము, రచనా సంప్రదాయము మున్నగువానికి చెందిన విశేషాంశము లెన్నియో అందు పరిశీలింపదగిన ప్రధాన విషయములు. ఆంధ్రసాహిత్య తత్త్వమును, సంప్రదాయమును, చరిత్రను, కవు లను తెలిసికొనగోరువారికి ఈ అవతారికలు ఎంతయో ఉపకరించును. ఇంతటి వ్యాప్తిని, వైశిష్ట్యమును, ప్రాముఖ్యమును పొందిన ఆంధ్ర కావ్యావతారికల గుణాధిక్యవైశిష్ట్యాదులను గురిం చిన పరిశీలనమును సహృదయపాఠకులు ప్రోత్స హింతురుగాక.



# భోగి

## శ్రీ కె. ఎస్. వి. నరసింహం

విష్ణుమూర్తి అటకెక్కాడు.

ముందు పాత ట్రంకు పెట్టెలు రెండు దిగాయి. ఆ తరువాత పాత బట్ట వొకటి, వొక గోనెమూట, మరో చెక్కపెట్టె వరుసగా దిగాయి.

నిచ్చెన మధ్య ఉన్న రఘు 'ఇంకా ఏమున్నాయి నాన్నా?' అన్నాడు.

'పరటలూ గబ్బిలాలూ లేవూ ? అవీ దించుతారూ?' అంది క్రిందినుంచి సుశీలమ్మ.

'చీకటిగా వుంది...టార్చి యిచ్చేదా నాన్నా ?' అంది శారద, తమ్ముడెక్కిన నిచ్చెన జారిపోకుండా పట్టుకుంటూ.

'టార్చితోబాటు కళ్ళజోడు కూడా యిస్తే అక్కయ్యా ?' అన్నాడు కడగొట్టు పిల్లవాడు వాసు.

అందరూ గొల్లుమని నవ్వారు.

'విన్నారా ?' అంది సుశీలమ్మ, కొంగు నోటి కడ్డం పెట్టుకుని నవ్వు దాచుకుంటూ.

బుంగమూతిపెట్టి, కళ్ళు చిట్లించి, ఉక్రోషంతో అన్నాడు విష్ణుమూర్తి—'ఆఁ...ఆఁ...వింటూ... మూడు దినాలూ...మూడు మూడు పూటలూ వేధించుకు తిని నన్నటకెక్కించి; యిప్పుడు తీరి కూచుని నా వాలకం చూస్తూంటే నవ్వుగా వుండదూ మీకు?...ఉంటుంది...'

'అది కాదండీ...'

'ఏది కాదు? నేనింక యీ అటకమీద వొక్క నిమిషం కూడా ఉండను...వారే రఘూ! నువ్వు కిందికి తగలడి యీ నిచ్చెన కాస్త సరిగ్గా పట్టుకో... నేను దిగేస్తున్నా...' అన్నాడు విష్ణుమూర్తి.

కథ అడ్డం తిరుగుతోందని గ్రహించిన సుశీలమ్మ అంది. 'నేనిప్పుడేమన్నానండీ...'

శ్రుతితో ఉపశ్రుతిలాగా అందుకున్నారు పిల్లలు.

'ఉహు...దిగెయ్యొద్దు నాన్నా...'

'ఇంకేమున్నాయసలు? వొకపెట్టేగదా...అది దించెయ్యరాదా నాన్నా...'

'కానీలే నాన్నా...'

పిల్లల మొహమాటానికి లొంగిపోయినట్టు మళ్ళీ అటకను కెలికాడు విష్ణుమూర్తి.

అటకమీద వెలుతురు లేదు. గాలికూడా లేదు. ఇనుప చువ్వలమధ్య యిరుక్కున్న జాజికాయ పలకల పెట్టె ఎంతకూ కదిలి రావడం లేదు. 'దీని శస్సాగొయ్యా' అని తిట్టాడు విష్ణుమూర్తి. అటకనే తిట్టాడో, అహల్యాదేవిలాగ కూచున్న ఆ పెట్టెనే తిట్టాడో—ఆత్మలింగాన్ని కదిలించే రావణాసురుడిలా పెట్టె అంచుల్ని పట్టుకుని వూపేశాడు. అమ్మయ్యా...ఎలాగైతేనేం...పెట్టె కదిలింది...

పెట్టె అటక దిగింది. ఆ వెంటనే విష్ణుమూర్తికూడా దిగేశాడు. అక్కణ్ణుంచి గగ్గోలు ప్రారంభమైంది.

అసలు గోల ఆ యింట్లో చాలా దినాలక్రితమే ఆరంభమైంది. మూడు దినాలనుంచీ మరీ ముమ్మరంగా కొనసాగుతోంది. రేపొద్దున్న భోగిమంటకు యింట్లోవున్న చెత్తాచెదారమంతా తగలబెట్టెయ్యాలి.

చాలా సంవత్సరాలబట్టీ 'అలసామానుల కొట్టులో అటకలో'నిగూఢగుప్తంగావున్న పాతవస్తువుల్ని కిందికి దించాలి. ఏతత్ వస్తు సముదాయాన్ని శోధించి పారేసి పనికిరాని వాటిని. భోగినాటి ప్రొద్దున్నే అగ్ని హోత్రుడికి ఫలహారం పెట్టాలని కుటుంబ సభ్యుల 'జనరల్ బాడీ'లో తీర్మానింప బడినది. అటకమీది వస్తువులలో లభింపగల చిత్రాతిచిత్రవిచిత్రములైన పాతపరికరాలపై దృష్టితో ('మెకానిక్ మనస్తత్వం గల) వాసూగాడు, అట కానవచ్చెడి పాతపుస్తకముల మీది ఆసక్తితో రఘు (ది నొటోరియస్ హొరేషి యస్ చదువరి), అటక వస్తువుల్లో దృగ్గోచరము కాగల వార్తిక పత్రములమీది మనసుతో శారద (ది లేడీ ఎక్స్ప్లోరర్!)— ఈ తీర్మానాన్ని ముక్త కంఠాలతో బలపరిచారు.

సుశీలమ్మకు పాత అటకపట్ల జాలీ సాను భూతీ కద్దు. ఇంకో రెండు మూడు నెలలకి ఆ చివరని వాసం పూర్తిగా పుచ్చి అటక కూలిపోతే ఆశ్చర్యం లేదు. అదొహటేన్నీ, అటకమీది పంది కొక్కుల కాపురాల పాటల పల్లవి భరింపరానిదిగా వుంది. వంటింట్లో రాత్రిళ్లు (అపుడపుడూ పగళ్లూ కూడా) అవి జరిపే గజదొంగతనాలకు అంతూ పంతూ లేకుండావుంది. ఈకారణాలవల సుశీలమ్మ విష్ణుమూర్తిని సాధించి సాధించి (టు యూజ్ ది పాపులర్ ఇడియమ్—చెవినిల్లు గట్టుకుని పోరి) ఎట్లాగైతేనేం అతణ్ణి అటకెక్కించింది. సామానులు క్రిందికి దింపించింది.

కాని, యిదంతా వొట్టి నాటకమంటాడు విష్ణుమూర్తి. ఆఫీసుకు హాయిగా శెలవులైన దినాల్లో కూడా తను ఆనందంగా వుండరాదని తల్లీ పిల్లలు కూడి చేసిన పన్నాగ మిదంతా అంటాడు. అత నేమనుకుంటేనేం. అటకెక్కాడు. 'చిరకాలపు జీవధ'నాన్ని అటకనుంచి దించాడు.

నాటకం తెరదీసినప్పటి సందడిలాగా 'గగ్గోలు' మొదలైంది.

'ఆర్యపుత్రా ! ... నంతర ... కరణీయమునకు సన్నద్ధులమౌదమా ?' అంది సుశీలమ్మ. అని నవ్వింది.

విష్ణుమూర్తి బుద్ధావతారపు 'ఫోజ్' పెట్టాడు.

ఆ సరికే రెండు పాత ట్రంకు పెట్టెల్లోని సర్వస్వాన్నీ ఆ గది నేల నాలుగు చెఱగులకూ పరిచి పెట్టేశాడు వాసుగాడు. గోనె మూట విప్పి అందులోని సామగ్రిని దిమ్మరించింది శారద. రఘు ఒక చెక్క పెట్టెను మొత్తం ఖాళీచేసి పారేసి, అద్దాని పైన కూచుని అపుడు దింపిన జాజికాయ పలకల పెట్టెను సాధిస్తున్నాడు.

'చూడండీ — మీ వంశోద్ధారకులు' అంది సుశీలమ్మ. అని, మళ్లీ నవ్వింది.

విష్ణుమూర్తి కూడా నవ్వాడు.

అంతలో అరిచాడు వాసుగాడు: 'అమ్మా... యిందులో రెండు చక్కటి బూట్సున్నాయి . చక్కగా వున్నాయి. చిన్నవిగా వున్నాయి...ఎవరివమ్మా యివి ? .. అరరె...వీటికి లేసులు కూడా ఉన్నాయమ్మా!!...' లేసులు చేతపట్టుకుని జోళ్ళు ఊగిస్తున్నాడు.

శారద రెండు పాత పత్రాల వంటి వాటిని చేజిక్కించుకుంది... 'ఏమిటి నాన్నా యిది ? అప్పు పత్రమా ' అంది; వొకదాన్ని చూపిస్తూ.

'కాదు—వీలునామా!....'

'ఎవరిది ?'

'ఎవరిదా?...నాదే...'

'భలే.. పో నాన్నా...ఇంత పాతది. వెయ్యేన్నీ తొమ్మిదివందలా యాభై రెండు—అదీ తేదీ...ఎవరిదో చెప్పవూ ?'

'మీ తాత రాశాడే శారదా...'

'అట్లా చెప్పరాదూ...నీకేం రాశాడు నాన్నా?'

'ఏం రాశాడా? అడపాదడపా అటకెక్కి సామాన్లు దించమని రాశాడు. ఆ మాత్రం ఆ పత్రం చదువుకోలేవటే?'

'అక్షర పోలికే లేకుండా వుంది నాన్నా...' అని కూడికూడి చదువుకుంటోంది శారద.

'మీరు రాయరూ వీలునామా ?' అంది సుశీలమ్మ.

అదిరిపడ్డాడు విష్ణుమూర్తి. 'ఏమిటీ ?' అన్నాడు.

'మాటవరసకన్నాను లెండి—నాకేం రాస్తారు?' అంది సుశీలమ్మ నవ్వుతూ.

'నీకా? యీ చెత్తంతా మొత్తంగా రాసిస్తాను; చాలా?'

'అబ్బో!—మరి పిల్లలకు?'

'ఇంట్లోవున్న అన్ని పుస్తకాలూ రఘూగాడికి, చాకులూ కత్తిపీటలూ, యినపచువ్వలూ యిత్యాదులు యావత్తూ వాసూగాడికి...యిక శారదకు; పాపం—శారదకు నేనేమిచ్చేది?...'

రఘుకు చాల పుస్తకాలు దొరికాయి. ఒక్కొక్క పుస్తకాన్ని దులిపి తట్టి దుమ్ము వదలగొడుతున్నాడు. కొన్ని పుస్తకాలు విగత జీవాలు. కొన్ని జీవచ్ఛవాల్లా ఉన్నాయి. కొన్ని 'టచ్ మి నాట్'లు; తాకితే చిరిగిపోతున్నాయి. ఒక పుస్తకం పేజీలు తిరగేసి తిరగేసి—దానిపేరు కనుక్కోలేక పోయాడు రఘు. అట లేదు. కొన్ని కాగితాలూ లేవు. విష్ణుమూర్తి చేతికిచ్చి 'ఏం పుస్తకం నాన్నా యిది? అన్నీ పద్యాలు...పుస్తకం పేరూ లేదు కవి పేరూ లేదు...అబ్బో...అప్పుడు నీ అక్షరాలు భలే గుండ్రంగా ఉండేవే; పేజీ పేజీకీ నీ పేరు రాసుకున్నావు. ఇంతకీ ఏం పుస్తకం యిది? ఏద్నైనా ప్రబంధమా?' అన్నాడు.

పుస్తకం చేతుల్లోకి తీసుకునిచూసి ఉలిక్కిపడి గతుక్కుమన్నాడు విష్ణుమూర్తి. 'ఇదీ...ఇదీ' అని నీళ్లు నమిలాడు. 'ఇదీ...అవునౌను...ప్రబంధమేరా... ఆ పుస్తకాలేమిటీ?' అని సుపుత్రుడి దృష్టి మరల్చాలని చూశాడు, 'ప్రబంధా'న్ని మేజా సొరుగులోకి తోసేస్తూ.

దాచిపెట్టబడ్డేప్రతిదీ చూచితీరాలనేకాంక్షను కలిగించేదే గదా! అందుచేత 'ఏం ప్రబంధం నాన్నా అది? మనుచరిత్రేనా?.. వొచ్చే సంవత్సరం నాకూ దాంటోంచి కొంత పోర్షన్ పెడతారేమో...ఏదీ చూదాం తే' అన్నాడు రఘు; ఒకవంక సొరుగు తెరిచి పుస్తకం తీసుకోవాలని ప్రయత్నిస్తూనే.

విష్ణుమూర్తి దిక్కు తప్పిన వాడిలా ముఖం పెట్టాడు. మేజా సొరుగుకు చెయ్యి అడ్డం పెట్టి 'అబ్బే...అబ్బే .. అదీ మనుచరిత్రం కాదురా; వసుచరిత్రం...అదయినా పాత ఎడిషన్' అని ఒడబడ్డాడు. మళ్ళీ కుదుటబడ్డాడు. 'అబ్బో...ఎప్పటిదనీ...అంతా గజిబిజిగా వుంటుంది...యిప్పుడు చక్కగా పాకెట్ బుక్ సైజ్‌లో వొస్తున్నదిగా కొనుక్కుందువు గానిలే ...అదీ కాకపోతే టీకాతాత్పర్యంతో డీలక్స్ ఎడిషన్ కొనుక్కుందువులే......' అన్నాడు.

అంతలో 'కెవ్వు'మని కేకవేసింది శారద... 'తేలు! తేలు!!' అని అరుస్తోంది.

రఘు అటు వెళ్ళాడు.

'బ్రతికాన్రా తండ్రీ' అనుకున్నాడు విష్ణుమూర్తి.

అంతలో చప్పున మేజా సొరుగుతీసి పుస్తకం దొరకబుచ్చుకుంది సుశీలమ్మ...'ఏం పుస్తకమండీ...' అంటూ. పేజీలు తిరగేసి, అక్కడక్కడా పద్యాలు చదివి చూసింది. చిన్నపిల్లల్ని బెదిరించేట్టు కళ్ళురిమి, నాలుక పంటితో నొక్కి అభినయించి 'ఇదేనా మీ చదువు ?' అంది.

దొరికిపోయిన దొంగలా గాభరా పడిపోయాడు విష్ణుమూర్తి. 'నన్ను క్షమించు...యిప్పుడీ పుస్తకం బయటపెడితే వాళ్లు నన్ను ముప్ఫై చెరువుల నీళ్లు తాగిస్తారు' అన్నాడు.

సుశీలమ్మ మరోమారు నవ్వి పుస్తకం అతనికిచ్చేసి వెళ్లిపోయింది.

విష్ణుమూర్తికి మనసు కుదుటబడింది. పుస్తకాన్ని మేజా సొరుగు లోపలగా దాచేసి రఘు వదిలిపెట్టి వెళ్లిన పెట్టె శోధిస్తున్నాడు. ఆ పుస్తకాలు—'చంద్రరేఖా విలాపము' ఇత్యాదులు. ప్రబంధాలే. కాని, పద్యాల్లో బూతు—శృంగార సుగంధాలు.

తేలును కొట్టడానికి హోల్సేలకం జరుగుతోంది. శారద ఒక వంటకట్టె పుచ్చుకుంది; తేలు కదల కుండా ఆగినప్పుడు ఒక్క దెబ్బతో కొట్టెయ్యాలని చూస్తోంది. ఒక చేతో ఒక పెద్ద అట్ట, మరో చేతో యినుపచువ్వ పట్టుకుని సమయంకోసం చూస్తున్నాడు రఘు. 'ఇటొదిలిపెట్టండి — వీధిలోకి తీసుకువెళ్లి చంపుదాం' అంటున్నాడు. సుశీలమ్మ చీపురు పుచ్చుకుని తయారయింది. 'నువ్వటుండరా వాసూగా! చూస్తే దాన్ని ముద్దు పెట్టుకునేలా వున్నావు' అంటూ చేతిలోని చీపురు తిరగేసింది.

ఎట్టకేలకు తేలు, పాపం, చచ్చింది!

'తేలుగారి అంతిమయాత్ర' అంటూ అట్టతో వీధిలోకి వెళ్లాడు రఘు. గోల గోలగా అరుస్తూ వాసూ కూడా వెంటబడ్డాడు.

'జాగర్తండీ ... మాయ తేళ్లు...ఏ మూల దాక్కుంటాయో ఏమో...ఆ పుస్తకాలు కాస్త చూసి దులపండి' అంది సుశీలమ్మ భర్తతో.

శారద చాలా సామగ్రిని ఒక పట్టుపట్టి వది లేసింది. గదంతా చిందరవందరగా వుంది. మళ్లీ వాసూగాడొచ్చి గజిబిజిని మరింత కలగాపులగం చేస్తున్నాడు. రఘు ఆ గదిలో పాతపుస్తకమన్నది కనిపిస్తే చాలు—శోధించి పారేస్తున్నాడు. సుశీలమ్మ ఒక వంక భర్తతోనూ మరోవంక పిల్లలతోనూ మాట్లాడుతూనే కసురుతూనే, అటీ యిటీ అటూ యిటూ ఏర్పరిచి పారేస్తూ మహారణ్యంలో మార్గం వెదుక్కుంటున్న దానిలా నానాహంగామా చేసేస్తోంది.

ఇదేం అయేపనిలాగ కనిపించలేదు విష్ణు మూర్తికి. ఇక లాభం లేదనుకుని చెక్కపెట్టె పక్కకువాల్చి దానిపైకెక్కినిలబడి కాస్సేపు 'పరి శోధన విరమణ' ప్రకటించాడు. కొత్త ప్రపోజల్ తెచ్చాడు. ఎల్లరూ ఒప్పుకొనిరి.

చెక్కపెట్టెమీద అట్లాగే నిలబడ్డాడు విష్ణు మూర్తి. అతనికొకవేపు సుశీలమ్మ, శారద; మరోవేపు రఘు, వాసు. విష్ణుమూర్తి వేలంపాటలా పాడు తున్నాడు. మొదటగా వొచ్చింది: 'కాకీ నిక్కర్... కాకీ నిక్కర్'...ముమ్మారు పాడాడు—'ఎవరికీ వొద్దా.

'ఇంటో ఉన్నప్పుడు నువ్వే వేసుకోరాదు నాన్నా?'. వాసూగాడి సలహా.

'రఘూ!...నువ్వేసుకోరాదూ యింట్లో ఉన్న ప్పుడు?' తమ్ముడికి శారద సూచన. రఘు మండి పడ్డాడు 'అలాగేలే! నాన్నా—అదిటివ్వు...వా దగ్గరే దాచిపెడతాను...అక్కపెళ్లిలో బావగారికి చదివిస్తాను' అన్నాడు.

శారద ముఖం ఎర్రబడిపోయింది. 'ఛీ! ఛీ!... చూడే అమ్మా' అంటూ తల్లిపైటలో తలదాచు కుంది. సుశీలమ్మ నవ్వింది.

'ఇటివ్వండి...మన పనిమనిషి ఎన్నోనాళ్ల నుంచో మొగుడికేదైనా పాతగుడ్డ యిమ్మని అడుగు తోంది' అని భర్తచేతినుంచి కాకీ నిక్కరు లాక్కుంది.

పాతగోనెసంచీ భోగికి కేటాయించబోయాడు విష్ణుమూర్తి. సుశీలమ్మ దాన్ని స్వాధీనం చేసుకుంది. 'ఎందుకు పనికొస్తుం?'దంటే 'పెరట్లో గచ్చు తుడుచుకోవ'చ్చంది.

చాంతాటి చుట్ట మూలకి పారేశాడు విష్ణు మూర్తి. 'ఉరేట్సుకోవాలన్నా పనికొచ్చేలా లేదు' అన్నాడు.

'ఉయ్యాల కట్టుకోవచ్చు నాన్నా...' అని శారద దాన్నితీసి తల్లి చేతుల్లో పెట్టింది.' తమ్ముడి పెళ్లయి మరదలుపాపనెత్తుకున్నప్పుడు—మరిచిపోకుండా యీ తాటితోనే ఉయ్యాల కట్టాలమ్మా' అంది.

ఈ మారు ఓటమిని అంగీకరించడం రఘు వంతు.

సుశీలమ్మ విష్ణుమూర్తి వంక చూసింది. నవ్వింది.

విష్ణుమూర్తి, పాపం, చాలా అలిసిపోయాడు. పావుగంటైంది.

దాదాపు అన్ని సామాన్లూ వేర్పరచడం అయి పోయింది. ఏవో కొన్ని కాగితాలుమాత్రం మిగిలాయి.

ఇప్పుడు తీరాచూస్తే 'భోగిమంట కేటాయింపు'— అతి తక్కువ. నాలుగైదు న్యూస్‌పేపర్లూ, మరీ అక్షరాలే పోల్చలేనంతగా చెదలుతిన్న మూడు పుస్తకాలు, కొన్ని గుడ్డపీలికలు, అట్టముక్కలూ, అస్థిపంజరం వంటి ముసలివెదురుబుట్ట వొకటి— అంతే !

'రేపటి భోగియజ్ఞం మంటకు యీ మాత్రం సమిధలు లేకనా నన్ను అటక ఎక్కించారు ?' అన్నాడు విష్ణుమూర్తి వగురుస్తూ.

'పోన్లే నాన్నా ... యిన్నాళ్లకి యీ సామగ్రి వెలుతురుముఖం చూస్తోంది' అన్నాడు రఘు.

'అటక బరువుకూడా తగ్గింది' అంది సుశీలమ్మ, పుచ్చిన అటకవాసంకేసి జాలిగా ప్రేమగా చూస్తూ. విష్ణుమూర్తికేసి చూసి 'మంచినీళ్ళు పుచ్చుకుంటారా, పాపం అలిసిపోయారు' అంది.

'అక్కర్లేదు' అన్నాడు విష్ణుమూర్తి ఉడికిపోతూ.

'పోన్లెండి' అని తప్పుకుంది సుశీలమ్మ.

'తేలు—తేలు—' అంటూ అడావుడీ పడుతున్నాడు రఘు. ఈ మారు వొక్కటి కాదు — నాలుగుతేళ్ళ సంసారం. రఘు, వాసు, శారద తలో ఆయుధం తీసుకుని తయారయ్యారు.

మిగిలిపోయిన కాగితాలు కెలుకుతున్నాడు విష్ణుమూర్తి. ఎప్పటెప్పటివో పాతపాతవి బయట పడుతున్నాయి. తను కాలేజీలో ఉండగా తండ్రి తనకు రాసిన జాబు, తనకాలేజీ సర్టిఫికెట్, ఫైనల్యాల్ రోజుల ఆటోగ్రాఫ్ పుస్తకం, కాలేజీగ్రూప్ ఫోటోగ్రాఫ్ ...

జరిగిన దినాల చరిత్రంతా హఠాత్తుగా ముందు నిలిచినట్లైంది.

'అంతగా ఆ కాగితాలు మీదవేసుకోకండి ... తేళ్ళు ఉంటాయేమో—' అంటోంది సుశీలమ్మ.

టక్కున ఆగిపోయాడు విష్ణుమూర్తి. కళ్ల ముందు అనుకోకుండా వజ్రం మెరిసినట్లయింది. చప్పున ఆ కాగితంతీసి చదువుకున్నాడు. అతని కళ్లు వింతగా మెరుస్తున్నాయి. ఉండి ఉండీ అతని పెదవుల మీదికి చిన్న విచిత్రమైన నవ్వు వచ్చింది.

భర్త వైఖరిచూసి, కనుబొమలు ముడిచి 'ఏమిటండీ అది' అంది సుశీలమ్మ. అతని ఆనందానికి కారణం ఊహించుకోలేక పోయింది.

'చెప్పుకో చూదాం' అన్నాడు విష్ణుమూర్తి, అల్లరిగా నవ్వుతూ.

ఆ నవ్వుతో మరీ మతిపోయింది ఆమెకు. 'ఏమిటి?—చెప్పండి ' అంది.

'నువ్వోడిపోయినట్లేనా?' ఇంకా నవ్వుతున్నాడు.

సుశీలమ్మ కోపం తెచ్చుకుంది. 'ఇదిగో—చెబితే చెప్పండి ... లేకుంటే లేదు—నాకు వంటకు టైమవుతోంది' అని ఆయుధం ప్రయోగించి; వెళ్లబోయింది.

'కుళ్లుబుద్ధి...ఓడిపోయావని ఒప్పుకోవుగదా' అంటూ విష్ణుమూర్తి కాగితం ఆమె చేతికిచ్చాడు.

ప్రియమైన విష్ణుమూర్తీ!

ఇప్పుడే నీ ఉత్తరం అందింది. రూమ్‌నంబర్ కాస్త సరిగ్గా రాసి పుణ్యం కట్టుకోబాబూ...ఉత్తరాలు చేతులు మారి చేతులుమారి వస్తున్నాయి. ఫ్రెండ్స్ పరాచికాలు భరించలేకుండా ఉన్నాను.

మొన్న రాత్రి కలలో నేను కనిపించానని రాశావు. ఏ చీరలో కనిపించానో రాయలేదేం? కాని, మొన్న రాత్రి నీ కిష్టమైన కనకాంబరం రంగుచీర కట్టుకొని పడుకున్నాను. నాకు బాగా జ్ఞాపకం; ఆ రాత్రి పడుకోబోయేముందు మా రూమ్ మేట్ అడిగింది. 'ఈ రాత్రి నువ్వు చాలా అందంగా వున్నావు సుమా...' అని; నన్ను చెంపమీద ముద్దుకూడా పెట్టుకుంది. నా కెందుకో అప్పుడు నువ్వే గుర్తొచ్చావు.

నువ్వు గుర్తు కొచ్చావనడం తప్పేమో! అసలు నిన్ను నేను ఎప్పుడు మరిచాను? ఇంకా నువ్వే నన్ను మరిచిపోతావు. ప్రేమకాబట్టి నీ ఉత్త రానికి యింత వెంటనే సమాధానం రాస్తున్నాను. నా జాబుకు జవాబు రాయడానికి నీకు మాత్రం వారం దినాలు కావాలీ? కాదంటావు. అయితే యీ ఉత్తరానికి వెంటనే బదులు రాయి చూదాం.

రూమ్ నెంబర్. 44. ఇట్లు,
క్వీన్ మేరీ కాలేజ్ హాస్టల్ నీ
చెన్నపట్నం. సుశీల.

సుశీలమ్మ తలెత్తి చూసింది.

విష్ణుమూర్తి ఇంకా అలాగే నవ్వుతున్నాడు. ఆ నవ్వుచూసి సుశీలమ్మ ఎందుకో సిగ్గుపడింది.

మౌనంగావెళ్ళి గదిలో లైట్‌కి స్విచ్‌వేసింది. పాలనురగలాంటి వెలుతురు గదంతా నిండింది.

వెలుతురు వచ్చివాలింది విష్ణుమూర్తి తల పైన. తలపైని మెరుస్తూన్న జుత్తుమీద, అతని కళ్ళలో...వెలుతురు కదిలింది.

వెలుతురు వచ్చివాలింది...అపుడే వీచిన సన్నటి చల్లగాలికి కదిలిన సుశీలమ్మ తెల్లటి ముంగురుల మీద, ఆమె పెదవులమీద.

ఎంతో కాలానికి సుశీలమ్మ మధురంగా నిశ్వ సించింది. వెలుతురు కదిలి మెరిసింది.

వెలుతురు! సృష్టి మొదటిదినాన పుడమిని తాకి పులకింపజేసిన లేత బంగారపు జిలుగు వెలుతురు. అదే వెలుతురు యుగయుగాల నుండి—గుండె గుండెలో అదే వెలుతురు.

నేటికీ ఏనాటికీ అదే వయసులేని వెలుతురు!

దగ్గరగా వచ్చిన విష్ణుమూర్తి కనులలో అప్పుడు కోటిభోగిమంటల వెలుతురు చూసింది సుశీలమ్మ.

ఉలికిపడి చూసుకుంది.

చల్లగా అతని చేతులు విడిపించుకుంది సన్నగా నవ్వింది. 'పిల్లలొస్తున్నారు—' అంది.



# దుఃఖాన్ని మాత్రం పిలవకు!

శ్రీ కె. శివారెడ్డి

దుఃఖాన్ని మాత్రం పిలవకు
అది దరిద్రంకన్నా
దరిద్రాతిదరిద్రమైంది.
నిస్తేజమైన
నిర్వీర్యపుటాలోచనల్ని పోగుచేస్తుంది.
మంటలు సృష్టించలేదు
తడిసిన ముద్దయిన కట్టెబతుకు దాంది.
మహోజ్జ్వల భవిష్యత్తును
ఖూనీచేసే ఖూనీకోరు.
దుర్వినియోగం చేయబడ్డ
కాలాని కది ప్రతిబింబం.
'సెల్ఫ్‌పిటీ'లో మనిషిని సమాధి చేస్తుంది.
పిరికితనాన్ని నిశ్శాడి
వజ్ర సంకల్పాన్ని కూడా
విచ్ఛిత్తి చేసే భ్రష్టరాలు అది.
అందుకే
నువు దేన్నైనా ప్రేమించు
కాని దుఃఖాన్నిమాత్రంకాదు,

ఆరిపోయిన కొలిమికది చిహ్నం.
(దుఃఖమంటే పరమ అసహ్యం నాకు)
ఆశని గిల్లి
అధైర్యాన్ని చల్లి
చీకటి కోనేటిలో
మనసుని తొక్కేస్తుంది.

## దుఃఖాన్నిమాత్రం పిలవకు !

నరాలు
బలహీనతని రమించినప్పుడో
గుండెజారి
ఏ నడిరోడ్డు వీధో
ముక్కలు ముక్కలైనప్పుడో
అది జన్మిస్తుంది,
క్రియాశూన్యతనుంచి
శుష్కవేదాంతావిష్కరణ కది
నర్సు అయినప్పుడు
రక్తంలో ఎదురు తిరిగే శక్తి లుప్తమై
పూర్వానుస్వారానికి బతుకును
దిగజార్చి
కిలాకిలా నవ్వే దుఃఖాన్ని
విషాదం గోరింటాకు పెట్టుకుని
సన్నని నాజూకైన నిస్పత్తువ వేళ్ళున్న
ప్రేయసి దుఃఖాన్ని మాత్రం
పిలవకు—కొలవకు.

———



# మహాకవి తిక్కన - కవితారీతులు

## శ్రీ శింగనమల్ల రాధాకృష్ణయ్య

ఆగస్టు 71 భారతి సంచికలో శ్రీ కాళూరి హను మంతరావుగారు 'తిక్కన అనువాద సరణి—అంబో పాఖ్యానము' అను శీర్షికతో ఒక విమర్శను వ్రాశారు. అందులో శ్రీవారు కవిబ్రహ్మ పట్ల కొన్ని తీవ్రా రోపణలను చేయుటం జరిగింది. తిక్కనభారతంలో పాత్రపోషణ చక్కగా జరుగలేదని పాత్రలు తోలు బొమ్మలని ఆక్షేపించారు. మహాకవి అనువాదంలో కావ్యపుష్టి కొరవడిందట. ఈ విమర్శకు ఆధారంగా అంబోపాఖ్యానాన్ని స్వీకరించారు. వారి విమర్శను కూలంకషంగా పరిశీలించింతర్వాత అది పక్షపాత దృష్టితో కూడిందని తోచింది. నా అభిప్రాయాల్ని విజ్ఞుల ముందుంచుతున్నాను. అవధరింతురుగాక.

'కి మర్థం భరతశ్రేష్ఠ
నైవ హన్యాః శిఖండినమ్.'

అన్న శ్లోకానికి తిక్కన అనువాదమైన 'అన పుడు దుర్యోధనుడా' అనే కందాన్ని ఉదహరిస్తూ 'మూలంలో భీష్మణ్ణి దుర్యోధనుడు ప్రశ్నించడంలో 'అతని మనస్సులోని ఆరాటం తెలుస్తోంది. తిక్కన రచనలో అదిలేదు' అంటారు కాళూరివారు.

పై శ్లోకము దాని అనువాదము—ఈ రెంటిని పరిశీలించినట్లయితే శ్రీవారి విమర్శ సహేతుకమో కాదో తెలుస్తుంది.

'కి మర్థం భరత శ్రేష్ఠ' అనడంలో దుర్యో ధనుని రాజసం తొంగిచూస్తుందేగాని ఆరాటంగాదు. దుర్యోధనుడు యుద్ధసన్నద్ధుడౌతున్నాడు. కార్యార్థి. భీష్మునిబలపరాక్రమములపై ఆధారపడివున్నాడు. పైగా పైప్రశ్నవేసిన సందర్భం స్వపరబలాబలపరిశీలన జరుగుతున్నట్టిది. ఆ సమయంలో 'పాండవ బలంలో యెవరూ నాముందు నిలువలేరు. కాని నేనొక్క శిఖండిపైమాత్రం బాణము వెయ్యలేనంటాడు' తాత. అప్పుడు దుర్యోధనుడీ ప్రశ్నవేస్తాడు. మూలంలో 'కిమర్థం భరతశ్రేష్ఠ' అని గద్దించినట్లు ధ్వనింప చేస్తూంది. ఆ శ్లోకాలను పరిశీలించిన వాళ్లకు అందులో రాజసం కన్పిస్తుందేగాని రారాజు ఆరాటం తోచదు. తిక్కన ఆ రాజస గుణాన్ని పరిహరించి తెనుగు చేశాడు.

'అతని మీరు వధింపమికి గతంబేమియొకో వినదగునేనిం జెపుడా' అని తిక్కన వ్రాశాడు. అక్క డున్న అనౌచిత్యం తెనుగులో పరిహరింపబడింది. 'వినదగునేనిం చెపుడా' అంటూ సవినయంగా ప్రశ్ని స్తాడు రారాజు. దానిపైనున్న చరణంలో 'గతం బేమియొకో' అన్న ప్రయోగంలో పాత్రయొక్క ఆరాటం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. ఆ అనడంలోగల విచారమూ, ఆరాటమూ, ఎట్టి సామాన్య పాఠకునికైనా సుల భావబోధకములే.

'సేనా నాయకుడుగా అభిషిక్తుడైన భీష్ముడు మహోత్సాహంతో ఉన్నాడు. ఆ సన్నివేశంలో అతడు తన పరాక్రమాన్ని చెప్పుకొనడం చాలా యుక్తం. వ్యాసుడు పది శ్లోకాలలో ఇదంతా వర్ణించాడు.' కాని తిక్కన టూకీగా చెప్పాడని కాళూరి వారంటారు.

యుక్తా యుక్తాలను పాటిస్తూ పాత్రల్ని మలచటంలో తిక్కనకు సాటి యెవరూ లేరు. భీష్ముడు పరమ సాత్వికుడు. పరమ భాగవతులకోవకు జెందిన మహానుభావుడు. భూతభవిష్యత్తుల నెరిగిన వాడు. అన్నిటికిమించి వినయశీలి. సామ్రాజ్యాన్నేకాక సంసారాన్నే త్యజించిన త్యాగి, యోగి. మేరు సమాన ధీరుడు. అట్టి మహోన్నత వ్యక్తి ఒక్క చిరుత సేనాధిపతి పదవికిపొంగి అల్పునివలె స్వోత్కర్షను, రాజసభలో చెప్పుకొనటం యుక్తమనటం మాత్రం అనుచితం. వ్యాసుడైనా అట్టి స్థలాల్లో ఔచిత్యాన్ని

పాటించియే వుంటాడు. తరువాతి లేఖకుల స్వీయ కల్పనలు జేరి పెరిగిపోయి వుండవచ్చునని నా అభిప్రాయం. వ్యాసహృదయ మిదియని యింతవరకు ఖచ్చితమైన నిర్ణయాన్ని పండితులు, విమర్శకులు చెయ్యలేకున్నారన్నది జగద్విదితమే. తిక్కనకు లభించిన వ్యాసభారతప్రతిలో అట్టి అనౌచిత్యము లున్నాయో లేవో మనకు తెలీదు. ఒకవేళవుంటే వాటిని పరిహరించి వ్రాశాడనటం న్యాయం. తన గొప్పతనాన్ని గురువైన పరశురామునిముందు అంతగా చెప్పడం భీష్ముని సహజగుణంగాదు.

అంబాసాళ్వుల సంవాదం మూలంలో చాలా విపులంగా వుందని, తిక్కన పద్యాలు పొడి పొడిగా వున్నాయనీ, పాత్రచిత్రణం మృగ్యమనీ కాళూరివారి ఆరోపణ.

అలతి అలతి మాటల్లో అనల్పమైన భావాన్నిమిడ్చి చెప్పటం తిక్కన సహజగుణం. తిక్కన భారతమంతటా యీ గుణం సాక్షాత్కరిస్తుంది. తిక్కన పదప్రయోగాలు సాధించే ప్రయోజనం అనల్పం. భావుకుడైన పాఠకుని భావుకతకు తిక్కన పదప్రయోగాలు గీటురాళ్ళు.

శ్రీవా రుదాహరించిన పద్యాల్లో 'భీష్మ కొని పోయిన దానిం, కన్యాత్వమెడలె' అనే పదాలకున్న విలువ యిట్టిదని యెలాచెప్పటం! సాళ్వుని మన స్తత్వాన్ని ఈ పదాలలో గుప్పించి ప్రయోగించినాడు తిక్కన. తానోడి పోగొట్టుకొనిన కాంత అంబ. ఆమెను భీష్ముడు కొనిపోయినాడు. అట తన అసమర్థత తనకు తెలిసినదే. భీష్ముని గెల్చు సామర్థ్యము తనకు లేదు. పౌరుషవంతుడు, వీరుడు నగు రాజు తానోడి పోగొట్టుకొనిన కన్యను పునఃస్వీకారం చేసేందు కంగీకరిస్తాడా? అట్లా స్వీకరిస్తే తోటి రాజన్యులు నవ్వరా? ఇంత భావం ఆ పదప్రయోగంలో ధ్వనించడం లేదా?

ఇక 'కన్యాత్వ మెడలె' అనే ప్రయోగాన్ని పరిశీలిద్దాం.

అంబను, అంబిక అంబాలికలతోపాటు తీ తన రథంపై పెట్టుకొని 'మగటిమిగల రాజు గెల్చి వీరి గొనవచ్చు'నని ప్రకటించి తీసుకొని పోసాగాడు భీష్ముడు. ఎదిర్చినరాజులోడి వెనుదిరిగినారు. వాళ్ళల్లో సాళ్వుడుగూడా వున్నాడు. పురుష పాణిగ్రహణము అంబికాంబాలికలతోపాటు అంబకూడ పొందింది. అతనివెంటపోయి తనగోడు తెలుపుకుని తిరిగి సాళ్వుని దగ్గరకు పోయేనాటికి కొన్నిరోజుల వ్యవధి పట్టివుంటుంది. ఇన్ని రోజులు పరపురుషుని యింట వుండివచ్చిన అంబను సహజంగానేసాళ్వుడనుమానించాడు. అందుకే 'కన్యాత్వమెడలె'—అన్నాడు. ఈ మాటలో యెంతో భావముంది! అంబ సతీత్వాన్ని కోలుపోయి వుండవచ్చుననే అనుమానం ధ్వనిస్తోంది. అందుకే పాపమా అభాగ్యురాలు ఆ నిందను భరించలేక 'కరుణంబుగ నేడు'వ సాగింది. 'కరుణంబుగ నేడ్చు తలోదరి' అనటం పొడిమాటలని భావించటం విచిత్రంగా కన్పిస్తుంది. ఆమె గోడు వినలేని కఠినాత్ముడైనాడు సాళ్వుడు. 'పో పొమ్మిచట నింక దడయకు' మంటూ ఆమెను 'మందిరము వెడలంగ నడచి'నాడు. ఆమె అచ్చట ఒక్క క్షణమైనా వుండటాన్ని ఓర్వలేక పోయినాడు. ఆమెనుచూస్తుంటే అతని హృదయమంతా పరాభవానలంచే మండిపోతూంది. కాని ఆమె అతని హెచ్చరిక వినలేదు. ప్రియుని మదికరుగుతుందేమో నని 'కరుణంబుగ నేడ్చుచు' నింకయు నట్లే యున్నది. అది సహించలేక 'వెడలంగ నడచి'నాడు. అంటే పరిచారకుల చేత వెళ్ళగొట్టించాడు. అప్పు డంబయు అవమానితయై విధిని దూఱుచు 'నార్తచిత్తయై వికలగతిన్' బోసాగింది. ఈ 'ఆర్తచిత్తయై', 'వికలగతిన్' అనే మాటలు అంబదైన్యాన్ని చక్కగా చిత్రీకరిస్తున్నాయి. తిక్కన నాటకీయమైన శైలికి యీ రెండుపద్యాలు మచ్చుతునకల్లాంటి ఉదాహరణలు. అట్టివి పొడిపొడిగా కనిపించడాన్ని ఏమనాలి!

తిరస్కృతయై వెళ్లిపోతున్న అంబ మనఃస్థితిని తిక్కన సరిగా చెప్పలేకపోయినాడంటారు కాళూరి హనుమంతరావుగారు.

'నిష్క్రామంతీతు నగరా చ్చింతయామాస దుఃఖితా' మొదలుగాగల శ్లోకాల్లో బాదరాయణ

డామె దుఃఖాన్ని, మనోనిశ్చయాన్ని వర్ణించినాడు. తిక్కన యీ సందర్భంలో 'చనిచని యువ్వెలంది యిట్లని వితర్కించు' ననుచు వ్రాసిన వచనమును, పద్యమును ఉదాహరించి ఇందు పాత్ర మనోవిశ్లేషణం లేదంటారు వ్యాసకర్త.

'సాళ్వునకుగానియపుడ సంసారమునకు బాసితిన' అనే మాటల్లో అంబ మనోవిశ్లేషణం లేదనటాన్ని యేమనుకోవాలి? ఆమె మాటల్లో యెంత దుఃఖంవుంది? సంసారం స్త్రీకిపరమావధి. సంసారం అంటే జీవితంఅనే భావంకూడా వుంది. ప్రపంచపరంగా కూడా ఆ పదాన్ని వాడతారు. అట్టి 'సంసారమునకు బాసితిన' అంటోంది అంబ. 'బాసితిన' అనటంలో ఆమె హృదయవేదనఅంతా తెలిసిపోవటంలేదా?

వ్యాసభారతంలోని ప్రక్షిప్తభాగాలను కూడా వ్యాసప్రోక్తములుగానే కొందరు భావించవచ్చు. అసలు విషయం మనకు తెలియదు. భారతకథ వ్యాసుని సమకాలికుల చరిత్ర. దాన్ని చారిత్రకదృష్టితో చెప్పుకుంటూపోయాడు బాదరాయణుడు. దాన్ని కావ్యదృష్టితో తెనిగించాడు కవిబ్రహ్మ. అంబ తపస్సుకు పూనుకొనటం, మునులచేత వారింపబడటం, హోత్రవాహనుడూ, అకృతవ్రణుడూ రావడంవంటి సంఘటనలను వివరంగా చెప్పడంలో వ్యాసుని చారిత్రికదృష్టి స్పష్టంగా కనిపిస్తోంది. ఆమె తపస్సునుగూర్చి విపులంగా చెప్తాడు వ్యాసుడు. భీష్మునిచేత పలికించినప్పటికి వ్యాసరచనలో భీష్ముని మాటలకు బదులు వ్యాసవాణియే అధికంగా వినిపిస్తుంది. కాని తిక్కన అట్లాగాదు. తాను చెప్పవలసిందేమిటో, పాత్రచేత పలికించవలసిందేమిటో తెలుసుకుని జాగ్రత్తగా కవిత చెప్పటం తిక్కన అలవాటు. భీష్మునికి తన శత్రువైన శిఖండి పూర్వజన్మలో అంబగాపడినకష్టాలను హృదయవిదారకంగా వర్ణిస్తూ యుద్ధసన్నద్ధులౌతున్న రాజుల ముందు చెప్పాల్సిన అవసరం యేమాత్రంలేదు. అది అంబోపాఖ్యానంగాని ప్రధానకథగాదు. అట దాన్ని చెప్పే భీష్ముడు రణకళాశూరుడుగాని కథకుడంతకంటేగాదు. ఈ పరిశీలనజేసి ఔచితిని పాటించిన తిక్కనలో కావ్యదృష్టి లేదనటాన్ని యేమనాలి?

ఇక 'జహిభీష్మంరణేరామ' అనే శ్లోకంలో అంబకోపం ప్రదర్శితమౌతోంది, 'భీష్ముడెన గోపము నామది గల్గియుండు'ననటం పేలవంగావుందిఅంటారు శ్రీవారు.

పరశురాముడవతారమూర్తి. అతడంటే క్షత్రియజాతికి హడలు. వారి రక్తంతో తండ్రికి తర్పణమిచ్చిన పుత్రుడు. రవిసమానుడు. ఆ మహనీయుని దర్శనార్థం తహతహచెందే అంబ తీరా ఆ మహానుభావుడు దర్శనమిస్తే వినయహీనయై (యెంత కుపితఅయితేమాత్రం?) మాట్లాడగల్గుతుంది! ఒక సామాన్యస్త్రీ, అందునా కార్యార్థియైన అబల, మరొక మహోన్నతమూర్తిని 'నాకు ప్రియం చెయ్యదలచినట్లయితే యుద్ధానికి సన్నద్ధుడవై అసురుని వలె గర్జిస్తున్న భీష్ముని చంపు'మని ఆజ్ఞాపించ గలదా? మహాక్రోపిష్టియైన పరశురాముని ముందు?

కార్యసాధకుని తత్త్వమదియేనా? 'నాకు ఫలానా పని చేసిపెడతావా పెట్టవా?' అంటే పని నెరవేరుతుందా? మహాశౌర్యవంతుడైన పరశురాముని 'ఓ రామా నీవు యుద్ధానికి పొమ్మ'ని ఆజ్ఞాపిస్తే ఆ శూరకులవతంసుడు వింటాడా? అంతటి ధైర్యము అంబకువున్నదా? ఒకవేళ ఉన్నట్లు చిత్రిస్తే అది యెంతవరకు సమంజసం?

ఔచిత్యాన్ని పాటించడంలో సమర్థుడైన తిక్కన దృష్టికి 'జహిభీష్మం రణేరామ' అన్నవాక్కు అంబవాక్కుగా కనిపించలేదు. అది వ్యాసవాణి. పరశురామునికి అన్నివిధాలా దీక్షైనవారు బాదరాయణుడు. అతను విష్ణుని అవతారము. ఇతనినికూడా విష్ణుని అవతారమనియే అంటారు. 'వ్యాసాయ విష్ణురూపాయ' అనిగదా ఆర్యోక్తి. అందుకే 'జహిభీష్మం రణేరామ' అనగలిగారు.

తిక్కన సృష్టించిన అంబ కార్యసాఫల్యంకోసం పోయినట్టిది. వినయంగా పరశురాముని సమీపించింది. తను పడ్డ భంగపాటును వినయంగానే నివేదించుకొన్నది. తనమదిలో వున్న కోపాన్ని వినయంగానే వెలిబుచ్చింది—'భీష్ముడెన గోపము నామదిగల్గియుండు—'నంటూ ఈ పలుకుల్లో ఆమె చాతుర్యం తొణికిన

లాడుతోంది. భీష్ముడు జామదగ్నికి కూరిమి శిష్యుడు. భంగపాటును తెలిపి మెల్లగా చావువార్త ను అతని చెవినివేసి 'నీ శరణంబు జొచ్చితిన్' అంది. శరణాగతరక్షకుడుగదా ఆ అవతారమూర్తి. అలా అతనిని తనకార్యసాఫల్యంకోసం వినియోగించింది అంబ. ఇంత చక్కగా అంబ పాత్రను చిత్రీకరించిన మహాకవిలో కావ్యపుష్టి లోపించిందా? అతను చిత్రించిన అంబలో మనోవిశ్లేషణం మృగ్యమా ?

'నభయా న్నావ్యనుక్రోశా
కో జాతు......'

వంటి వాక్యాలను తిక్కన అనువదించలేదు. అంత మాత్రంచేత భీష్మ జామదగ్న్యుల సంభాషణ నీరసంగా వుందనుకోవటం పొరపాటు.

శ్రీవా రుదహరించిన—
'క్షత్రియుల దొల్లి యలుకకు'

అన్న పద్యంలోమాత్రం గాంభీర్యం లేదా ?

'యచ్చాపి కత్థసే రామ ... తృణేషు జ్వలితం త్వయా'అనే శ్లోకాలలో గంభీరత్వంకంటే వాచాత్వం కొట్టవచ్చిన ట్లగుపిస్తోంది. భీష్ముడు వాచాలుడుగాడు. మహాపరాక్రమోద్రగుడు. అతని నోటి నుండి అట్టి వాక్కు వెలువడటం అసహజం. అందుకే తిక్కన 'క్షత్రియుల దొల్లి యలుకకు బాత్రము సేసితటె ?' అనిపించాడు భీష్ముని ముఖంగా.

'నాడు బలియుడు గంగాపుత్రుడు పుట్టమిగొ కిది...' వంటి పలుకుల్లో గాంభీర్యము లేదనగలరా? ఈ పద్ధతి పరమసాత్త్వికుడైన భీష్ముని కెంతేని తగియున్నది. భీష్మపాత్ర చిత్రీకరణలో తిక్కన యెంతో జాగ్రత్త వహించాడు.

'యద్వైవహి వనం ప్రాయాత్' అన్న శ్లోకం ధీరోత్తముడైన భీష్ముని గుణానుగుణంగా లేదు. ఇచ్ఛామరణమును బొందగలిగిన భీష్ముడు మరణానికి భయపడేవాడా ? అట్టిడు అంబతపస్సుకు భయపడ్డాడనటం హాస్యాస్పదంగాను తత్పాత్రను నీరసించునట్లు చేసేదిగానులేదా? అట్లా భయపడేవాడు జ్ఞానియెలా అవుతాడు ? అందుకే దాన్ని విడిచిపెట్టాడు తిక్కన.

ఇక అంబ తపస్సు విషయం. అంబోపాఖ్యానాన్ని వినిపించినసభ కదనకుతూహలంతో ఉరకలెత్తే రాజన్యులసభగాని కథాకాలక్షేపార్థమో లేక వినోదకాలక్షేపార్థమో సమావేశమైనసభ గాదు. అట అంత సుదీర్ఘంగా వర్ణన అనుచితం.

ఒక్క అంబోపాఖ్యానాన్నిమాత్రం ఉదహరిస్తూ తిక్కన పాత్రలన్నీ తోలుబొమ్మలని ఆక్షేపించిన శ్రీ కాళూరి హనుమంతరావుగారు తిక్కన నంతగా పరిశీలించలేదనిపిస్తోంది. ఈ విమర్శను విజ్ఞులు సాదరంతో పరిశీలింపగలరని ఆశిస్తున్నాను.

# అంబోపాఖ్యానం: తిక్కన రచన

## శ్రీ సంపత్కుమార

తిక్కన అనువాదసరణి — అంబోపాఖ్యానము! అన్న వ్యాసం (ఆగస్టు' 71 భారతి) చివరిపేరాలో '......సంస్కృతంరానివారికొరకు మహాభారతంలోని విషయాలు సూక్ష్మంగా చెప్పడంకొరకే తిక్కన మహాభారతానువాదం చేశాడని చెప్పవలసివస్తుంది...'అని శ్రీ కాళూరి హనుమంతరావుగారు సిద్ధాంతీకరించినారు. ఉదాహరణప్రాయంగా వ్యాసభారతంలోని అంబోపాఖ్యానాన్ని తిక్కనగారు ఎంత 'అస్థిపంజరం'గా అనువదించినారో చూపించినారు. ఆ చూపింది ఎంత వరకు సమంజసంగా ఉందో పరిశీలించడం అవసరంగా అనిపిస్తుంది.

ఈ 'అంబోపాఖ్యానం' అనువాద విషయంలో

శ్రీ రావుగారి నిష్కర్ష '—వ్యాసుని రచన సర్వాంగ పుష్టి, బలమూ, తేజస్సూ కల శరీరంవలెఉండగా, తిక్కన రచన అస్థిపంజరంవలెఉంది. వ్యాసుని రచన చదువుతూఉంటే కరుణ, ప్రేమ, ఔదార్యం, రోషం, అసూయ, పగ మొదలయిన అనేకగుణములుకల సంపూర్ణమానవులు మన కళ్లముందు సహజంగా నడయాడుతారు. తిక్కన పాత్రలు తోలుబొమ్మలాటలో బొమ్మలవలె ఎవరో కదిలించి మాటాడించినట్లుగా కొంచంకొంచంగా గబుక్కున కదులుతూ మాట్లాడుతారు' అని.

ఈ నిష్కర్షకు రావటానికిముందు ఒక అంశం ప్రధానంగా గుర్తించవలసిఉన్నది. మహాభారతంలో అంబావిషయం ఒక 'ఉపాఖ్యానం' మాత్రమే. అందువలన ప్రధానకథకు దాని అవసరం ఎంత? ఎంతవరకు ఏరూపంగా, ఏరీతిలో దాన్ని చెప్పవలసి ఉంటుంది? మొదలయిన విషయాలను గుర్తించవలసి ఉంటుంది. లేకపోతే తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదంగా తయారయే ప్రమాదం ఉన్నది.

ఉపాఖ్యానాలన్నీ ఒకేరకంగా ఉండవు. కొన్నింటిని కవే స్వయంగా చెప్తాడు. కొన్నింటిని ప్రధాన కథలోని పాత్రలు చెప్తాయి—అంటే పాత్రలద్వారా కవి చెప్పించుతాడు. ఈ పాత్ర లొకప్పుడు ప్రధాన పాత్రలు కావచ్చు, మఱొకప్పుడు అప్రధాన పాత్రలు కావచ్చు. అంతేకాదు, చెప్పే ఉపాఖ్యానంతో ప్రధాన, లేదా అప్రధాన సంబంధంగల పాత్రలూ కావచ్చు. ఈ అంశం ఇట్లా ఉండగా, ఒకానొక ఉపాఖ్యానం ఏ సందర్భంలో చెప్పబడుతున్నది? ఏ ప్రయోజనాన్ని ఉద్దేశించి చెప్పబడుతున్నది? ఎవరికి చెప్పబడుతున్నది? మొదలయిన అంశాలనుగూడా ఉపాఖ్యానాలనుగూర్చి పరిశీలించే సందర్భంలో ప్రధానంగా గుర్తించవలసిన ముఖ్యాంశాలు. వీటన్నిటినీ దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే ఫలానా ఉపాఖ్యానం ఫలానా విధంగా ఎందుకున్నది అనే దాన్నిగూర్చి ఒక నిష్కర్షకు రావడానికి అవకాశం ఉంటుంది.

ఉదాహరణకు ఈ అంబోపాఖ్యానాన్నే తీసుకుందాం.

కౌరవ పాండవ యుద్ధానికిముందు దుర్యోధనుడి ప్రశ్నకు సమాధానంగా భీష్ముడు కౌరవపక్షంలోని అతిరథమహారథాదులనుగూర్చి చెప్పి, ఆపైన పాండవపక్షంలోని వారినిగూర్చిచెప్పి చివరకు 'పాండవులదిక్కు వీరు ల, ఖండితబలులైన నామొగంబునం బడి యు, ద్దండత చూపఁగలేరు శి, ఖండిని నొక్కరునిఁ జంపఁగాని—కుమారా!' అని అంటాడు. దీనితో పాండవ పక్ష వీరు లందరినీ తృణప్రాయంగా చెప్పిన భీష్ముడు, శిఖండిని ఎందుకు చంపలేనంటాడు భీష్ముడు అన్న సందేహంకలిగి దుర్యోధనుడు 'అతనిఁ జంపమికిఁ గతం బేమియొకో, వినదగునేనిం జెపుడా!' అని అడుగుతాడు. దానికి 'ఏనా శిఖండిని జంపమికి మూలంబు చాలంగలదు, తత్ప్రపంచంబంతయు వివరించెద నాకర్ణింపుము' అని భీష్ముడు అంబకథ చెప్పడానికి ప్రారంభిస్తాడు.

ఇక్కడ రెండంశాలను గమనించవలసి ఉన్నది. ఒకటి : భీష్ముడు ఈ కథను దుర్యోధనుడికి చెప్పుతున్నాడు. అంటే, తనకు ఆ కథలో ప్రాధాన్యంఉన్న పాత్ర ఆ కథను చెప్పుతున్నదన్నమాట. రెండవది : ఈ కథను చెప్పడంలో ప్రధానమయిన అంశం భీష్ముడు శిఖండిని ఎందుకు చంపడు ? అన్నది. వింటున్న దుర్యోధనుడికి ఈ అంశం ప్రధానమయింది. అందువల్ల చెప్పబడుతున్న కథ తదభిముఖంగా, తత్ప్రధానంగా ఉండవలసి ఉంటుంది. శిఖండి పూర్వజన్మలో అంబ; అందుకని అంబాకథ చెప్పవలసి వస్తున్నది. ఈ అంబాకథ చెప్పకపోతే ఆ శిఖండి విషయం పూర్తికాదు. దాని దృష్ట్యా ఇది చెప్పబడుతున్నది. కాబట్టి ఈ కథ చెప్పబడుతున్న సందర్భం, చెప్పుతున్న వ్యక్తి, వింటున్న వ్యక్తి, వీరికి ఆ కథలో ఏఅంశాలు అవసరం మొదలయిన అంశాలను గుర్తిస్తే ప్రస్తుతం ఈ అంబోపాఖ్యానాన్ని తిక్కన చెప్పించిన రీతిని మనం సరిగా అర్థం చేసుకోవచ్చు.

కథ భీష్ముడు చెప్పుతున్నాడు కాబట్టి, కథలో భీష్ముని శక్తి, ప్రతాపాదులు అతిశయంగా, ఆత్మశ్లాఘారూపంగా ఉండడానికి వీలులేదు. ఎందుకంటే భీష్ముడు ఉత్తమనాయకుడు. అవికత్థనత్వం ఉత్తమనాయక లక్షణం. దీనికి భీష్ముని చరిత్రలో బోలెడు ఉదాహరణలను చూసుకోవచ్చు. ఇట్లాంటి భీష్ముడు తానుగా చెప్పుతున్న—ఒకవిధంగా

అది తన కథకూడా—ఆ కథలో తన పరాక్రమాదుల ప్రకర్షను చెప్పవలసి వచ్చినప్పుడు కుదించి, క్లుప్తంగా అవసరమున్నంతవరకే చెప్పడం సహజం. అందుకనే తాను ఏకరథుడై కాశీరాజు సభకువెళ్లి, రాజుల నందరినీ అధఃకరించి కన్యలను హరించడం, తర్వాత యుద్ధంలో అందరినీ ఓడించడం, శ్రీరావుగా రన్నట్లుగా—'టూకీగా' చెప్పుకొన్నాడు. అట్లాకాక విశేషించి చెప్పితే, తనను తానే పొగడుకుంటున్నట్లవుతుంది...ప్రస్తుతం భీష్ముడు సేనానాయకుడుగా — సర్వసేనాధిపత్యం వహించి 'పరమోత్సాహంతో ఉన్నాడు' అని చెప్పడానికి వీలులేదు. ఎందుకంటే, ఇది భీష్మునికి ఆనందకరమయిన అంశంకాదు. పాండవులు కౌరవులూ ఆయనకు 'ఒక్కరూప' మయిన వారే. తప్పక వచ్చిందికాబట్టి కౌరవపక్షాన యుద్ధం చేయబూనుకున్నాడు. అందుకని కిరీటి తప్ప మిగిలిన వారు తనకు లెక్కలేదన్నాడు. (ఉద్యోగ—4—149). పైగా భీష్ముని దుర్యోధనుడు సర్వసేనాధిపతిగా అభిషేకించినపుడు రాళ్ళూ, నెత్తురూ, ఎముకలూ వర్షించినయి. (4—160) ఇట్టిస్థితిలో భీష్ముడు 'పరమోత్సాహంతో ఉన్నాడు' అనిగానీ, తన ప్రతాపాన్ని విశేషంగా వర్ణించుకుంటాడని గానీ చెప్పడానికి వీలులేదు. భీష్ముడు అనుభవాలతో పండిపోయిన మహానుభావుడు. అందువల్ల ఉద్వేగపడడు. కాబట్టి శ్రీరావుగా రన్నట్లు 'నిరుద్వేగంగా' కాశీరాజ సభాఘట్టాన్ని భీష్ముడు చెప్పడం కుదిరింది.

అంబాసాళ్వుల సంవాదం ప్రస్తావిస్తూ 'అంబయునట...' '...కరుణంబుగ నేడ్చు...' అన్న రెండు పద్యాల నుటంకించి 'ఈ పద్యాలు పాడి పాడిగా ఉన్నాయి; తిక్కన రచనలో కథ చెప్పుకుపోవడం తప్ప పాత్ర చిత్రణం వ్యంగ్యం' అన్నారు శ్రీరావుగారు. ఈ కథను తిక్కన చెప్పడంలేదు, భీష్ముడు చెప్తున్నాడు అన్న దృష్టి ముఖ్యం. ఇక, ఈ ఉటంకించిన రెండు పద్యాలకు మధ్య ఒక వచనం, ఒక తేటగీతి, ఒక వచనం ఉన్నాయి. వాటినికూడా గమనించవలసి ఉంది. ఈ రెండుపద్యాలూ, వాటిమధ్య ఉన్నభాగాలూ ఈ విధంగా ఉన్నాయి.

క. అంబయునట సాళ్వుని కడ
కుం బోయిన నతఁడు భీష్ము కొనిపోయిన దా
నిం బరచుం గైకొన ధ
ర్మంబే కన్యాత్వమెడలె మగువా నీకున్.

వ. ఇంక నిన్ను భార్యగా వరియింపం దగునే యనినఁ గామశరపీడితయగుచు నక్కామిని యతని కిట్లనియె.

తే. తమ్మునికిఁగాఁగ భీష్ముఁ డుదగ్రవృత్తిఁ
గన్నియలఁ గొనిపోయెడుఁ గాన బలిమి
నన్నుఁ గొనిపోయె, నాచేత నిన్ను వినిన
యపుడె పుత్తెంచె దూషింప ననఘ తగునె.

వ. మా తండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించిన కతంబున నింత వుట్టె, భీష్ముండు నా చెలియండ్రం దన తమ్మున కిచ్చి నన్ను నీ కడకుం దగననిచె దీననేమి తప్పని మఱియు ననేక ప్రకారంబులం బలికిన వినక తన్నుం జేకొనక సాళ్వుండు

క. కరుణంబుగ నేడ్చు తలో
దరిఁ బొమ్మిచట నింకఁ దడయకుమని మం
దిరము వెడలంగ నడిచిన
నరిగెనదియు నార్తచిత్తయై వికలగతిన్...

ఇక్కడ ప్రధాన విషయం భీష్ముడి తప్పేమీ లేదని సాళ్వునిముందు అంబ చెప్పడం. భీష్ముడు ఈ కథ చెప్పేప్పుడు ఈ అంశం అతనికి ప్రధానం, మిగిలినవి అప్రధానం. మరొకటి, అంబ ఈ అంశాన్ని

చెప్పడంలో భీష్ముడిని సమర్థించటం ప్రధానంకాదు, ఈ అంశాన్నిచెప్పి సాళ్వుడు తనను స్వీకరించేట్టు చేసుకోవాలన్నది ముఖ్యం. అందుకనే ఈ మాటలు మాట్లాడేముందు అంబ 'కామశరపీడితయగుచు' ఇట్లా అన్నదని చెప్పడం జరిగింది. ఆమె ఏఉద్దేశ్యంతో చెప్పినా, అది భీష్మానుకూలంగా ఉండడం వల్ల, భీష్ముడు వాటిని చెప్పినాడు. మిగిలిన అంశాలను 'అనేకప్రకారంబులం బలికిన'విగా చెప్పినాడు. ఇట్లా చెప్పడంలో ప్రస్తుత ఘట్టానికి అవి అముఖ్యం కావడమే కారణం. అంతేకాని అక్కడ పొడిపొడి తనం ఏమీలేదు.

ఆ తరువాత సాళ్వతిరస్కృతఅయిన అంబా మనఃపరిస్థితిని వర్ణించడం భీష్ముడి కనవసరం. ఆవిడ ఏ నిర్ణయానికి వచ్చిందో అది అవసరం. ఆ నిర్ణయానికి ఆమె రావడం భీష్మనిదృష్ట్యా ఆలోచనా రహితం. కేవలం అవ్యవస్థిత మనస్కతవల్లనే ఆవిడ ఆ నిర్ణయానికి వచ్చిందిగాని, ఆలోచనా పూర్వకంగా కాదు. సరిగా ఆలోచిస్తే ఆమె సాళ్వుని సమాధానపరచడానికే నిర్ణయించుకోవలసిందితప్ప భీష్ముని సాధించడానికికాదు. ఈ నిర్ణయానికి వచ్చిందంటే, ఆమె ఆలోచన సరిగా చేయలేదనీ, ఆమె మనస్సు ఆలోచించేస్థితిలోలేదనీ అర్థం. అందువల్లనే భీష్ముడు ఆమె ఆర్తచిత్తయై వికలగతిన్ వితర్కించిందని అన్నాడు. పాత్ర మనోవిశ్లేషణం చిన్నమాటద్వారా ఇక్కడ సూచించడం జరిగింది.

ఈ ఘట్టంతరువాత అంబను పరశురాముడు తనవద్దకు తీసుకురావటం ప్రధాన విషయం. అందువల్ల అంబ మున్యాశ్రమాలకు వెళ్లడం, భార్గవుడిని ఆశ్రయించడం క్లుప్తంగా చెప్పడం జరిగింది. పరశురామునితో అంబ భీష్ముని దెసఁగోపము నామదిఁ గల్గియుండు అని చెప్పిందని భీష్ముడు దుర్యోధనుడితో చెప్పుతున్నాడు. అంతేతప్ప అంబ భార్గవుడితో భీష్ముడిపై తనకసిని ప్రదర్శిస్తూ మాట్లాడడాన్ని దుర్యోధనుడు ప్రత్యక్షంగా వినడంలేదు. అంబ స్వయంగా మాట్లాడినప్పటి మాటల్లోని తీవ్రత, ఆ మాట్లాడిన అంశాన్ని ఒక సంయమనంగల వ్యక్తి మళ్లీ చెప్పుతున్నప్పుడు ఉండకపోవడం సహజం.

పరశురాముడితో తన యుద్ధాన్ని భీష్ముడు కొంత వివరంగానే చెప్పినాడు. వసువులు తన కలలోకి వచ్చి మోహనాస్త్రాన్ని ప్రసాదించ వలసినంత అవసరం వచ్చిందనటానికి ఈ యుద్ధవివరణ కొంచెం అధికంగా భీష్ముడు చేయవలసి వచ్చింది.

భార్గవుడు భీష్మునికి ఓడి అంబను పంపివేసిన తరువాత, అంబ తపశ్చర్యా విషయాన్ని భీష్ముడికి నారదుడు చెప్పుతాడు. అంటే, తనకు నారదుడు చెప్పిన అంశాన్ని భీష్ముడు మళ్లీ దుర్యోధనుడికి ప్రస్తుతం చెప్పుతున్నాడు. ఈ అంశాన్నిగుర్తిస్తే, ఆ విషయం విస్తృతంగాఉండే వీలులేదు. ఈ తపశ్చర్యకు మూలం అంబ తన (భీష్ముని) వినాశానికై శివుడిని వర మడగటం ప్రధానం. శివుడు ప్రత్యక్షం కావడానికి అంబా తపస్సెంత గొప్పదో చెప్పడానికి 'పుణ్యాశ్రమముల నగణ్యంబగు తపము' చేసిందన్నాడు. ఈ అనడంగూడా నారదుడు చెప్పినదాన్నిబట్టి తా ననుకొన్నదే.

ఇక, అంబాకథ యమునాతీరాన ఆమె అగ్నిప్రవేశం చేయటంతో నిజానికి పూర్తిగాలేదు. ఆ తరువాత శిఖండిగా జన్మించడం వగైరా చాలా కథ ఉన్నది. అగ్నిప్రవేశంచేస్తూ భీష్మవధకోసం తానీపని చేస్తున్నట్లుగా అంబ అంటుంది. అందుకే ఆమె పట్టుదల మునులకు అద్భుతంగా తోచింది. 'క్రోధ, దీప్త మూర్తియై భీష్మ వధించుదాన ననుచు సొచ్చె మునులకు నద్భుతముగ' అని చెప్పబడింది. ఇక్కడ కరుణ విషాదాల కన్నా ఆశ్చర్యం ప్రధానం. సందర్భం అట్లాంటిది.

ఈ విధంగా కథాకథనశిల్పం దృష్ట్యా తిక్కన సంయమనంతో ఈ కథను భీష్ముడితో, తత్పాత్రానుగుణంగా చెప్పించినాడే తప్ప అస్థిపంజరంగా తయారు చేయలేదు. ఇంకా మిగిలిన అంబా కథను — మరోమాటగా శిఖండి కథను చూచినా, ఎందుకని ఈ కథ చెప్పటం అవసరమయిందో తదభిముఖంగానే సాగుతుందని స్పష్టంగా గుర్తించవచ్చు.

కాబట్టి ఉపాఖ్యానాలనుగూర్చి విచారించేప్పుడు (ప్రస్తుతం అదే అవసరంకాబట్టి) సందర్భం, చెప్పే

వ్యక్తి మొదలయిన అంశాలన్నింటిని దృష్టిలో ఉంచుకొనవలసి ఉంటుంది. మహాకవిత్వదీక్షావిధి నొందినాడు కాబట్టే తిక్కన ఈ మొదలయిన అంశాలన్నిటినీ జాగ్రత్తగా ఔచితీమండితంగా ఆలోచించి భారతకథను తీర్చినాడు.

'సముద్ర గంభీరమయిన వ్యాసభారతంముందు కవిత్రయ భారతం పిల్లకాలువ' అయినా, పంట కాలువ అయినా, అది ఎంత ఉచితంగా ఆస్వాదనీయంగా ఉన్న దనేదే ప్రధానం.

వ్యాసభారతంతో కవిత్రయభారతాన్ని ఈనాడు మనం అనుకొనే 'అనువాదం' పద్ధతిలో పోల్చడం ఈ మధ్య ఒక ఆనవాయితీ అయిపోయింది. దానికన్నా సన్నయగారన్నట్లుగా 'జననుత కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడ...అధికధీయుక్తిమెయిన్' తెలుగులో రచన సాగిందన్న దృష్టితో, తిక్కనగారు చెప్పినట్లుగా 'అమ్మహాకావ్యంబు సర్థంబు సంగతంబు సేయు' దృష్టితో రచన సాగినట్లుగా పరిశీలించటం అవసరం. అంతేతప్ప 'ఫలానా శ్లోకాన్ని కవిత్రయం అనువదించలేదు, అయ్యో, ఫలానాఘట్టాన్ని కుదించినారు' ఇత్యాదిగా ఆలోచిస్తే కవిత్రయభారతరచనను ఆస్వాదించగలుగడం కుదురదు మరి. కవిత్రయం భారత కథను తీర్చినరీతిని గుర్తించి, ఆ దారిలో ఆ రచనను గూర్చి ఆలోచించడం ముఖ్యం. అట్లా చూచినప్పుడు 'సంస్కృతంరానివారికొరకు మహాభారతంలోని విషయాలు సూక్ష్మంగా చెప్పడంకొరకే తిక్కన మహాభారతానువాదం చేశాడని చెప్పవలసి'రాదు.

---



# "చారుదత్త-ప్రతిభాదరిద్రత"

"శ్రీ కుమార భారతి"

చారుదత్తం—భాసకృతమని ప్రతీతి. కాని కథా నిర్మాణంలోవున్న అసందర్భాల ననుసరించి సంభాషణల్లో కన్పించే ఒడుదుడుకుల ననుసరించి పాత్రపోషణ మొదలైనవానిలో వున్న అస్నిగ్ధతనుబట్టి ఇది భాసరచనకాదు అనిపిస్తుంది.

భాసుడు శూద్రకమహాకవికంటె ప్రాచీనుడు. కాబట్టి చారుదత్తం మృచ్ఛకటికానికి మూలగ్రంథ మనేవాద మొకటుంది. కాని యిది సత్యదూరం. చారుదత్త నిర్మాణశైథిల్యాన్నిబట్టి అది భాసరచన కాదని స్పష్టపడితే మృచ్ఛకటికాన్ని క్లుప్తీకరించిన నాటకం చారుదత్తమని తేలుతుంది. ఇదీ ఒక వాదముంది. అనగా మృచ్ఛకటికం మూలగ్రంథం. చారుదత్తం రంగప్రయోజనంకోసం ఒక సామాన్యకవిచేతగాని, నటబృందంచేతగాని సంక్షిప్తమైన ప్రహసనం. అందుచేత చారుదత్తం భాసరచన కాదని నాటక నిర్మాణంలోని అస్నిగ్ధత నిరూపిస్తుంది.

నాటక ప్రారంభంలో చారుదత్తుడు తన పేదరికాన్నిగూర్చి బాధపడుతూ ఒక శ్లోకాన్ని చదువుతాడు. విన్న విదూషకుడు వెంటనే 'దానంచేసినందువల్ల ఎత్తుపడ్డ నీవు జ్యోత్స్నాక్షయమైన బహుళపక్ష చంద్రునివలె వున్నావు. దుఃఖింపకు'మంటాడు. చారుదత్తుడు తాను దారిద్ర్యానికి దుఃఖించడంలేదని గుణరసజ్ఞుడైన పురుషుని వ్యక్తిత్వవినాశనాన్నిగూర్చి బాధపడుతున్నానుకాని — అంటాడు. విదూషకుడు 'స్నేహితుడా! నీ అనంతమైన ఐశ్వర్యం ఏమైపోయింది'—అంటాడు. ఓదార్పుమాటలుచెప్పే విదూషకు డిలా అనడంచేత ఓదార్పుకు బదులు దుఃఖమే ఎక్కువౌతుంది. కాబట్టి ఈ వాక్యము సందర్భానికి అతకడంలేదు. అంతేగాక విదూషకుడలా చెప్పినతరువాత చారుదత్తుడు—తన ఐశ్వర్యం అంతా స్నేహితులకే దానంచేశాను. కాని ధైర్యంమాత్రం సన్నగిల్లలేదని అన్నాడు. ఇక్కడ నాయకుడు స్నేహితుడు కరువౌతున్నాడని చింతిస్తున్నాడుకాని సంపదలకోసం కాదు. అయినా విదూషకుడు మళ్లా—నీవు ఐశ్వర్యనాశనంకోసం చింతిస్తున్నావనడం అసమంజసం. పై చారుదత్తుని మాటల్లోని విషయం వేఱు. తరువాత చారుదత్తుడు పేదరికంవల్ల వచ్చేనష్టాలను వర్ణిస్తాడు. విదూషకుడంటాడు: 'గొల్లపిల్లకాయలు దోమలబాధతో ఇల్లువదిలి పారిపోయినట్లు సంపదలు కూడా పోయేవే.'అని. ఈ వాక్యంలో బరువులేదు. దీన్ని 'మృచ్ఛకటిక'తోపోల్చి చదువుకుంటేగాని అర్థబలం చేకూరదు—'కందిరీగలు కుట్టనిచోట్లకు పరువులెత్తే గొల్లపిల్లకాయల్లాగా సంపదలుకూడా ముట్టకుండా ముద్రవేసేవాళ్లదగ్గరికే పోతాయి'. (మృచ్ఛకటికం).

తరువాత చారుదత్తుడు తనకు ధనం లేకపోయినా సుఖదుఃఖసములైన స్నేహితులు, భార్య వున్నారు; నాకేమి తక్కువంటాడు. వెంటనే శకారవిటులు 'గణిక'ను వెంబడించే ఘట్టం ప్రారంభమవుతుంది. ఈ హఠాత్ప్రారంభానికి సహృదయ హృదయాలు అనుకూలంగా లేవు. కాక రంగంమీద ఒక ప్రక్క చారుదత్త విదూషకులున్నారు. వీరి ఉనికి వారి ప్రవేశాన్ని నిరోధిస్తుంది. ఇందుకే 'మృచ్ఛకటిక'లో చారుదత్తుడు సంధ్యోపాసనానిమిత్తమై లోపలకి వెళ్లాకగాని శకారఘట్టం ప్రారంభం కాలేదు. ఇలా ఒక ఘట్టం పూర్తికాగా రెండవది మొదలుకావడం సహృదయ ప్రేక్షకులకు తృప్తినిస్తుంది. హఠాత్తుగా రెండవదాన్ని ప్రారంభించడం మొదటి విషయాన్ని అనుకోకుండా ముగించడం నిర్మాత పనికాదు. ఇది 'చారుదత్త'—లో చాలా చోట్ల కన్పిస్తుంది. మూడవ అంకంలో సంగీతకచేరీకి పోయివచ్చి చారుదత్త విదూషకులు పండుకుంటారు. ఒకప్రక్క వీరు మాట్లాడుతుంటారు. రెండవప్రక్క కన్నగాడు సజ్జలకుడు ప్రవేశిస్తాడు. ఎలా పొసగుతుంది. తరువాత విదూష

కుడు 'ఇదిగో నగలు మూట వయస్యా! అందుకో' మంటూ కలవరిస్తాడు. సజ్జలకుడు అందు కుంటాడు. ఆ కలవరింత కలవరింతగా ప్రేక్షకుడెలా గ్రహించడం? అంతకు పూర్వం వాళ్లు మాట్లాడు తున్నారాయె. అదే ఘట్టంలో విదూషకుడు 'వయస్యా! నీ ఉత్తరీయం ఆ గణికా పరిచారికుడికి ఎందు కిచ్చి నట్లు?' (వాడు కర్ణపూరకుడు— ఇది రెండవ అంకంలో వస్తుంది) అనగా చారుదత్తుడు సమా ధానం చెప్తాడు. దానికి సమాధానంచెప్పి విదూషకుడు వెంటనే — నేను బరువుమోసే గాడిదలాగా భూమ్మీద దొర్లుతానన్నాడు. సంభాషణ హఠా త్తుగా ఆగిపోవడం, వెంటనే సంభాషణ మరొక విషయంమీదకి పోవడం, కథాపరిణామసౌందర్యం, సంభా షణావైచిత్రి దెబ్బతినడం.

శకారవిటుల వెంటాడుతున్నారు. ఏవేవో కూస్తున్నారు. (నాయిక వసంతసేనగా వ్యవహృత కాలే దీ నాటకంలో). గణిక 'నేను కులపుత్ర జనులను అనుభవించే వెలయాల' నన్నది—విటుడు 'అందుకే గదా ప్రార్థిస్తున్నాను.' అంటాడు,

గణిక : మీరునానుండి యేమభిలషిస్తున్నారు. శరీరమా? నగలా?

ఈ గణికా సంభాషణ చాలా మోటుగాఉండి వసంతసేన హృదయమాధుర్యాన్ని భంజిస్తున్నది.

'మృచ్ఛకటిక'లో ఇట్లావుంది.

వసంత-ఆర్యా నేనబలను.

విటుడు—అందుకే బ్రతికితివి.

శకారుడు—అందుకే నిన్ను చంపలేదు.

వసంత—నా నగలు వాంఛిస్తున్నారా ?

ఈ సంభాషణలోని సౌకుమార్యం పై దానిలో కనుపించదు.

గణిక—నగలా? శరీరమా? అనగా, విటుడు— 'లత పూలు దూయడానికి తగదు' అంటాడు. ఈ అందమైనమాట మృచ్ఛకటికలో చక్కని సందర్భంలో ఉంగరంలో రాయిలాగా పొదుగబడి కాంతి చిమ్ముతుంది. ఘట్టంలో మాధుర్యం దెబ్బతినకపోవడమే కాంతి వెదజల్లడమంటే. విటాదులు సచ్ఛీలురుగా మృచ్ఛ కటికలో కనిపిస్తారు. ఇందు నీచులు. ఈ నీచుని నోట అంత అందమైన మాట పట్టదు. ఈ ఘట్టంలో గణిక గణిక. విటుడు విటుడు. మృచ్ఛకటికలో గణిక వసంతసేన. శృంగారరసమాధుర్యం. విటుడు సచ్ఛీలుడు. ఇందుచే ఆ మాట అతుకు లక్షణాన్ని పట్టిస్తున్నది.

అదే ఘట్టంలో శకారు డంటాడు. 'చీకట్లు ముసురుకొంటున్నాయి. బావా (గణిక) సురిగి పోకుండా చూడు. ఈ ప్రక్కనే దరిద్రుడు చారు దత్తుని కొంప. కామదేవోత్సవం నాటినుండి ఆ దరి ద్రుణ్ణి ప్రేమిస్తున్నది.' అని. చారుదత్తునిలో ఏమి చూచి వసంతసేన ప్రేమిస్తున్నదన్న ప్రశ్నకు సమా ధానం నాటకంలో నిక్షప్తం కాలేదు. మృచ్ఛకటికలో అలాకాదు. శకారుడు యిలా అనడానికిపైన విటుడు వసంతసేనతో అంటాడు. 'నీవు రోవెలదివి. ఒకడు ప్రియుడు గావడం మరొకడు కాకపోవడమేమి?

వసం : ప్రేమకు బలాత్కారం కారణంకాదు. యోగ్యత.

ఈ మాట తరువాత శకారుని పైవాక్యం వస్తుంది. చారుదత్తంలో గణిక—వసంతసేన మాటకు బదులుగా— 'ఇతడు (విటుడు) నా కులగోత్రాలు త్రవ్వి నా అంగీకారం పొందజూస్తున్నాడు'అన్నఈమాట వుంది. తరువాత శకారుని మాట. ఇదొక అతకు. పొసగదు.

శకారుని మాటవిని గణిక సంతోషిస్తుంది. కాని విటుడు ఏమీ అనడు. మృచ్ఛకటికలో విటుడు యిలా అంటాడు—

'ఓహో! ఈమె చారుదత్తుని ప్రేమిస్తు న్నదా! రత్నం రత్నంతోనే కలుస్తుందిగదా! ఈ తుచ్ఛుడగు శకారునితో ఏమి? ఆమెనట్లే పోనిమ్ము.'

ఈ వాక్యం విటుని పాత్రకు ఎంత గీటు పెడుతున్నది! ఇలాగే పాత్రలన్నీ దిద్ది తీర్చబడడం మృచ్ఛకటికలోవుంది.

అదేచోట చీకటి వర్ణనవుంది. చీటిక ముసుగు వేసినా, నీ (గణిక) భూషణాల సవ్వడులు, మైపూతల తావులు నిన్ను పట్టిస్తున్నవి. నీవు సురిగి పోలే'వన్నాడువిటుడు. మృచ్ఛకటికలో యిదే అంటాడు విటుడు. కాని యిక్కడ వసంతసేన

తప్పించుకొనిపోయే మార్గాన్ని సూచించడానికిగా విటు డన్నాడు. 'చారుదత్తం'లో పట్టుకొనే ప్రయత్నంలో అన్నమాట అది.

గణిక చారుదత్తుని ఇంట్లోకిపోతూంది. అక్కడనుండి మళ్లా ఆ ఘట్టం.

చారు—మైత్రేయా! వెళ్ళు. చతుష్పథంలో మాతృకలకు బలివేసి రా?

విదూషకుడు—నాకు శ్రద్ధ లేదు. ఎవరి నైనా పంపు.

చారు—ఎందుకని?

విదూ—నా బుద్ధి కుడి ఎడమలను వ్యత్యస్తం చేసే అద్దంలాంటిది.

దీనికర్థం మృచ్ఛకటిక చూస్తేగాని అవగతంగాదు. అందులో విదూషకుని మాట — 'నావంటి బాపడు ఏది చేసినా వ్యత్యస్తంగా వుంటుంది. ఎందుకంటే—అని అద్దం పోలిక చెప్పాడు. ఈ మాటలు వసంతసేన—శకారాదులు ప్రవేశించడానికిముందే మృచ్ఛకటికలో వున్నాయి. వారి రంగమైనాక మళ్లా యీ చారుదత్తుని గృహరంగం— మైత్రేయుని బలి తీసికొని పొమ్మనటంతో ప్రారంభమౌతుంది. మైత్రేయుడు పోనంటూ— ఐనా నీవుమాత్ర మేంచేస్తావిక్కడ కూర్చుని— అంటాడు. చారుదత్తుడు—సరే. నేను సమాధి నిర్వ హించివస్తానని లోపలకు వెళతాడు. తర్వాత శకారాది రంగం, మళ్లా చారుదత్తుని మాటతో తద్గృహ రంగ ప్రారంభం జరిగి ఎంతో సహజతనాపాదిస్తున్నది, కథాక్రమానికి, గమనానికి. ఇదంతా వ్యత్యస్తమైంది చారుదత్తంలో. దీనివల్ల ఈ గ్రంథకర్త భాసుడు కాదన డమే స్పష్టపడడంకాక మృచ్ఛకటికచూచి దానిని కుదింపుచేయడానికిచేసిన ప్రయత్నమే చారుదత్తం అని స్పష్టపడుతున్నది.

గణిక చారుదత్తుని యింట్లోకి పోతుంది. రదనిక బయటకువస్తుంది. బలివెయ్యడానికివెళ్లే విదూ షకుని అనుసరిస్తుంది. రదనిక యింట్లోనుండి రావడంచూచిన విటుడు ఆమెను అన్యస్త్రీగా గ్రహించి శకారుని మోసంచేద్దామనుకొని ఆమెను బంధిస్తాడు. శకారుని మిత్రుడై వాణ్ణి వంచించడమేమిటి? అన్యస్త్రీయని తెలిసి బంధించడమేమి? ఇది వట్టి క్షుద్రపాత్రగా తేలిపోతున్నది. ఇంతేగాక తర్వాత విదూ షకుడువచ్చి రదనికను విడిపిస్తాడు. అప్పుడు విటుడు 'నేయమపి వసంతసేనా' పొరపాటయింది. మమ్మ మోసగించివచ్చిన స్త్రీ యనుకొని యిలా చేశాం. క్షమించు'అని విదూషకుని ప్రార్థిస్తాడు. ఇదెలా పొసగు తుంది? పూర్వాపరకథాసంధిలేదు. తర్వాత శకారుడు విటుడితో ఎందుకు చారుదత్తుడంటే భయపడతా వంటే—వాడు అతని సద్గుణములు మహత్తరము లంటాడు. ఇట్టివాడు గణిక చారుదత్తుని ప్రేమి స్తున్నదన్న సంగతి శకారుడు చెప్పగావినికూడ ఏమీ మాట్లాడలేదేమి? పైగా గణికను బంధించడానికే యత్నించాడుగదా! అంతా అతుకులబొంత. భాసరచన కాదని అర్థం.

విటుడు రదనికను పట్టుకొని 'కులపుత్రా వమానిని' బంధింపబడెనని ఒక శ్లోకం చదువు తాడు. ఈ శ్లోకం మృచ్ఛకటికలోనూవుంది. ఇందు శకా రుడే రదనికను పట్టుకొంటాడు. ఈ సంగతి వాడు విటునితో చెపుతాడు. అప్పుడు విటు డీ శ్లోకం చదువు తాడు. ఇందులో 'కులపుత్రానుసారిణి' అనివుంది. కులపుత్రావమానినికి—బదులుగా కులపుత్రానుసారిణి అంటే చారుదత్తుని వరించినదన్న అర్థంవచ్చి 'అయ్యో పాపం. ఆమె వీడికి చిక్కిందా'అన్న జాలిని ప్రక టిస్తుంది. చారుదత్తంలో అలాకాక విటుని కోపం ప్రక టిస్తున్నది. ఇలా ఒక శ్లోకం రెండు నాటకాల్లో భిన్నార్థాల్లో సంఘటితమై పాత్రను పోషించుట (మృచ్ఛ.లో) భంగించుట (చారు.లో) చేస్తున్నది;

తర్వాత యింట్లోకి ప్రవేశించిన గణికను— రదనిక అనుకొని చారుదత్తుడు—'చల్లగాలి వీస్తున్నది. ఇదుగో ఉత్తరీయం. లోపలకు తీసుకు పొమ్మని' ఆమె మీదకు గిరవాటేస్తాడు. ఏమిటీమాట? అర్థరహితంగా వుంది. ఇదిమృచ్ఛకటికలోవేరేప్రయోజనంకోసం- అంటే తన పుత్రుడైన రోహసేనునికి కప్పమనివేస్తాడు. (దీని సంగతి తర్వాత వస్తుంది). ఇది జరిగినపిదప

రదనికా విదూషకులు ప్రవేశిస్తారు. విదూషకుడు చారుదత్తునితో 'నీ వుత్తరీయమిచ్చిన స్త్రీ నిన్ను ప్రేమించిన వసంతసేన. ఆమె రదనిక కాదని'చెప్పి తర్వాత శకారుని బెదిరింపుమాటలు చెపుతాడు. ఇది చారుదత్తంలో విపరీతమైనది. ముందు శకారుని బెదిరింపు. పిదప ఆమె వసంతసేనఅని చారుదత్తుడు గ్రహింపగా తర్వాత విదూషకుడు—'ఔను. ఈమెనే గదా నీవు కామదేవోత్సవంనుండి ప్రేమిస్తున్న'దంటాడు. చారుదత్తునికి తెలిసినతరువాత విదూషకుడు చెప్పడంలో అర్థమేముంది?

శకారుని బెదిరింపుమాటలలో న్యాయస్థానంలో నీ సంగతి చెబుతావన్నమాట మృచ్ఛకటికలో వుండగా చారుదత్తంలో లేదు. ఇది చారుదత్త కర్తయొక్క కుదింపుపద్ధతిని సూచిస్తున్నది.(దీని సంగతి తర్వాత). మృచ్ఛకటికలో వసంతసేన నింటికి పంపించినది చారుదత్తుడు. చారుదత్తలో విదూషకుడు. ఒకవేళ భాసుడే కర్తయేని యిలా వ్రాస్తాడా? చారుదత్తుడు పంపడంలో వున్న శృంగారరససౌందర్యం విదూషకుడు పంపడంలో వున్నదా? ఈ విషయం రసదృష్టితో ముఖ్యమైనది గదా!

> ఉదయతి హి శశాంకః కామినీగండపాండుః
> గ్రహగణపరివారో రాజమార్గప్రదీపః
> తిమిర నికర మధ్యే రశ్మయో యస్య గౌరాః
> స్రుతజల ఇవ పంకే క్షీరధారా పతంతి

(కామిని చెక్కిలిలాగా పాండుడైన చంద్రుడుదయిస్తున్నాడు. బురదలో పాలధాళ్లులాగా అతని కిరణాలు పడుతున్నవి.)

ఇంత అందమైన శ్లోకం వసంతసేనతోకలసి బయలుదేరబోతూ చారుదత్తుడనడంలోవున్న అందం మైత్రేయుని పంపుతూ (చారుదత్తలో) నాయకుడు అనడంలో వున్నదా! దూరాన చంద్రుడు దిక్చక్రంమీద ఉదయిస్తున్నాడు. ఏటవాలుగా కన్పిస్తున్నాడు. ప్రక్కనే ప్రియురాలి చెక్కిలి. దీనిమీదుగా దాన్ని (చంద్రోదయాన్ని) చూస్తూ నాయకు డంటున్నాడు. శృంగారరసాంగనాకళాస్థానం స్పృశించినట్లున్న దా వర్ణన. అంటే రసం చక్కిలిగింత పెట్టబడగా తట్టుకోలేక గిలగిలలాడి—కిలకిలా బుగ్గలు సొట్టపడేటట్లు నవ్విందన్నమాట. ఇంత అందాన్ని భాసుడైతే—అసందర్భంగా వ్రాసివుండడు.

విదూషకునిద్వారా రత్నహార మంపగా చారుదత్తుడు, దాన్ని తీసుకొని అతడు వసంతసేనదగ్గరకు వెళ్ళి 'నా మిత్రుడు జూదంలో నీ నగ లోడిపోయినాడు అని చెప్పగా అది సర్వాబద్ధమని ఆమెకు తెలుసు కాబట్టి తనలో అనుకొంటుంది. 'దొంగ లెత్తుకుపోయిన దానిని జూదంలో పోగొట్టుకున్నా నంటున్నాడు. అందుకే ప్రేమింపబడు తున్నా'వని. ఈమాట ఎంత అందంగా వుంది: దీన్నే—'తత ఏవకామ్యతే' చాలాచోట్ల వాడతాడు శూద్రకుడు. ఇదొక మాధుర్య హేతువు.

ద్వితీయాంకంలో గణిక చారుదత్తుని ప్రేమిస్తున్నదని తెలిసి చేటిక 'పూలు డుల్లిన మామిడిని మధుకరాలు ఆశ్రయించునా' అనగా 'గణిక 'ఔను ఆశ్రయించును, అందుకే అవి మధుకరులు అనబడ్తున్నవి' అంటుంది. మధువు నర్థించేవి పూలులేని చెట్టునెలా ఆశ్రయించడం? తెలియదు. మృచ్ఛకటికలో చాలా సొగసుగా వుంది. వసంతసేన చేటి పైమాటకు సమాధానంగా చెప్పినమాట 'అందుకే వాటిని మధుకరు లంటారు'. ఇంతే. పూలులేనంత మాత్రాన పరిత్యజించేగుణం మంచిదికాదని, అందుకే అవి వట్టి పురుగులని కేవల ఉదరంభరిత్వం జంతులక్షణమన్న అర్థంవచ్చి తా నలాంటిదాన్ని కాదన్న అర్థంవస్తుంది. ఇది వసంతసేనలోని మహాగుణం. దీన్ని చాలాచోట్ల శూద్రమహాకవి స్ఫురింప జేస్తాడు. ఈ పాత్ర మాధుర్యం చారుదత్తంలో కన్పించదు. దీనికింకొక ఉదాహరణ. చారుదత్తుడు విదూషకునిద్వారా పోయిన నగలకు బదులు రత్నహారాన్ని పంపుతాడు. ఆ సంగతి

వివరించి విదూషకుడు హారాన్ని గ్రహించమంటాడు. అప్పుడు గణిక చారుదత్తుడు తన నవసూనిస్తున్నాడని తనలో అనుకొని పైకి ఏమీ కన్పించకుండా— గ్రహిస్తుంది. ఇక్కడ గణికలో గర్వం తొంగిచూచింది. ఇది వసంతసేనాపాత్రమాధుర్యానికి తీవ్రాఘాతం. పైన వ్రాసిన 'అతఏవ కామ్యతే'కి శత్రువు.

చతుర్థాంకంలో శర్విలకుడు ప్రవేశించి గణికతో మాట్లాడుతున్న మదనికను పిలుస్తాడు. సైగ వేయుటమైనా లేకుండా. వసంతసేనకు విన్పించునేమోనన్న జంకులేకుండా ఎలా పిలుస్తాడు శర్విలకుడు. విన్న మదనిక 'ఆర్యురా లన్యకార్యంలో నివుగ్నయ్యే వుంది. కావున వెళ్తా'నని వెళ్ళుతుంది. ఆమె అలా అనుకోవడానికి ఏమర్థముంది. గణిక ఏ అన్య కార్యమున మునిగివుందో తెలియదు. ఒకవేళ చిత్రరచనమా? అంటే బొమ్మగీయడంలో ఆమె మునిగివున్న దన్న సూచనవుండాలి. లేదు. మృచ్ఛకటికలో శర్విలకుడు పిలవడు. వసంతసేన పూర్తిచేసిన చిత్రాన్ని తనగదిలో పెట్టిరమ్మని మదనిక కిస్తుంది. ఆమె అది తీసికొని బయటకు వస్తుంది. సమయంచూచి శర్విలకుడు ఆమెను పిలుస్తాడు. ఈ సందర్భోచితకల్పనలు చారుదత్తంలో ఎక్కడాలేవు. చాలా అసందర్భరచన. పూర్వాపరకథాసమావేశస్నిగ్ధతలేదు. ప్రథమాంకంలో విదూషకుడు ప్రవేశిస్తూ పూలు—కండువా తెస్తాడు. ఈ కండువా పూలవాసన కలదన్న సూచనైనా చేయలేదు. కాని తదంకం చివరలో గణికమీదకు విసరుతాడుగదా చారుదత్తుడు.అప్పుడామె ఆ కండువా వాసనగల దంటుంది. ఇది విదూషకుడిచ్చినదేనా? అని మరొక ప్రశ్న.

ఒథెల్లో — నాటకంలో చేతిరుమాల కెంత ప్రాధాన్యమున్నదో, ఈ జాజీపరిమళధూపితమైన ఉత్తరీయానికి అంతవుంది మృచ్ఛకటికంలో. చూర్ణగోష్ఠనివేత యివ్వబడ్డ అది ప్రథమాంకంలో వస్తుంది. అది వాసనచూచిన వసంతసేన 'రతి' భావం వికసిస్తుంది. తర్వాత కర్ణపూరకుని ద్వారా మళ్ళా అదే వుత్తరీయం వసంతసేన దగ్గరకు వస్తుంది. మరలా వసంతసేన ప్రణయభావం విజృంభిస్తుంది. ఆమెలోని 'రతి' భావాని కది ఉద్దీపనంగా మహాకవి సంతరించాడు. దీన్ని స్పృశించాడేగాని చారుదత్త కర్త పోషించలేదు.

శర్విలకుడు సువర్ణభాండాన్ని హరించినతర్వాత చారుదత్తుడు తన భార్య ధూతాదేవి యిచ్చిన రత్నహారాన్ని పోయిన నగలక బదులుగా వసంతసేనకు పంపిస్తాడు విదూషకునిద్వారా. విదూషకుడు వెళ్ళి 'నా నేస్తం జూదంలో ఓడిపోయాడు నీ నగల్ని. కాబట్టి దానికి బదులు దీన్ని గ్రహించ' మంటాడు. ఈ మాట 3—అంకం చివరలో చారుదత్తుడు అన్నట్లు లేదు.

కొన్నిశ్లోకాలు మృచ్ఛకటికలోవే గ్రహించినా (44 గ్రహించాడు) ఎక్కువ — అందులో లేనివి (కొత్తవి రాసాడు) కొన్నిమాటలుమార్చి అందాన్ని చెరిచాడు.

'విషాదస్రస్త సర్వాంగీ—'
మయిద్రవ్య క్షయక్షీణే—'

వంటివి వుదాహరణలు.

అసోహి దత్వా (3—3—చారు.

సంగీతం వినివస్తూ దారిలో చారుదత్తుడన్న మాట ఈ శ్లోకం. విదూషకుడు 'వయస్యా! చూడు! చూడు!! అంధకారానికి అవకాశమిస్తూ చంద్రుడు అంతరిక్షప్రాసాదంనుండి దిగుతున్నాడు.' అనగా చారుదత్తుడు పై శ్లోకం చదువుతాడు.

అసౌహి దత్వా తిమిరావకాశ
మస్తంవ్రజత్యున్నతకోటిరిందుః
జలావగాఢస్య వనద్విపస్య
తీక్ష్ణం విషాణాగ్రమివావశిష్టం (3. 6. మృచ్ఛ)

చారుదత్తకారుడు

గతోహ్యష్టమ పక్షచంద్రః—
తోయావగాఢస్య వనద్విపస్య
విషాణకోటీవ నిమజ్జమానా—(3—3)

అనిమార్చాడు.తాత్పర్యతః రెండూ భేదిస్తున్నవి చంద్రుడస్తమిస్తున్నాడు. పైన రెండు కొమ్ములుమాత్రమే

కన్పిస్తున్నవి. అదెలావుంది—నీటిలో ఏన్గు మునిగింది. దంతాలు నీటిపై కన్పిస్తున్నవి. అలావుంది చంద్ర రేఖ. (ఒక సుకుమారానుభూతి నంతవిచిత్రంగా—యధాతథంగా, సరిగ్గా—శబ్దంలో పొదగడం శూద్ర కుడే నేర్చిన మహావిద్య). ఇక చారుదత్త శ్లోకం. అష్టమి చంద్రుడు అస్తంగతుడవుతున్నాడు. ఎలాగ? నీటిలో మునిగే ఏన్గు దంతాల్లాగ. పోలిక దేనికి? ఉపమానం హస్తిదంతం. ఉపమేయం అస్తమించే అష్టమి చంద్రుడు. అదెలా కుదురుతుంది? మనం మృచ్ఛకటిక దృష్టితో చూస్తాంగాబట్టి అర్థం పొసగుతున్నదే గాని మరొక రీతిగా వీల్లేదు. ఈతని రచన మంతా మృచ్ఛకటిక ముందుబెట్టుకొని చూస్తేతప్ప సరిగా అవగాహనకాదు. ఉన్నతకోటి రిందుః—మార్చటంవల్ల వచ్చిన నష్టమిది. అంటే ఇతనిదృష్టి మృచ్ఛకటికను సంగ్రహించటమనే తేలుతున్నది.

కొన్ని శ్లోకాలను స్థలవిషయకంగా తారు మారు చేసాడు. మృచ్ఛకటికలో ధూతాదేవి రత్నహారం యిచ్చినపుడు చారుదత్తుడు సంతోషిస్తూ కలిమి లేములు సమానంగా పంచుకొనేభార్య, స్నేహితుడు తనకు దొరకటం అదృష్టమన్న వాక్యార్థం గల శ్లోకం చదువుతాడు. చారుదత్తంలో ఇదే శ్లోకం ప్రథ మాంకంలోనే అంటాడు—విదూషకునితో నాయకుడు. మృచ్ఛకటిక సందర్భం ఆ శ్లోకానికి తగినంతగా చారు దత్తం సందర్భం తగదు. ఇలా చాలా మార్పులు.

చారుదత్తంలో చంద్రుడు దిగుతున్నా డనకుండా చీకటి దిగుతున్నదని మార్పుని చేసాడు. చంద్రుడు దిగుతుంటే చీకట్లెక్కుతున్నవన్న మృచ్ఛకటిక అర్థం సరిపోతున్నది. చారుదత్తకర్త కుదింపులో ఒక పద్ధతి స్పష్టంగా కొట్టవచ్చినట్లు కన్పించేది మృచ్ఛకటికలోని రాజకీయ వాతావరణరూపమైన ఆర్యకవృత్తాంతం తీసివేయటం. ఇది అందులో పతాకావృత్తాంతం వంటిది. దానితోనే శూద్రకమహాకవి లోకవృత్తాంతం లోని వైచిత్ర్యాన్ని సుస్నిగ్ధంగా బంధించాడు. దీన్ని ఎత్తివేయ దలచుకోవడం చారుదత్తకర్త సంక ల్పించాడు.

ప్రావారక వృత్తాంతం అతకబోయినాడు కాని అది బొంతగా తయారయిందని తేలింది. మృచ్ఛకటికలో భూషణవిషయానికి ప్రాధాన్యముంది. అదే చారుదత్తుని శిక్షకు కారణం. ఇందులో అదిలేని కారణంగా భూషణన్యాసం చారుదత్తుని దగ్గరదాచటం—కథాగతికి పోషకం కాలేకపోయింది. ప్రథమాంకంలో నాయకుడు గణికమీదకు వుత్తరీయం విసరడం దేనికన్నప్రశ్న ప్రశ్నగానే మిగిలింది. మృచ్ఛకటికలో రోహసేన వృత్తాంతం వచ్చింది. ఈ రోహసేనుని మూలకంగానే నాటకానికి మృచ్ఛకటి అన్నపేరు వచ్చింది. అంటే కవిదృష్టిలో చాలా ప్రాధాన్యంవున్న పాత్ర రోహసేనుడు. (చిన్నపాత్రలను కూడా కవి ప్రధానేతివృత్తంతో ముడిపెట్టటం చాలా అద్భుతంగా చేసాడు శూద్రకశిల్పి. చూర్ణఘోషుడు, రేఖలుడు — అనలీ పాత్రలు రంగప్రవేశం చేయనివే. స్థాపనలో నటికి అభిరూపపతి—అన్న వ్రతాన్నిగూర్చి చెప్పిన దీ చూర్ణగోష్ఠుడు. ఇతడే విదూషకునకు జాజీ పరిమళ పరిమిళిత ప్రావారక మిచ్చినదిన్నీ. రేఖలుడు సంగీత విద్వాంసుడు. ఇతని యింట్లోనే శర్విలకుడు తన భార్య మదనికనుంచి మిత్రుడైన ఆర్యకుని బంధనాగారంనుండి విడిపించడానికై వెళ్లిపోతాడు. ఇలా చూస్తే శ్రవణమాత్రములైన ఆ పాత్రలకూ—కథాగతికి సంబంధం కల్పిస్తాడు. ఎంత శిల్పి !!)

చారుదత్తకర్త చారుదత్తుని కుటుంబాన్ని త్యజించ యత్నించటంలో భాగం రోహసేనుని వదలటం. కాని ధూతాదేవి అవసరం కాబట్టి అతికాడు. ఆమె యిచ్చింది మరి రత్నహారంగదా! ఎలా వదలటం. శకారుని బెదిరింపుల్లో అధికరణవృత్తాంతం త్యజించాడు. కాని సంవాహక వృత్తాంతం వదల్లేదు. వాడెందు కుపయోగపడ్డట్టు ఇందులో. మృచ్ఛకటికలో మరణించబోతున్న వసంతసేనను బ్రతికించి చారుదత్త శిక్ష తప్పించి సర్వప్రయోగఫలాన్ని కూర్చిపెట్టినవాడు సంవాహకుడు. ఆ వృత్తాంతాన్నంతా వదలుకొన్న చారుదత్తకర్త కెందుకీ పాత్ర. ఐతే ఒకటనవచ్చు. చారుదత్తుని గుణగణప్రశంసకిది అవసరమై గణికా ప్రణయానికి మెరుగుపెడుతుందికదా! అని. కావచ్చు. కాని ఎన్నిమెరుగులు ధ్వంసంచేసాడు కాదాయన. ఏమైనా తర్వాత ప్రధానకథకు దీనికున్న ముడి త్రెంచరానిదైనా త్రెంచాడు.

శకారుని బండివాడు జేటు డొక చక్కని పాత్ర. తర్వాతి కథకు సంబంధించినవాడు. వీని పాత్ర మృచ్ఛకటిక ప్రథమాంకంలోనే వచ్చింది. వసంతసేన వెంటపడిన శకారాదుల్లో వున్నాడు. చారుదత్త కర్త ఈ పాత్రను వదిలిపెట్టాడు.

ఇలాగ ఆర్యక వృత్తాంతంతో ముడిపడ్డ పాత్రలను వదలటంలో కొంతనైపుణ్యం ప్రదర్శించాడనక తీరదు, కాని చూర్ణగోష్ఠ, రేఖలుల ప్రసక్తి కథతో అతకలేదు. రేఖలుని విషయం పతాకాసంబంధం కాబట్టి వదలవచ్చు. చూర్ణగోష్ఠునిగూడ వదలటం దేనికి? విదూషకుని మాటల్లో వ్రాయవచ్చుగదా ప్రథమాంకంలో.

ఇలాగ సంభాషణలు — సంఘటనలు — పాత్రనిర్వహణాదుల్లో ఈ గ్రంథం చారుతరంకాని కారణంగా భాసరచనకాదు. కాబట్టి ఎవడో మృచ్ఛకటిక ప్రశస్తినిబట్టి దాన్ని సంగ్రహంగావ్రాసి ప్రహసనప్రాయంగాచేసి రంగప్రయోజనార్థం చేసివుండవచ్చునన్నవాదమే సమంజసంగా కన్పిస్తుంది.

చారు.ద.లో కొన్ని సుగుణాలున్నవి.

నాటకం షష్ఠితో ప్రారంభమై — నవమితో ముగుస్తున్నది. ప్రథమాంకం షష్ఠి. విదూషకుని మాటల్లో ప్రథమంలోనేవుంది. ద్వితీయాంకం సప్తమి కథ. 3 అష్టమికథ. మర్నాటికథ చతుర్థాంకం. తిథి ప్రసక్తి మాటిమాటికి వస్తుంది ప్రత్యంకంలో. ఉన్నత కోటిరిందుః — బదులు అష్టమిపక్షచంద్రః — అనటంవల్ల సంగ్రహకర్త కీ కాలసూచన ప్రధానంగా చూపించాలన్న పట్టుదల కానవస్తుంది. ధూతాదేవి 'షష్ఠి ఉపవాసమున్నాను. రత్నహారం దానం చేస్తున్నాను. పుచ్చుకొమ్మ'నగా విదూషకుడు నేడు అష్టమిగదా అంటాడు. ఆమె మరిచిపోయాను నిన్ననే ఇవ్వాలిసింది—అంటుంది. తిథి ప్రసక్తి ఇంత దేనికి? నాటక కథ నాలుగు రోజుల్లో గడిచిందనటానికి కావచ్చు.

శూద్రకుడు దీన్ని అనుసరించి వ్రాస్తే ఈ ప్రసక్తి గూడా చేసివుండేవాడే. పదాలకు పదాలే ఎత్తివ్రాసిన వాడెలా వదులుతాడు దీన్ని.

వెంటబడే శకారుడు గణికతో నన్ను ప్రేమింపు మనగా ఆమె 'శాంతోసి' అన్నది వీడు శ్రాంతోసి'గా గ్రహించాడు. ఆమె చచ్చావన్నది. ఈ మాట స్త్రీజనో చితం. శూద్రకుడు శాంతం శాంతం' అవు, ఆలాపన అన్న అర్థంగల మాటలే వ్రాసాడు. ఇది తర్వాతి రచనైతే ఈ చిన్న అంశాన్ని ఉపేక్షించి వుంటాడా? చతుర్థాంకంలో మదనిక సజ్జలకునితో మాట్లాడి 'నీవు వసంతసేన దగ్గరకు రమ్మ'నిచెప్పి ఆమె అభ్యనుజ్ఞకై వెళుతుంది. సహజంగా ప్రేక్షకదృష్టి ఎలా వుంటుంది? తర్వాతి రంగంలో సజ్జలకుడే వస్తా డని ఎదురుచూడటం సహజంగదా! కాని విదూషకుడు రత్నహారంతో ప్రవేశిస్తాడు. ఇదొక చిత్రాను భూతిని కల్గిస్తున్న ఘట్టం. శూద్రకుడు తరువాత వచ్చినవాడైతే ఈ వైచిత్రి నుపేక్షించడు.

ఆలాగే చారుదత్త స్థాపనాంతంలో భోజన వర్ణనాత్మకమైన శ్లోకంవుంది. (ఇది మృచ్ఛకటికలో లేదు). ఇక్కడ మృష్టాన్నమంటే రూపకమని అర్థం. ఆస్వాదించి మెచ్చుకొనేవారికోసం సూత్రి అన్వేషణ పద్యం. ఎలా చెప్పటం?

మృచ్ఛకటికప్రస్తావనలో 4, 5 సార్లుసంవిధానక శబ్దాన్ని వాడాడు కవి. దాన్ని వివరిస్తూ శ్రీ కాలే మహాశయులు * తన నాటకంలోని నూత్నత్వాన్ని తెలియచేయటమే కవి దృష్టి అని నిరూపించారు. ఉదా:—సూత్రి ఇంటికివస్తూ తన గృహం పంచ వర్ణాలుగల సుఘాలతో అలంకరించబడి వుందేమిటి ' అని ప్రశ్నించుకుంటాడు. వ్యాఖ్యానంలో కాలే పండితులు 5 రంగులంటే కథలోవున్న 5 సంఘటనలని వివరించారు.

1. చారుదత్తుని పాత్ర ఉదాత్తంగా అంతం కావటం 2. శకారుని క్షమించటం 3. ఆర్యకుడు రాజు కావటం 4. నాయికానాయక సమావేశం 5. శర్విలకునితో నాయకునకు స్నేహం లభించటం

ఇలాగా పై పద్యమున్నూ.

చారుదత్తంచూచి మృచ్ఛకటిక వ్రాసినా డన టానికి హేతువేమి! ఇందలి నాల్గంకాలకథే చారుదత్త నాల్గంకాల కథ. ఇంతే ఐతే పర్వాలేదు. అవే పదాలు, శ్లోకాలు, భావాలు.ఏంకర్మ కాలింది శూద్రకమహాకవికి' ప్రతిభాదరిద్రుడా? పంచమాంకంవ్రాసిన మహాకవి, విచిత్రసంవిధానకమయమైనదశమాంకాన్ని సృష్టించిన మహారూపకనిర్మాత — శృంగారరసమాధుర్యాన్నంతగా సృష్టించినవాడు ఇంత చౌర్యం చేయగల డనుకో వటం పండిత దృష్టికాదు.

కుందమాలను భవభూతి నిస్సందేహంగా చూచాడు. అనుసరించాడు. అనుకరించలేదు. అదేకథ. అందులోవున్న భావాలు తీసుకొన్నాడు. కాని అదే నకలు దించలేదు.

'ఆపాత మాత్రేణ కయాపి యుక్త్యా
సంబంధినః సంనమయంతి చేతః
విమృశ్య కిం దోషగుణానభిజ్ఞా
శ్చంద్రోదయే శ్చ్యోతతి చంద్ర కాంతః'

(కుం. 5—10)

(సంబంధుల సందర్శనంచేత హృదయం పొంగులు వారుతుంది. చంద్రోదయంలో పాలరాయి ద్రవిస్తుంది. ఇది తెలిసిచేసే పనికాదే? కారణమేమేమో).

ఈ శ్లోకమే భవభూతిచేత జగత్ప్రసిద్ధమైన

వ్యతిషజతి పదార్థానాంతరః కోపిహేతుః

(ఉ. రా. 6 5)

ఈ శ్లోకాన్ని వ్రాయించింది. సందర్భమూ ఒకటే. అన్నది రెంటిలోనూ రాముడే. కుందమాల షష్ఠాంకమే భవభూతి మహాద్భుతమైన సప్తమాంక సృష్టికి మాతృక. విశ్వంభరాసాక్షాత్కృతి ఘట్టం

* Here by repeating the word 'సంవిధానక' for the third time in prologue the poet no doubt refers to the novel plot of his own play—

లోని శ్లోకాలభావాలే భవభూతి అంతర్నాటక వృత్తాంతంలో శ్లోకాలకు మాతృకలు.

ఇలాచేయుటం దర్జాపని. చారుదత్తంలో నాల్గం కాలు యథాతథంగా పోల్కతో నకలు దించుకోవటం ఎవడోచేతగానివాడు చేసేపని. (శకారాదులు వెంటబడ్డప్పుడు గణిక తన చెలికత్తెలను పిలుస్తుంది. ఆ పేర్ను కూడా మార్చడా శూద్రకుడు. అవే పేర్లిందులోనూ. ఒక్క మధుకరికకు బదులు మాధవికానామం మృచ్ఛకటికలో వేర్పబడింది.)

ఇందుచే చారుదత్తం సంగ్రహ ప్రహసనంగా చేసాడెవడో. ఈ సంగ్రహ పద్ధతుల్లో కొన్ని—

1. మృచ్ఛకటికలో కాలసూచన వ్యంగ్య భూతంగావుంది. దీన్నే వాచ్యంగా చేసాడు చారుదత్త కర్త.

2. శర్విలకుడు మదనికతో మాట్లాడే సందర్భంలో మృచ్ఛకటికలో వేశ్యాస్వభావం నిందా రూపంలో 9, 10 శ్లోకాలుంటే ఒకే ఒక శ్లోకం చారుదత్తంలో వుంది.

అలాగే అదే ఘట్టం తర్వాత విదూషకుడు వసంతసేనాసౌధవర్ణనం సుదీర్ఘంగా చేసిన ఘట్టం ఇందులో నాల్గు పంక్తులంటే నాల్గే పంక్తుల్లో క్లుప్తీకృతమైంది.

3. గణికను వెన్నాడుతున్న శకారుని మాటలు—

దుశ్శాసనుడు సీతను హరించినట్లు తానామెను చేస్తాడట. ఇది మృచ్ఛకటికలో 'దుశ్శాసనస్యానుకృతిం కరోమి! అని ఉండగా సీతావిషయం ప్రవేశపెట్టాడు. శకారుని మాట్లాడే పద్ధతిని సంగ్రహించడాని కిది సూచన. ఈ ఘట్టంలో 9, 10 దాకా శకారుని శ్లోకాలు మృచ్ఛకటికలో. దీనిలో 4, 5 మాత్రమే. శకారుని పౌరాణిక కథానభిజ్ఞతను సూచించే మాటలు మృచ్ఛకటికలో చాలా వుండగా ఇందులో సూచన మాత్రంగా వున్నవి.

4. ప్రథమాంకంలో విటుడు వసంతసేనతో అన్న

తరుణ జన సహాయ శ్చింత్యతాం వేశవాసో—

అన్నశ్లోకం రెంటా సమానమే. కాని మృచ్ఛకటికలో అధికంగా

వాప్యాం స్నాతి విచక్షణో ద్విజవరో మూర్ఖోసి వర్ణాధమః—అన్న శ్లోకం వుంది. ఈ సామాన్య న్యాయంతో పై శ్లోకంలోని విశేషన్యాయం సమర్థింప బడుతున్నది. ఈ సామాన్య న్యాయం లేకపోయినా అర్థభంగం జరుగలేదు. కాబట్టి అందులో లుప్తమైంది. ఇది కుదింపు లక్షణమే. విస్తరణ లక్షణ మేల కారాదు? అంటే పై అంశాలన్నీ బాధకాలు కాబట్టి.

ఆలంకారికులైన దండి వామన—గుప్తపాద—హేమచంద్ర—గుణచంద్రాదు లుదాహరించిన కొన్ని శ్లోకాలు మృచ్ఛకటికలోను, చారుదత్తలోనూ వున్నవి. వానినిబట్టి చారుదత్తలోనుండే వా ళ్లుదాహరించారని కొందరన్నారు. కాని కాదని పండిత నిరూపణం జరిగింది.

కాగా మృచ్ఛకటిక సంగ్రహరూపం చారుదత్తం. భాస రచనకాదు.



# జాషువా కవిత్వ తత్త్వ విచారణ: గబ్బిలము - మనుజత్వము

శ్రీ ఎల్. మాలకొండయ్య

**జా**షువాకవి విరచిత 'గబ్బిలము' నవ్యాంధ్ర వాఙ్మయంలో అగ్రశ్రేణికి చెందిన కావ్యఖండం. కథ 'గబ్బిలము' విజ్ఞప్తిలోనే 'కాళిదాసుని మేఘ సందేశమును మనస్సులోనుంచుకొని నేనీ కావ్యమును రచించితిని. గ్రంథనామము గబ్బిలము. శ్రోతల కిది కటువుగా 'తోపవచ్చు' అని అన్నారు. కాని కావ్యాన్ని ఆమూలాగ్రంగా చదివి, అవగాహన చేసుకొన్నవారికి అర్థమవుతుం దీ నామకరణ మెంత సమంజసమో. ఈ కావ్యంలోని నాయకుడొక అరుంధతీసుతుడు. మేఘసందేశంలోని కథానాయకుడు ప్రణయసందేశం పంపుతాడు. ఇందులోని కథానాయకుడు పంపేది తుకతుక ఉడికే అశ్రుసందేశం. అతని కడగండ్లు ఒక్క ఏడాది మాత్రమే. ఇతని ఆవేదన ఆజన్మాంతం. అతడు మన్మథాగ్ని తప్తుడు. ఇతడు క్షుధాగ్ని పీడితుడు. ఇరువురిలో ఇతడు నిజమైన దయనీయుడు. అందుచేతనే —

> 'నాదు కన్నీటికథ సమన్వయము సేయ
> ఆర్ద్ర హృదయంబుగూడ కొంతవసరంబు'

అని ఇతడు వాపోతాడు.

ఇందులోని కథానాయకుడు అంటరానితనం గురించే గాక, మనదేశంలో అలముకునివున్న అనేక సాంఘిక ఈతిబాధలను గురించి ప్రశంసనీయమైన పద్య కవితలో గబ్బిలమును కైలాసమేగి పరమేశునితో విన్నవించమని ప్రాధేయపడతాడు.

కవి అనుమానించినట్లు చదువరులు ఏ చిలుకనో, రాజహంసనోగాక సందేశానికి కవి గబ్బిలాన్ని ఎన్నుకోవడం సమంజసంగా లేదని అనుకోవచ్చు. అంతులేని పేదరికమనే కనుచీకటిలో చిక్కుకుని, సమాజంలో అంటరాని చండాలునిగా పరిగణించబడుతూన్న అరుంధతీతనయునకు తనజీర్ణకుటీరంలో నిరంతరం దర్శనమిచ్చే గబ్బిలాన్నిచూపి తన కన్నీటి కథను పరమేశ్వరునితో చెప్పుమని ప్రార్థించడం సమంజసమే.

అంతేగాక గబ్బిలాన్ని ఎన్నుకొనుటకుగల కారణాలను వివరిస్తూ, పేదవాని బాధలు చెప్పుకొనడానికి—ఈ

> 'మదోన్మత్త ప్రపంచంబులో
> బులుగుం బుల్గులుగాక బేదలకు నాప్తుల్
> జాట్టపక్కంబులున్ కలరే!'

అంటూ సమర్థించాడు కవి.

> 'అలయంబున నీవు వ్రేలాడు వేళ
> శివుని చెవి నీకు గొంత చేరువుగ నుండు'

కనుక గబ్బిలం ఒక్కటే తన సందేశానికి సమర్థురాలు.

> 'నరుని కష్టపెట్టి నారాయణుని గొల్చు
> ధర్మశీలురున్న ధరణిమీద
> కాలు మోపలేక గబ్బిల మొక్కటే
> చరణయుగళి దివికి సాచి నడుచు'

అంటూ తన దూతికలోని విశిష్టతను కీర్తించాడు.

నేడు సంఘంలో తనజాతి పడుతున్న దురవస్థలను పరమేశ్వరునికి జాగ్రత్తగా తెలియజేయడానికి

> '...పూజారిలేనివేళ

విన్నవింపుము నాదు జీవిత చరిత్ర' అంటూ
'ఆ పూజారులు విన్న నీకమ ప్రాయశ్చితమ'ని
గబ్బిలాన్ని హెచ్చరించాడు.

నిమ్నజాతీయుల జీవితం గబ్బిలం జీవితం కంటె నికృష్టమైనదని హృదయవిదారకంగా 'నీవు నా వలె బుట్టుబానిసవు కావు' అని, ఆకాశంలోకి వెళ్లేటవుడు సుడిగాలులు చెలరేగితే గబ్బిలం ధర్మసత్రాలలో తలదాచుకోవచ్చుననీ, తనజాతివారికి మాత్రం అట్టి యోగ్యతలేదనీ చెపుతూ,—

'పిడుగుల్ వడ్డ ప్రవేశయోగ్యతలు పాపి న్నాకు
లేవచ్చటన్' అని విలపిస్తాడు.

మాదిగను తనతప్పు లేకుండానే మనసంఘం వెలివేసింది. అతడు చెమటోడ్చి శ్రమించి, సంఘానికి సేవచేస్తూన్న కష్టజీవి. బూడిద పూసుకొని మాయ వేషం వేసుకొన్న కపటి సన్యాసికాదు. జాషువాకవి ఇతనికి జరిగే అన్యాయాన్ని, ఆతని దైన్యస్థితిని ఎంత సమరసంగా వర్ణించాడు ఈ క్రింది వాక్యాలల్లో:

'ముప్పు ఘటించి వీని కులమున్
గలిమిన్ గబళించి దేహమున్
బిప్పి యొనర్చు నీ భరత వీరుని
పాదము కందకుండగా
జెప్పులుగుట్టి జీవనము
సేయునుగాని నిరాకరింప లే
దెప్పుడు నప్పువడ్డది సుమీ
భరతావని వీని సేవకున్'

.........................

'వాడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు
భోజనము బెట్టు వానికి భుక్తిలేదు'

పైగా ఆ కులాన్ని నీచంగా చూడడానికి గల కారణం అగమ్య మవడాన్నిగూర్చి—

'వాడు జేసికొన్న పాపకారణ మేమొ
యింతవరకు వాని కెరుక లేదు.'
అని వితర్కిస్తాడు.

మన సమాజంలోని నాలుగు వర్ణాలూ అతనిని యేవగించుకొనడాన్ని గురించి—

'గసరి బుసకొట్టు నాతని గాలిసోక
నాల్గు పడగల హైందవ నాగరాజు'
అని వాపోయాడు.

గబ్బిలం తన గుడిసెలో తిరుగుతున్నప్పుడు దాని నుద్దేశించి 'నాది అంటరానివాని గుడిసె — 'నీవు సమస్తదేవతల సన్నిధిని ప్రసాదముల నారగించెడి నంతటి పుణ్యురాలవైయ్యు అన్నములేని నాబోటి పేదవాని గృహమును చొచ్చితివేల ?' అని తన పేదరికాన్ని దైన్యావస్థను వ్యక్తపరస్తూ ప్రశ్నిస్తాడు.

ఈ లోకం హృదయం లేనిదని 'ప్రతిమలకు బెండ్లిజేయుటకు వందలు; వేలు వ్యయము జేయుదురుగాని, దుఃఖపీడితులైన పేదలకు కనీసము యెంగిలి మెతుకైనా విదల్చని భారతదేశమ'ని గబ్బిలంతో మొరపెట్టుకుంటాడు.

లోభస్వాంతులై, నిత్యమూ పరమార్థమును బోధించెదరనీ, యుక్తులున్ని కైవల్యమునకు దారులు చూపే ఈ మోసపు గురువులే తనను మహాపరాధిగా నిందించెదరనీ, తన నూరడించుటకు గిరుల గుండెలైనా కరిగి నదులవలె ఉప్పొంగుచున్నవిగాని తన దైన్యస్థితికి సోదరప్రజల కండ్లనుండి ఒక్క కన్నీటి చుక్కకూడ కారుటలేదనీ విచారిస్తాడు. కర్మసిద్ధాంతం పేరుతో పేదలనోరు కట్టివేసి, వారి భుక్తిని అనుభవిస్తున్న స్వార్థలోలురగూర్చి పరమేశునికి విన్నవించవలసినదిగా గబ్బిలాన్ని కోరుతాడు.

పరమేశ్వరునివద్ద తన గోడును పిరికితనం లేకుండా నిర్భయంగా విన్నవించ వలసిందిగా ధైర్యం చెబుతాడు—

'ధర్మమునకు బిరికితన మెన్నడును లేదు
సత్య వాక్యమునకు జావులేదు
వెరవనేల నీకు విశ్వనాథుని ముందు
సృష్టికర్త తాను సృష్టివీవు' అని.

గొప్పవారి సాన్నిధ్యంలో పేదలకు ఆసన్నంకాగల ప్రమాదాలను గురించి వివరిస్తూ కరిగిన మంచుశిఖరాలు పట్టు దప్పి పర్వతాలనుండి దిగజారి లోయలలో దిరిగెడి జీవరాసులకు ఎనలేని హాని కలుగజేసినట్లు.

'... పేదవారికిన్
జెరుపెకదా బలాధికుల
నేయము సంయమి పక్షిభామినీ'

అంటూ కొంచెం హెచ్చరిక చెపుతాడు.

గబ్బిలం పరమేశ్వరునికి ఏమనిచెప్పెనో తెలుసుకొనుటకు కథానాయకుడు కండ్లలో వత్తులు పెట్టుకొని వేచివున్నాడు. ఈ లోగా స్వాతంత్ర్య సంపాదన కృషి ఫలోన్ముఖమయింది. మహాత్మాగాంధి కృషివల్ల తిరువాన్కూరు మొదలైన దేవాలయాల తలుపులు నిమ్నజాతులకు తెరువబడ్డాయి. జాత్యభిమానమూ, హరిజనులయందు గౌరవమూ పెంపొందింది. ఆ విషయాన్ని జాషువాకవి—

'నగరి వెలుపలి మాలమాదిగలకూడ
నరులు సుమ్మని దేశంబు గురుతుబట్టె'

నని చక్కగా వర్ణించాడు.

కవి కాళిదాసుని 'మేఘ సందేశము'లోని మేఘం తెచ్చుకున్న గౌరవం తన గబ్బిలంతెచ్చుకొన్నదాయని ప్రశ్నించుకొని 'బానిసకట్టి గౌరవం రాదని' నిస్పృహతో సమాధానమిచ్చుకున్నాడు. నిమ్నజాతికవులు వ్రాసిన కావ్యాలు ప్రసిద్ధికి రావడం లేదని సంఘాన్ని దూషించలేదు కాని, మిక్కిలిగా చింతించాడు.

నేటి సంఘంలోని అర్థంలేని అంటరాని తనమనే ఘోర దురాచారాన్ని శివునికి విన్నవించావా అని అడుగుతూ –

'నరులన్ ముట్టక నందులం గొలిచి
పుణ్యం బెల్ల సాధించు న
వ్వరమంబైన రహస్యమున్
శివునితో ప్రస్తావముంజేసితే'

అని మనలోనున్న అమానుషత్వాన్ని వేలెత్తి చూపాడు.

మనదేశంలో వలె కైలాసంలోకూడా వ్యత్యాసాలున్నవాయని ప్రశ్నిస్తూ, అక్కడకూడా ఎవరికివారే బ్రతుకుతూ నవీన ధర్మాలను పిచ్చినమ్మకాలతో సవరించి ప్రజల తలలో ప్రవేశమొనరించే స్వార్థపరులు కలరా అని పరామర్శించారు.

ఆంధ్రులు, తమ కవులను వారి జీవితకాలంలో లెక్కచేయక, చనిపోయినతరువాత పూజలు చేస్తారనే వాదుకు నిదర్శనంగా—

'పిడికెండన్నము బెట్టలే దెవుడు
మావేమన్న జీవించినప్పుడు......
నేడు గోరీపయిన్
నడచుం బూజలు పుణ్యకార్యములు,
వింతల్ మా దయాధర్మముల్'

'బ్రతికియున్నపాయబా బెన్నడునుగాడు
చావకున్న వట్టి పాయబయ్యె
తిరుమలేశుడైన తెలియడీ యర్థంబు
చావుబ్రతుకులోని సార మిదియ'

అంటూ ఎంతో చక్కగా అగమ్యగోచరమగు వికృత మానవనైజాన్ని వర్ణించాడు.

మహాకవి వేమనను వీరేశలింగము 'తన ఆంధ్ర కవుల చరిత్ర'లో చేర్చకపోవుటగురించి ప్రస్తావిస్తూ

'మరణము వార్ధకంబను
ప్రమాద మెరుంగనికైతలల్లు
నబ్బురపు గవీంద్రుడు............
వేమన చాకచక్యమున్
మరచి, పురాణకావ్యరసమత్తుడు
వీరుడు సంఘసంస్కృతీ
స్థిరుడు రచించె నాంధ్ర కవి
జీవితముల్ బొరపాటు చేయుచున్'

అని వేలెత్తి చూపుతూ, వేమన మహాకవి గంపలకెత్తిన 'గ్రామీణ బాషాబ్ధిలో జవులూరించు తెలుగు పల్కుల' మధురత్వాన్ని అభినందించలేనట్టి శాస్త్ర

జ్ఞానమాత్రపురాకవితోన్మత్తులను మెత్తగా విమర్శించాడు.

ముస్లిములలోని ఐక్యత, ఘూర్కాసిఫాయీల శౌర్యము, ద్రావిడుల కార్యదీక్ష, ధనార్జన పిపాస, హిందీభాష రాష్ట్రాంతరవ్యాప్తి వంటివి ఎన్నోఉరకలు వేస్తూ ముందుకుపోతూవుంటే—తెలుగువారి పురోభివృద్ధికి ఎట్టి సంచలనమూ లేకపోవుటగురించి విచారించాడు.

ఏనాడు మనకవులు విశ్వసత్యాన్ని ఆలపించగలరో, ఏనాడు మన జాతి సంకుచితదృష్టిని విడనాడి చుట్టుప్రక్కల తేరిచూడగలదో, ఏనాడు మన ఆలోచనలు తలాతోకాలేని కట్టుకథలనుంచి బైటపడగలవో, ఏనాడు ఈ మఠాలలోని సన్యాసులు బిచ్చమెత్తుకొనుట మానుదురో—

'ఏనాడు మా బుద్ధి లీ జాట్లు లేనట్టి
పుక్కిటి కథలలో జిక్కువడవొ
ఏనాడు మా విద్య లినుపసంఘమునందు
చిలుముపట్టక ప్రకాశింపగలవొ'

..............................

..............................

'అట్టి శుభవేళకై కొంగుబట్టి నిలిచి
నలిగి వాపోవుచున్నది నా మనస్సు'

అంటూ తన ఆరాటాన్ని వ్యక్తంచేసాడు జాషువా.

కవితయొక్క మానవతాలక్ష్యాన్ని వివరిస్తూ, స్వార్థపరులైన కవులు తమ కవిత్వకళాశక్తిని, 'ప్రభువుల పెళ్లిపేరంటాలను వర్ణించుటలోనూ, రాణివాసములోని విరహవేదనలను రచ్చకీడ్చుటలోనూ, ప్రతిఅంగమును దాని వ్యసనాన్ని రెట్టింపుగా వర్ణించి యువకుల జీవితాలకు ఉచ్చులొడ్డుటలోను, వ్రాసిన కథలనే తిరిగితిరిగి వ్రాయుటలోను వృథాపరుస్తున్నారనీ—ఆర్తలోకమును ఆదరించడంలోగాని, ప్రపంచ హితవును బోధించడానికిగాని వినియోగించడంలేదనీ మిక్కిలి వ్యాకులత చెందాడు.

దేశంలో సన్యాసివేషాలలో దేశాభివృద్ధి కెట్టి ఉపయోగములేకుండ సోమరిపోతులవలె తిరిగేవారిని గురించి అభివర్ణిస్తూ—

'శూలంబుల్ సొరకాయ బుర్రలు
జటాజూటంబులుం దాల్చి
యామూలాగ్రంబుగ భ్రష్టులై తిరుగు...'

'గంజాయిభాయీలను చూశావా' అని హేళనగా గబ్బిలాన్ని ప్రశ్నిస్తాడు. అట్టి వంచకశ్రేణి బ్రతుకుతెరువును ఎంతో చక్కగా కండ్లకు గట్టినట్లు వర్ణించాడు.

'పాలుంబండులు, కందమూలములు
మా భక్ష్యాన్నముల్, గోర మే
కాలం బన్యపవార్థముల్,
రజతమో బంగారమో కొద్దిగా
జాలున్ మాకని సేకరించెదరు
గోసాయీ లుపాయాలు మో
సా లెన్నేని నిరంతరాయముగ
రాజ్యంబేలు నేడెల్లడన్'

'వృత్తుల్ సర్వము త్రుప్పువట్టి చనగా
బిక్షాటనంబుల్ జగా
వృత్తుల్గా పలుజాతులై నిలువ...'

దేశములో దుర్భిక్షం రాకుండునాయని తన దుఃఖాన్ని ఆపుకోలేక నొక్కివాపోయాడు.

పదవులలోచేరి, పేదవారు చెమటోడ్చి సంపాదించిన ధనాన్ని లంచంగా గ్రహించేవారు, విచిత్ర భక్తవేషధారులైన పరోపజీవు లెదురైతే—అట్టి వారిని యాచించవద్దని గబ్బిలానికి సలహా ఇచ్చాడు.

రాజకీయాలలోవున్న కుళ్లును బయటపెడుతూ 'కలరే మోసపు దేశభక్తిపరుల క్కాలానదేశంబునన్' అని గబ్బిలాన్ని వ్యంగ్యంగా ప్రశ్నించాడు.

భారతదేశంలో అనేకతరగతులమధ్య కులభేదాలు అలా వుండగా అంటరానితెగకుచెందిన మాల, మాదిగలకు తమలో తమకున్న విభేదాలను మాన్పి, వారిని కలుపుటకు ఎందరో కృష్ణులు, క్రీస్తులు

పుట్టినప్పటికీ 'కలపన్నేరరు రెండు జాతులను వక్కాణింప సిగ్గయ్యెడిన్'అని తన నిస్పృహను వెలిబుచ్చాడు.

దేశంలోని అనేకమతాలు, వారివారి మధ్యగల భేదభావాలతో మన జాతిలో ప్రబలుతున్న అనైక్యత మొదలైన అనర్థాలను, కడగండ్లను గూర్చి—

'పెక్కుమతము లిట్లు పేచీలు సాగింప
మార్గమేది యైకమత్యమునకు'

అని కడుపులో రగులుకుంటున్న ఆవేదనను వెలిబుచ్చాడు.

సంఘంలోని మొక్కుబడుల పేర్లతోను, సతీ సహగమనం మొదలుగాగల దురాచారములవల్లను జరుగుతున్న అన్యాయాలనుగురించీ అట్టివాటిని చదువుకున్నవారే పాటించడం గురించీ విమర్శిస్తూ :

'మోసపు వ్రాత కోతలకు
రక్షాబంధమా యెందుకీ
మనుజత్వంబు నొసంగ
లేని చదువుల్...'

'చదువనేర్చిన వెర్రిని జంపగలరె ?
ఒక్కబుద్ధుడు! నొక్కక్రీస్తు! ఒక్కగాంధి!'

అని అంటూ ప్రజలకు నిరుపయోగమైన విద్య, జనులను పీల్చి పిప్పిజేసే దురాచారాలను ఆపలేని విద్య, మూఢత్వమనే పులి కిం పైన భోజన మగునే గాని మరే మగునని ప్రశ్నిస్తాడు.

ఊళ్ళలో నెత్తుటికూటితో కూడిన అమ్మవారి పూజలు 'ఆచారమని తప్పదని' ఇచ్చెడి గురుదక్షిణలు, మాంత్రికుల తంత్రములు మొదలుగాగల మూఢ నమ్మకములకగు ఖర్చుల నిరసిస్తూ—

'అనుగు తమ్ముల సిరు లోర్చుకొనగలేక
పిచ్చిపూజల మమతలు విడువలేక'

తమ జీవిత రథాలను నడుపలేక తత్కారణంగా దేశాభ్యుదయపు ఉట్టికికూడ ఎక్కలేక పోతున్నారని వాపోయాడు.

లెక్కలేనన్ని కులాలు, మతాలు గలిగి, పశువులనూ పాములనూ పూజించే జాతి మనదని, అందరి మధ్యా పొందులకు, పొత్తులకు సమ్మతించని మన సంఘం పనికిమాలినదని—

'పనికిమాలిన సంఘము
సమ్మతించునే
పొందులు పొత్తులు న్మనకు
ముప్పదిమూర్ల కులాల వారికిన్
నందుల నాగులం గొలిచి
నవ్వుల పాలగుచున్న జాతికిన్'

అని పెదవి విరిచాడు.

తక్కువకులానకు చెందిన కవియొక్క కవిత్వంలో కళంకం వెదకజాలక, కవికి జాతిలేదని నిందించేవారిని గూర్చి —

జీవకళల చెక్కు శిల్పిని నిరసించి
శిల్పమునకు పూజ సేయునట్టి
వక్రచరితులైన వ్యక్తులు గలచోట
కళల కకట! ప్రేత కళల గతులు'

అని మొత్తుకొన్నాడు.

పరభాషావ్యామోహంలో చిక్కుకొని స్వదేశీయ కవులను విస్మరించుటను గురించి

'—నాకైనారు స్వకీయులైన కవు లీ నా
డన్య భాషాకవుల్ నేకై రక్కట!...'

అని మన తెలివితక్కువకు తన ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసాడు.

ఆంధ్రుల ఆరంభ శూరత్వాన్ని—
'తెలుగుబిడ్డల యత్నా లనరాదుగాని
యవి సోడాబుడ్డి యుద్రేకముల్'
అని కళ్ళకు కట్టినట్టు వర్ణించాడు.

జాతీయోద్యమంలో నాల్గు జాతులతో కలసి పోరాడి నప్పటికీ, స్వాతంత్ర్య సౌఖ్యంలో నిమ్నజాతులకు తమభాగము నిచ్చెదరో లేక 'ఖాతాలేదని త్రోసిపుచ్చెదరో' నని పై కులాలవారి నిజాయితీని ఎంతో బాధతో కవి శంకించాడు.

కైలాసం వెళ్ళివచ్చిన గబ్బిలాన్ని అసూయమ పోగొట్టే శాస్త్రాలు, పర మత సహనం బోధించే వేదాంత పాఠశాలలూ, వర్ణభేధములేక శాంతిగా రాజ్యంసల్పే విధానాలు 'చూచావా'అనీ, తాను చిందులు త్రొక్కి, డప్పులుకొట్టి, శక్తిని కొలువగా, ఇతరులు ఫలితాన్నిపొందే నీచమైన భూమిని 'చూచావా' అనీ ప్రస్తుత సంఘం అనుసరించే మోసపు విధానాల్ని ఎత్తిపొడుస్తూ ప్రశ్నిస్తాడు.

నిమ్నజాతుల మేలుకై తలపెట్టిన అభివృద్ధి పథకాలనుగురించి శంకిస్తూ తన దేశీయులు 'క్రూరుల్ కుత్సితుల్'అనీ 'న న్నూరిం బైటకునెట్టినారిపుడు' అనీ, తన్నోదార్చుటకు హరిజనోద్ధరణపేరుతో ఎన్నో సంస్థలు లక్కయిండ్లలాగ వెలకొల్పినారనీ తన అసంతృప్తిని వెలిబుచ్చాడు.

హిందూసమాజంలో నిమ్నజాతుల హీనస్థితిని దేవుడుకూడా బాగుచేయలేడని నిస్పృహతో జాషువా కవి 'పేదవారి మొర కర్ణక్లేశ మెవ్వారికిన్' అన్నాడు.

దేవుడుకూడ ఈ అభాగ్యుల కేమీచేయలేక పోతున్నాడంటూ—

'ధర్మసంస్థాపనార్థంబు ధరణిమీద
నవతరించెదననె నబ్జభవుని తండ్రి
మునుపు జన్మించి నెత్తికెత్తినదిలేదు
నేడు జన్మింపకున్న మునిగ్గినదిలేదు'

అని తన తీరని ఆవేదనను వెలిబుచ్చాడు.

నిమ్నజాతులను నీచంగా జూచుటనుగురించి

'కనుపడలేదు వర్ణమునకన్న
పిశాచము భారతంబునన్
గనుపడలేదు పంచమునికన్నను
నీచపుజంతువేదియున్'

అని దుఃఖించాడు మహానుభావుడు.

అట్టి పంచముని ఉద్ధరించుటకుచేసే ప్రయత్నా లేవీకూడ ప్రయోజనకరమైనవీ, సత్ఫలితాల నిచ్చేవీ కావని అంటూ—

'వాని నుద్ధరించు భగవంతుడేలేడు
మనుజుడెట్లు వాని గనికరించు'

నని మనుజత్వాన్ని తన కవిత్వంలో కుమ్మరించాడు.

నవయుగకవి చక్రవర్తి జాషువా మహాకవి ఈ కావ్యములో అరుంధతీసుతుని సందేశాన్ని గబ్బిలంద్వారా పరమేశ్వరునకు పంపుతూ, సమకాలీన సంఘంలోని దురాచారాలన్నిటినీ కండ్లకు గట్టినట్లు వర్ణించాడు. కుల, మతాలపేరిట హైందవసమాజంలో మానవుని మానవుడు అణగద్రొక్కే నీచస్థితిని గర్హించాడు. మానవుల మనస్సు లట్లుంచి, కొండలు కరిగేటట్లు, మనుజత్వాన్ని తన కవితాతత్వంలో తాను విలపిస్తూ మనకు వినిపించాడు.

జాషువాగారి 'గబ్బిలము' మానవతా వాదానికి మచ్చుతునక. వెలలేని సాహిత్యరత్నమంజూష. సాటి లేని సమాజవికాస ప్రదర్శని.



గ్రంథవిమర్శలు :

# సాహిత్య వివేచన

[కర్త : డాక్టరు కోవెల సుప్రసన్నాచార్యులు; వెల : నాలుగు రూపాయలు. ప్రాప్తిస్థానము: సాహితీ బంధు బృందము, 5/714 అప్కర్‌బజారు. హనుమ కొండ. వరంగల్లు—1]

డాక్టరు కోవెల సుప్రసన్నాచార్యులు రచించిన యీ గ్రంథము ఎనిమిది వ్యాసముల కూర్పు. ఈ గ్రంథమునుగూర్చి రచయితయే 'ముందు మాట'గా నిట్లు చెప్పెను. 'ఈ వ్యాసాలు 1940 తరువాతి తెలుగుకవితాలోకంలోని పరిణామాలనూ, ఉద్యమాలను వివరించేవి. గ్రంథ పరిధికి లోబడి స్థూలమైన రేఖామాత్రవివరణ చేయడం జరిగింది. కాని దేన్నిగూర్చిన సమగ్రమైనవిచారణా ఇందులో చేయబడిందని చెప్పలేము. ఇవన్నీ 1958 నుంచి 1971 మాధ్యకాలందాకా రాయబడ్డ వ్యాసాలు. ఆయావేళల్లో ఆయావిషయాలనుగూర్చి వ్రాయడంవల్ల వీటిలో కొంత పునరుక్తి తప్పదు. ఏకసూత్రతకూడా కుదురక పోవచ్చును. ఈ గ్రంథానికి ఐక్యం కలిగించే విషయం ఒక్కటే — అది దీనిలోని వ్యాసాలు అన్నీ ఇటీవలి కవిత్వాన్నిగూర్చి వ్రాయబడ్డవి కావడం.'

'ప్రకాశకీయం'లో సాహితీబంధుబృందము సుప్రసన్నాచార్యులనుగూర్చి యిట్లు వ్రాసెను. 'రచయిత డాక్టర్ కోవెల సుప్రసన్నాచార్యులు ఆధునిక తెలుగు సాహిత్యరంగంలో లబ్ధ ప్రతిష్ఠులు. అటు సంప్రదాయమార్గంలోనూ, ఇటు నవ్యకవితా పథంలోనూ, కవిత్వంచెప్పి మెప్పించగలిగిన ప్రతిభావంతులు. అంతేకాదు. అటు ప్రాచీన కావ్యకళా రహస్యాల్ని ఆవిష్కరించటంలోనూ, ఇటు ఆధునిక కవిత్వ తత్త్వాన్ని వ్యాఖ్యానించడంలోనూ సమ్యగ్దృష్టి గల విమర్శకులు. ఇట్లా ఈ అన్నిగుణాలు ఒకచోట కలియటం చాలా అరుదు.'

దీనిలో నెనిమిది వ్యాసము లున్నవని పేర్కొంటిని. మొదటి వ్యాసము 'వచనపద్యము : రూపము-పరిణామము.' వచనపద్యము ప్రయోజనలోపముల వివరణతో మొదలయిన యీ వ్యాసములో ఆచార్యులు గారు భావము, అభివ్యక్తి రెండును కవిత్వమగు ననియు, వానిలో నేయొక్కటియు కవితాపదవాచ్యము గాదనియు వక్కాణించిరి. కవితావిర్భావమునందలి స్థితి త్రయమును వివరించిరి. వచనకవితాప్రపంచములో జరిగిన యన్వేషణములనుగూర్చి వ్రాసిరి. వచన పద్యము శుద్ధవచనముగా, అబుద్ధచ్ఛందముగా, ఛందో బంధముగా, అనియతచ్ఛందముగా, మాత్రాపూర్ణముగా, విమిశ్రమాత్రాకముగా తాల్చిన యవతారములను జూపిరి. వచనపద్యము భవిష్యద్దశను నిర్ణయించుటకుఁ బ్రయత్నించిరి.

'స్వాతంత్ర్యంతరువాత ప్రగతికవిత' రెండవ వ్యాసము. అభ్యుదయకవిత్వ మెన్నిదశలలో నెట్లు వచ్చినదో వివరించున దీ వ్యాసము. ఇది దాని మూల తత్త్వమును తడవినది. అభ్యుదయకవుల కావ్యముల స్థూలపరామర్శ యిందు కలదు.

మూడవ వ్యాసము 'పొరపాటే తిరుగుబాటు.' అబ్బూరు రామకృష్ణారావుగారు రచించిన 'అనామిక' యను కవితాఖండమునందలి విశేషములు దీనిలో వివరింపఁబడినవి. నాలుగు ముక్కలుగా వింగడింపఁబడిన 'అనామిక'లో అబ్బూరు వారేవిధముగా కవితాచారిత్రక పరిణామమును సూచించుచు, ప్రగతివాద కవితా మార్గమునుండి నూతనపరిణామము నాహ్వానించిరో, పరిమితజాతీయవాదమునుండి సంపూర్ణమానవతా వాదమును ప్రపంచించిరో, ఏరీతిగా కవితలో మానవునకు మహోన్నతస్థానమును గట్టఁబెట్టిరో, ఎట్లు

మానవజీవన విమర్శ చేసిరో ఆచార్యులుగారు లెస్సగాఁ జెప్పిరి. ఆ కవితాఖండములో 'కవితారంగంలో తాత్త్వికమయిన విభేదాలకన్న మిన్నగా, కాలానికి అతీతంగా, మానవుని చైతన్యాన్ని హ్లాదైకమయంగా ఆరాధించే తత్త్వం ప్రతిపాదించడం జరిగింది' అని వారితీర్పు.

'నవకవిత — తత్త్వదర్శనము'లో దాశరథి, నారాయణరెడ్డి, ఆరుద్ర, కుందుర్తి, బాలగంగాధర తిలక్, సోమసుందర్ అనువారి కవితాతత్త్వమును ఆచార్యులుగారు ఆవిష్కరించిరి. వారు నవకవితా తత్త్వమునేకాక కవితాభివ్యక్తీకరణలో నవీనకవులేయే విధములుగా నూతన ప్రయోగములు చేసిరో చేయుచున్నారో 'నేటికవిత అభివ్యక్తి' యను వ్యాసములో వెల్లడించిరి. కుందుర్తి ఆంజనేయులుగారు రచించిన 'నగరంలో వాన' అను కావ్యము సమీక్ష యాఁతవ్యానము. కుందుర్తి కావ్యములో గోచరించు శిల్పసౌష్ఠవము, ఉక్తివైచిత్రి, ఆత్మవిచారము, పరమేశ్వరతత్త్వనిరూపణము మున్నగువానిని గూర్చి ఆచార్యులుగారు కూలంకషముగాఁ జర్చచేసిరి.

విమర్శ వ్యాఖ్యాతృమేధాశక్తిని బట్టియే యుండునను సిద్ధాంతమునకుఁ బ్రథమోదాహరణముగాఁ బేర్కొనఁ దగినది 'ఆధునికకవిత—అంతర్ముఖీనత' యను నేడవవ్యాసము. '... వర్తమాన మానవ జీవనకల్లోలంనుండి విముక్తివైపుగా ప్రయాణంచేసే స్వతంత్ర విచారశీలాన్ని అంతర్గర్భితంగా పొదుపుకున్న కవిత' నవీనకవిత్వ మనియు, 'సాంద్రములైన అనుభూతులను త్రవ్వుకుంటూ లోలోతులలోకి గవేషించుతూపోయే కవి అంతర్ముఖీను డవుతున్నాడు; అంతర్ముఖీనతవల్ల తన అనుభూతిని యథాతథంగా చెప్ప ప్రయత్నించటం, దానికోసం విశిష్టమైన కావ్య సామగ్రిని రూపొందించుకోవడం కారణంగా ఈ కవిత మేధాసంబంధిగా మారిపోవడం జరుగుతున్నది' అనియు 'విజ్ఞానంతోడి ఈ అవగాహన సర్వసాధారణం కాకపోవడంవల్ల పాఠకుడికీ, కవికీ నడుమ దురవగాహన అనే తెర ఇంకాఇంకా దట్టమైపోతూవున్నది' అనియు సుప్రసన్నాచార్యులు చెప్పిరి. మాదిరాజు రంగారావు, వేగుంట మోహనప్రసాదు, దుర్గానంద్, అరిపిరాల విశ్వము, పరిగి రాధాకృష్ణ అనువారి కవిత్వములో అంతర్ముఖీనత యేయేరూపములలో సాక్షాత్కరించుచున్నదో వారు క్షోదక్షమముగా వివరించిరి. కాదు వ్యాఖ్యానించిరి.

'ఎవడు సహృదయుడు?' అనునది చరమ వ్యాసము. 'భావుకుడు అన్నమాట కవినీ, పాఠకుణ్ణీ, ఉద్దేశించిందేకాగా సహృదయుడన్నది కేవలం పాఠకుడిని ఉద్దేశించిన శబ్దము'అనిచెప్పిన యీ గ్రంథకర్త 'కవికి లాగనే సహృదయుడైన పాఠకుడికీ మూడు లక్షణాలు ముఖ్యం. భావుకత, నిరంతరకావ్యానుశీలనం—ఆస్వాదోన్ముఖత ఈ మూడూ ప్రతిభాదులవంటివి' అని చాటిరి. ప్రాచీన భారతీయుల సాహిత్యసూత్రము లను నవయుగపరిభాషలో వ్యాఖ్యానముచేసిన వ్యాసమిది.

ఇది యీ గ్రంథము స్థూలస్వరూపము. ఈ గ్రంథమును జదివినతరువాత, సుప్రసన్నాచార్యులుగారే, చరమవ్యాసములో తాము రూపొందించిన సహృదయునకు తార్కాణముగా పాఠకులకు గోచరింతురు. ఆచార్యులుగారిది వస్తునిష్ఠమయిన విమర్శ. సమకాలిక సాహిత్యమును సమీక్షించుట కత్తిమీదిసాము. అందును సాహిత్యతత్త్వనిరూపణముగాక లౌకిక లాభము, కీర్తికాంక్ష, మధురవచస్సు మున్నగునవి విమర్శకు మూలద్రవ్యములయిన తెలుఁగునాఁట దోషదూషితముగాని విమర్శకున్న విలువ హుళక్కి. అట్టిచో ఆచార్యులుగారు సమకాలికసాహిత్యవివేచనకుఁ జిత్తశుద్ధితోఁ బ్రయత్నించి చాలవరకుఁ గృతకృత్యులయిరి. వారి వివేచనలో గుణదోష పరామర్శ కలదు. దానిని నిష్పక్షపాతముగా రూపొందించుటకు యత్నించిరి. నవీన వచన కవితా మూలతత్త్వము, తదభివ్యక్తీకరణ వైవిధ్యము, భాషాచ్ఛందఃప్రయోగ స్వరూపము, ఆధునిక కావ్య వ్యాఖ్యానము — అను నీ నాలుగు విషయములు 'సాహిత్య వివేచన'లో విపులముగా వెల్లడింపఁబడినవి. వచనకవితా బహిరంత స్స్వరూప వివేచనము మొత్తముమీఁద దీనిలో నెక్కువ. చెప్పఁదలచిన వానినిగూర్చి సూటిగా సోదా

హరణముగాఁ జెప్పఁగలవారు సుప్రసన్నాచార్యులుగారు. ఎక్కడను పులుముడులేదు.

సామాన్యముగా నవీన విమర్శలో రెండుభాగము లుండును. ఒకటి సాంఘిక రాజకీయ ప్రచలితము లయిన సాహిత్యోద్యమముల చరిత్ర. ఇది సాహితీగతి బహిస్స్వరూపమును నిరూపించుట. రెండవది సాహిత్యోద్యమ ఫలములుగాఁ బుట్టిన కావ్యముల తత్త్వమును గనుఁగొని కవిత పరిణామమును వివరించుట. ఇది సాహిత్యాంతస్స్వరూపమును దర్శించుట. పోలిక చెప్పవలెనన్న మొదటిది ప్రాచీనకవుల చరిత్ర వంటిది. రెండవది ప్రాచీనకవితా తత్త్వ పరిణామ నిరూపణము వంటిది. ప్రాధాన్యమునుబట్టి విమర్శయందీ రెండిటిలోఁ బ్రథమము ద్వితీయముగా నుండవలయును. ద్వితీయము ప్రథమముఁగా నుండవలయును. ఇట్లు యీనాఁడు విమర్శ యెట్టి సమ్యక్స్వరూపమును ధరించునో సుప్రసన్నాచార్యులుగారు రుజువుచేసిరి. కావుననే వారు ప్రగతివాదకవిత్వము లోగుట్టును గడ్డకెక్కించిరి. వచన కవితామార్గానుయాయులు చేయుచున్న అవిచారిత రమణీయ సిద్ధాంతములను ద్రోసిపుచ్చిరి. కడచిన ముప్పదియేండ్లలో వెలువడిన కవిత్వమునందలి దోషములను వెల్లడించిరి. ఇట్లు చేసియు మఱియొకవైపు వచన కవితా సౌందర్యమును బట్టబయలు చేయఁగల్గిరి. పద్య గేయ కవితా తత్త్వమును విప్పిచెప్పిరి. 'నామటుకు నాకు పద్యం గేయం ఎలాంటివో వచనపద్యము అలానే ఒక కవితా రూపం. అంతేకాని అంతకన్నా ఎక్కువకాదు'అని వారు చెప్పిరి. సమచిత్తముగల యుత్తమ సాహితీ విమర్శకుని లక్షణమిది.

ఇంతమాత్రమున 'సాహిత్యవివేచన'లో సుప్రసన్నాచార్యులుగారు చెప్పినమాటలన్నియు సమంజసము లని యెవ్వరు భావింపనక్కరలేదు. కొన్ని యుదాహరణములు చూడుఁడు. ఆచార్యులుగారు వచనకవితోద్యమమునకు తాత్త్వికస్థాయి కలదని నిరూపించుటకు తొమ్మిది పది పదునొకండు పుటలలో నొక కొన్నివిషయములు ముచ్చటించిరి. ఆవేశమునకు, ఆలోచనమునకు నడుమఁగల స్పర్థయే సనాతనకవిత్వ చరిత్ర. కవితలో నొక్కొక్క శతాబ్దమున ఆ రెండింటిలో నొక్కొక్కదానికిఁ బ్రాధాన్యముండును. ఆవేశము కవిత్వమును పాలించిననాడు సంగీతము దరువు లెక్కువయై పాటలు పుట్టినవి. ఆలోచనము కవిత్వము నేలిననాఁడు సంగీత ప్రాధాన్యమును దగ్గించు ఛందోబంధబద్ధ కవిత యవతరించినది. 'తరువాత చంపూకావ్య సంప్రదాయం వచ్చింది. గేయమయిన ఛందస్సులో వచనత్వం ఆవరించినట్లే స్పష్టమైన వచనంలో గేయత్వం వచ్చింది. వృత్తగంధులు పుట్టినవి. మార్పు వచ్చింది.'

ఆచార్యులుగారు ఈ సిద్ధాంతములను తెలుఁగు కవితకు సమన్వయించిరి. నన్నయ చంపూకావ్య మార్గము 'సంగీత ప్రాధాన్యంగానీ, వచనత్వప్రాధాన్యం గానీ కాకుండా రెంటినీ సమంగా ఆదరిస్తుంది. 'ఆవేశం ప్రధానంగా కవిత్వోద్యమం సాగించిన పాల్కురికి సోమన......పాడుకునేందుకు వీలైన ద్విపదను కావ్యరూపంగా స్వీకరించాడు. 'మరొకవైపు కవితా శిల్పవేత్త తిక్కన పద్యంలోవున్న సంగీతాన్నికూడా అంగీకరింపలేదు. ఆయన పద్యాలలోకి వ్యావహారిక భాషా సౌందర్యాన్నీ, కాకువునూ ప్రవేశపెట్టినాడు.' ఈ రెండు మార్గాల సంఘర్షణలో ఏ ఒక్కమార్గమూ జయించలేదు. ప్రధానంగా సాగింది రెంటికీ మధ్య స్థానమయిన నన్నయగారి కవితామార్గమే. కాని ఆ మార్గంలోనే వైయక్తికంగా కవి అభిరుచులనుబట్టి సంగీతం పాలు పెరుగుతూ వచ్చింది.' తరువాత సంగీత ప్రధానమైన యక్షగానములు వచ్చినవి. ఆధునిక యుగమునందు సైతము ఈ మార్పును జాడ వచ్చును. భావకవిత సంగీత సన్నిహిత మయినది. 'ఈ నాటి వచనకవిత్వోద్యమంకూడా ఈ సంగీతం పైన తిరుగుబాటు.'

వచన కవిత్వమునకుఁ జారిత్రకప్రాధాన్యము నంటఁగట్ట నిశ్చయించి, తదనుగుణముగ వ్యాఖ్యానము సేయు ఆచార్యులుగా రీ విధముగా వ్రాయుటలో వింత లేదు. ఆవేశము, ఆలోచన—వీని స్పర్థ సనాతన కవితా

చరిత్రలో సాక్షాత్కరించుననఁగా నర్థమేమి? ఆలోచన యనఁగానేమి? ఇది పాశ్చాత్యులుచెప్పిన 'Intellect' కుఁ గాని, 'Tranquility' అనుదానికిఁ గాని పర్యాయ పదమా? లేక అభిదార్థమాత్రప్రధానమయిన పదమా? మఱి కవితలో 'Imagination' 'Form' అనువానికున్న విలువ యెంత? వీని నన్నిటిని 'ఆలోచన' లోని అంగములగా ఆచార్యులుగారు సంభావించుచున్నారా? 'ఆవేశము' 'ఆలోచన' అనువానిని ముందు నిర్వచించి పిదప ప్రాచీన నవీన కవితా పరిణామమును వారు సమీక్షించిన లెస్సగా నుండెడిది.

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము కావ్యహేతువు లని ఆలంకారికులు చెప్పిరి. పాశ్చాత్యులు చెప్పిన కావ్య కారణములు సైతము పై వానితో సంవదించును. భావయిత్రి శక్తి, సమాధి, కారయిత్రి శక్తి—ఈ మూఁడును కవితావతారమందలి త్రివిధ దశలు. మాటలు వేరయినప్పటికి తొమ్మిదవపుటలో ఆచార్యులుగారు చెప్పిన మూఁడుదశలు ఆ త్రివిధ దశలకంటె భిన్నమయినవి గావు. శాస్త్ర పరిభాషను వీడి చెప్పవలెనన్న ఆవేశము, ఆలోచన రెండును లేని నాఁడు ఉత్తమ కవిత్వము పుట్టదు. సాహిత్యములో ఆవేశము ప్రధానమయినచో సంగీతమధికముగానుండు ననియు, ఆలోచన ప్రధాన మ యినచో వచనత్వము, లేక దానివంటిదేదో మఱియొక గుణము అధికముగా నుండుననియు నికరముగాఁ జెప్పలేము. 'సాహిత్యోద్యమములు' అను చూపుతోఁ జూచినచో ఇట్టి వ్రాఁతలు వెలువడును.

కావ్యహేతువులు, రీతి (శైలి) అభిన్నములని యెంచుచు ఆచార్యులుగారు ఆంధ్రకవితా సంగ్రహ సమీక్ష చేసిరి. ఒక్కొక్క కవిది యొక్కొక్క రీతి. అది కవియొక్క అభివ్యక్తీకరణ విధానమునకుఁ జెందినట్టిది. నన్నయ కవితామార్గములో ఆంధ్రకవిత సాగినది యని నొక్కిచెప్పుట సాహసము. నన్నయది ఆలంకారికరీతి. కథాకథనము ఆ కవితామార్గమునకుఁ బ్రధాన లక్షణము. అది ప్రధాన లక్షణమయిననాఁడు కావ్యములో అనువదమున కవి కనబడును. కావుననే కవితలో నాదసౌందర్యము, దరువులు, మ్రోఁతలు నెక్కువగా నుండును. 'రసాభ్యుచితబంధ'ముండదు.

మఱి తిక్కన కవితకు రూపకబంధము ప్రధాన లక్షణము. శ్రవ్యకావ్యమును దృశ్యకావ్యముగాఁ జేయ నెంచి చరితార్థుఁడయినవాఁడు తిక్కన. నాట్యము లోకవృత్తానుకరణము. ఆ యనుకరణమున్న కవితా రీతిలో వస్తునాయకరసవైవిధ్యమునుబట్టి అనంత ముఖశిల్ప ముండును. మఱియుఁ దెనుఁగుఁదనము పుట్టుకతో అబ్బిన. కవి వ్రాఁతలో నెంత వైవిధ్య ముండునో చెప్పలేము. తిక్కన తానై వ్రాసిన పట్టులలో నాదసౌందర్యము లేకపోలేదు. ఇన్నికారణములచే తిక్కన కవిత్వము తెలుఁగువారి చేతికందినవిధముగా సిద్ధమయినది ఆచార్యులుగారే తిక్కన కవితాశిల్పవేత్త యని యనుచున్నారుగదా! కావున '...తిక్కన పద్యంలో వున్న సంగీతాన్నికూడా అంగీకరించలేదు.' అనివ్రాయుటలో అర్థము లేదు. తిక్కన పద్యములో సంగీతము నంగీకరింపక యట్లు వ్రాసెనా? కవితా శిల్పమును బట్టి యట్లు వ్రాసెనా? కవితాశిల్పవేత్త కావుననే యట్లు వ్రాసెను.

'ఈ రెండు మార్గాల సంఘర్షణలో ఏ ఒక్క మార్గమూ జయించలేదు. ప్రధానంగా సాగింది— రెంటికీ మధ్యస్థానమైన నన్నయగారి కవితా మార్గమే' అని ఆచార్యులుగారు ప్రవచించిరి. ఇవి సమచిత్తముతో వ్రాసిన మాటలు గావు. ప్రాచీనాంధ్ర కావ్యములలో ఆఖ్యానములందుఁగాని, ఉపాఖ్యానములందు గాని యెక్కడెక్కడ రూపకపద్ధతి యున్నదో, సాత్త్వికాంగికాభినయవర్ణనమున్నదో, అనుభావ వ్యభిచారి భావవర్ణనమున్నదో అక్కడ తిక్కన సాక్షాత్కరించుననియే యర్థము.

శ్రీనాథ పోతనలు రీతివాదులు. వక్రోక్తివాదులు. ప్రబంధ కవితా పద్ధతిని నన్నయ కవితా మార్గముతో మేళవింపఁ బ్రయత్నించినవాఁడు పెద్దన. ప్రబంధ కవితా పద్ధతిని తిక్కన కవితా మార్గముతో జోడించినవాఁడు పింగళి సూరన. కావున 'ఆవేశము—

ఆలోచన' అను ప్రమాణములను చేపట్టి ఆచార్యులు గారు వ్రాసిన వ్రాఁతలు సమంజసములుగావు. ఆ రెండును లేనిది కవిత్వము లేదు గావున అవి కవుల కెల్లనుండు సమాన ధర్మములే.

'ప్రాచీన కావ్యాలలో మానవుని వైయక్తిక జీవనం ఇతివృత్తంకాగా, ఆధునిక కావ్యం సమాజ చైతన్యం సామూహిక అభివ్యక్తిగా రూపొందుతుందని ఊహించే వీలున్నది' (19 వ పుట) అని యీ రచయిత యభిప్రాయము. ఊహించుటకు వీలులేదని సమీక్షకుని అభిప్రాయము. ప్రాచీనకావ్యములయందును సమాజస్థితిగతులు ప్రతిఫలింపకపోలేదు. ఎట్లు? వ్యంగ్యముగా మాత్రమే. తన కాలమునాటి సమాజమును కూలంకషముగా సమీక్షించి దాని ప్రధానలక్షణములను రసధ్వని ప్రధానమయిన కవితలో వెల్లడించుచు ఆయాసాహితీప్రక్రియలను రచించినవారు ప్రాచీనకవులు. అరవిందుఁడు వాల్మీకి వ్యాస కాళిదాసులనుగూర్చి వ్రాసిన వ్రాఁతలను జదివినచో మన కీ యంశము తెలియును. తెలుఁగు కవులును నాఁటికి నేఁటికి ఆ పోకడలు పోయినవారే. పోవుచున్నవారే. ఒక్క భావకవిత్వమును వదలినచో మిగిలిన తెలుఁగుకైతలో సమాజము కొంచెముగనో గొప్పగనో కనఁబడుచున్నది. ఆచార్యులుగారివలె విమర్శకులును ఈ విషయమును గుర్తించిరి. 'కవిత్వానికి అంతరమయిన వైయక్తికప్రేరణ, బాహిరమైన సామాజికప్రేరణ ఈ రెండూ' ఏనాటి కవితలోనైన యుండును. ఆవిష్కారముమాత్రము భిన్నము. 'ప్రాచీన కావ్యాలలో మానవుని వైయక్తికజీవనం ఇతివృత్తం కాగా' అనునది వ్యాఖ్యానము నపేక్షించుచున్నది.

'భారతీయ సాహిత్యాకాశాన శ్రీ అరవిందుల సావిత్రి అవతరణం ఎలాంటి మహత్తర సన్నివేశమో విశ్వనాథ రామాయణావతరణంకూడా అంతటి మహత్తరమయినదే.........దివ్యచైతన్యం భౌతిక జగత్తులో ఆవిష్కారం పొందటమే ఈ రెండింటిలోనూ నిరూపితమైన తత్త్వం. రెండూ సాహిత్య తేజశ్శిఖరాలు' (పుట. 57) అని యాచార్యులుగారు గడగట్టి గంటవాయించిరి. ఇవి చాలపెద్దమాటలు. వారికి విశ్వనాథవట్లనున్న భక్తిని రక్తిని వెల్లడించుచున్నవి. దివ్యచైతన్యమును, భౌతికచైతన్యమును అరవిందుఁడు గుర్తించి, రెండింటి సమ్యక్సమ్మేళనమువలన అధిమానవు డవతరించునని వక్కాణించెను. మొదటిది అధోముఖముగా అవరోహించును. రెండవది ఊర్ధ్వముఖముగా ఆరోహించును. విశ్వనాథవారు భౌతికలోక చైతన్యము గిట్టనివారు. వారికి నొక రకమయిన యాధ్యాత్మిక దృష్టియున్నది. అది జడము. మృతసంస్కృతికి చిహ్నము. వర్గదృష్టి జనితములయిన రాగద్వేషములతో పంచారించినట్టిది. ఆచార్యులుగారు స్వాతంత్ర్యము తరువాతవచ్చిన ప్రగతివాద కవితను ఏచూపుతో చూచిరో, అటువంటి చూపుతోనే విశ్వనాథవారి కవితను జూడవలయునని నా మనవి.

'సంప్రదాయాన్ని ఆశ్రయించినకవులు ఈయన (విశ్వనాథ) మార్గాన్ని ఆశ్రయించి ముందుకు పోయినారు' అని చాటిన ఆచార్యులుగారు తుమ్మలవారి ఆత్మకథ మహాత్మకథలు, మధునాపంతులవారి ఆంధ్రపురాణము, వానమామలై వారి పోతన చరిత్రము 'ఇవన్నీ ఈ త్రోవలో వెలువడ్డ శిఖరాలవంటి కావ్యాలు' అనిరి. ఈ మాటలు ఆచార్యులుగారు నిష్పక్షపాతముగా వ్రాసినట్టివి గావు. విశ్వనాథకు మహోన్నత గురుపీఠము వేయువలయుననియైన వారు వ్రాసియుండ వలయును. లేక ఆ ముగ్గురుకవుల కవితా తత్త్వము తెలియకయైన వ్రాసియుండ వలయును.

కవితా సంప్రదాయము రెండురకములు. ఒకటి ఆంతరము. అది కవి కావ్యములకు పునాదియగు సంస్కృతిని వెల్లడించును. రెండవది బాహిరము అది కవి భాషాప్రయోగమును చూపును. ఈ విధముగా భావించినచో విశ్వనాథ సంప్రదాయమునకు, ఆ ముగ్గురుకవుల సంప్రదాయమునకు పోలిక యెక్కడను లేదు.

కం॥ 'దేవుఁడన మాతృ దేశము;
దేవతలనఁ బ్రజలు; యజ్ఞదీక్ష యనంగా

'సేవావ్రత నిష్ఠయు; యివి
జీవన సూత్రములుగాఁ బ్రసిద్ధం గనుమా'

యని విశ్వనాథ సంప్రదాయము ననుసరించిన కవి వ్రాయునా? విశ్వనాథ సంప్రదాయము నాశ్రయించిన కవి భారతీయ సంస్కృతికి కువ్యాఖ్యానములు చేయును. దానియందలి మానవతా వాదమును ఏకసూత్రతను పరమార్థమును త్రోసి రాజనును. వర్గవర్ణముల కతీతమయిన సామాజిక చైతన్యమును ఖండించును. శిల్పాభిరామములుగాని, తెనుఁగుఁదనములేని తెలుఁగు పద్యములు వ్రాయును. ఆత్మనిష్ఠమయిన సాహితీ విమర్శలు చేయును. ఈ విధమయిన పోకడలు పోయిన వారా — తుమ్మలవారును, మధునాపంతులవారును, వానమామలై వారును? సహృదయులయిన తెలుఁగువా రాలోచింతురు గాక!

'రవీంద్ర గాంధీ అరవిందులు మానవజీవనం యొక్క సర్వతోముఖమయిన వికాసాన్ని వ్యాఖ్యానంచేసి భారత సంస్కృతిని విశ్వమానవ సంస్కృతికి అభిన్నమయిన ప్రధానాంగంగా నిరూపించినారు' అని యొక చక్కనిమాట సెలవిచ్చిరి ఆచార్యులుగారు. మఱి అరవిందునితో తుల్యులయిన విశ్వనాథవారి సంప్రదాయము భారతీయ సంస్కృతియందలి మేలిమిని బయటపెట్టఁగలిగినదా?

'భారతజాతి తత్త్వం ఆదినుంచీ అద్వైతనిష్ఠమయింది; సర్వజీవులనూ ఆత్మవత్తుగా భావించేది. అందరూ మానవులనూ అమృతపుత్రులనుగా నిరూపించేది...' అనుచు ఈ రచయిత భారతీయ సంస్కృతికి వ్యాఖ్యానము చేసెను. ఈ యభిప్రాయములతో నేకీభవించుట దుస్సాధ్యము. కొన్ని కొన్ని ప్రాచీన గ్రంథములలోనున్న ఆదర్శవాదమునకేమిగాని, లౌకిక జగత్తులో భారతజాతి తత్త్వము ఆచార్యులుగారు వర్ణించినట్లుగా లేదు. 'చీకటినుండి వెలుఁగునకు నన్నుఁ జేర్పుము' అని మహర్షులు గానము చేయఁగా భారతజాతిలో ముఖ్యులయిన వారు సాటివారిని నూటికి తొంబదిమందిని చీకటి గుయ్యారములలో కోలుకొనలేనట్లుగా పడద్రోసిరి. ఏది భారత జాతితత్త్వమని ఆచార్యులవారనుచున్నారో ఆ తత్త్వమున వ్యక్తికిఁ బ్రాధాన్యము లేదు. కన్యూనిజమునకు ఆస్తికత్వమును జోడించినచో 'భారత జాతితత్త్వ'మగును. 'విశ్వనియామకమయిన తత్త్వానికీ, తన జీవనం సాగించుకునే వ్యక్తికీ ఉన్న అనుబంధాన్ని నిర్వచించేదే ధర్మం' అయినప్పుడు, 'ఈ ధర్మాన్ని నిర్వహించడమే భారతీయుని జీవలక్షణం అయినప్పుడు 'భారతజాతి తత్త్వం'లో మానవతా రహితమైన భేదబుద్ధి యేవిధముగా గూడుకట్టుకొన్నది? అది యా ధర్మమునందయిన నుండవలయును. లేక యా ధర్మమును భారతీయుఁడు సాక్షాత్కరింపఁజేసికొని, త్రికరణశుద్ధిగాఁ బాటింపలేనివాఁడయినఁ గావలయును. ఆచార్యులుగారు పైకిఁ జెప్పలేదుగాని వారు వర్ణించిన 'భారతజాతి తత్త్వం' హిందూసంస్కృతితప్ప మఱేమియుఁగాదు. భారతీయ సంస్కృతి హిందూసంస్కృతి యొకటిగావు. భారతీయ సంస్కృతి భారతీయ సంస్కృతియే. దానికే రవీంద్రుఁడు, అరవిందుఁడు, గాంధి మూఁడు మూలల నుండి వ్యాఖ్యానములు చేసిరి.

గణమాత్రాచ్ఛందస్సులగతిలో వైవిధ్యము పరిమితమని ఆచార్యులుగారనిరి. పరుషకోమలములు, సంయోగాసంయోగములునయిన వ్యంజనములతో, హ్రస్వదీర్ఘములయిన స్వరములతో నేర్పడు గణముల గతిలో అనంతమైన వైవిధ్యముండదా? ప్రాచీన నవీన కవుల పద్యముల యెత్తుగడలో, ముగింపులో, విరుపులలోఁ జూపిన వైవిధ్యమునెల్ల విమర్శకులయినవారు పూర్ణముగాఁ గనుఁగొనఁగల్గిరా?

'పండితుఁడు తన పాండిత్యాన్ని, అభిమాన శాస్త్రాన్ని అనుసరించి ఒక సంకుచితజ్ఞానపరిధిలోనే కావ్యాన్ని వివేచన చేస్తాడు. కావ్యమూలస్రోతస్సైన మానవహార్దలక్షణంతో అతనికి ఎక్కువ సంబంధం ఉండదు' (పుట 134) అని చెప్పుచు ఆచార్యులుగారు భావుకతయున్న పాండిత్యమును మన్నించిరి. వెనుకటివారి మాటలను సమర్థించిరి. ప్రాచీన మార్గానుయాయులై, శాస్త్రవైదుష్యముగల ప్రాచీన

సంప్రదాయ పండితుల యీసడిస్తూన్న ఆచార్యులుగారు నవీనమార్గానుయాయులై, విజ్ఞాన వైదుష్యముగల 'నవీనపండితు'లున్నారే—ఆ 'మహాత్ము'లను మఱచి రనుకొందును. ప్రాచీనపండితుఁడు లేక వాని 'వారసు' పాండిత్యమును, అభిమానశాస్త్రమును అనుసరించి కావ్యవిమర్శ చేసినచో, 'నవీనపండితులు' రాజకీయములు, వర్గములు, అందఱకు మంచివారము గావలయు నను తహతహపాటు, తప్పించుకొనిపోవు చాతుర్యము మున్నగువాని ననుసరించి కావ్యవివేచన చేయుటలేదని ఆచార్యులుగారు చెప్పఁగలరా? ప్రాచీన పండితునిది సంకుచిత పరిధియని యనుకొందము. అది రసప్రధానమయిన సాహిత్యమునందలి శిల్పమును గ్రహించుటకు అడ్డపడినదా? మఱి యీ 'నవీన పండితులు' విశాలదృష్టి కలిగి, సర్వతోముఖ విజ్ఞానము కలిగి వస్తునిష్ఠమయిన సాహిత్య విమర్శను వ్రాయఁగల్గిరా? వ్రాయఁగల్గినవారే యయినచో 'సాహితీ బంధుబృందం' 'ప్రకాశకీయం'లో ఈక్రింది రీతిగా వ్రాయవలసిన అక్కఱ యుండెడిదిగాదు.

'తెలుగులో సాహిత్యవిమర్శ చాలా తక్కువ. ఉన్న కాస్తలోనైనా ఆధునిక విమర్శకుల్లో పాక్షిక దృష్టే ఎక్కువగా కనిపిస్తున్నది. ఏదో తమ కనుకూలమయిన రాజకీయమతం పుచ్చుకోలేదన్న నెపంతో ఉత్తమశ్రేణికి చెందిన రచయితల్నికూడా నిర్లక్ష్యం చేయడం జరుగుతున్నది. తత్కాలీనమయిన సాహిత్యస్వరూపస్వభావాదులను అంచనా వేసేప్పుడు కళా గౌరవాన్ని పూర్తిగా విస్మరించి ప్రామాణికమైన విలువలేవీ లేకుండానే ఆయా రచయితలను దూషించడమో భూషించడమో జరుగుతున్నది. మరికొందరు వైయక్తికమైన రాగద్వేషాల రంగుటద్దాలు తొడుక్కొని సాహిత్య అంతస్తత్వాన్ని దర్శించలేక పోతున్నారు. ఈ దురవస్థనుండి నేటి విమర్శకుడు ఎంత తొందరగా బయటపడితే అంతలో తెలుగుసాహిత్య విమర్శకు ఉజ్జ్వల భవిష్యత్తు కలుగుతుంది'. అభిమానము ననుసరించి వివేచన చేయువారే నాఁడయిన నుందురు. వారి విమర్శలు కాలవికారములు మాత్రమే. అవి ప్రామాణికములు గావు.

డాక్టర్ కోవెల సుప్రసన్నాచార్యులు రచించిన యీ 'సాహిత్య వివేచన'ను నవీనాంధ్ర సాహిత్య గతిని దెలిసికొననెంచిన తెలుఁగువారు తప్పక చదువ వలయును.

## వేమన—పాశ్చాత్యులు

[తెనుగుసేత : మరుపూరు కోదండరామరెడ్డి; నెల్లూరు వర్ధమాన సమాజమువారి ప్రచురణము; వెల: మేలుప్రతి రూ 5 లు, సాధారణప్రతి రూ 4 లు ]

అచ్చమయిన తెలుగుకవి వేమన. అతని భావములు ఎరవుతెచ్చుకొన్నవిగావు. అవి గాఢమయిన జీవితానుభవమునుండి అవతరించినవి. అతని భాష మెఱుఁగులు పెట్టినదిగాదు. అది తెలుగు లోగిళ్లలో నెల్లప్పుడు చెవినిబడునట్టిది. వేమన భాషాభావములు తెలుగుగుండెనుండి మొలకెత్తినవికావుననే, అతని ఆటవెలదులు తెలుగువారి నాలుకలపై నాట్యమాడెను. అప్రయత్నముగా, అకృత్రిమముగా ఆవిర్భవించిన అతని కవితను తెలుగువారు సొంతసొమ్ముగా కాపాడుకొనిరి. కాపాడినవారు పండితులుగారనియు, పల్లీయులనియు మనము మఱవరాదు. అందుచేతనే వేమన పద్యములు సహజస్వరూపమును గోల్పోయి లెక్కకు మిక్కుటమయినవి. ఈనాఁడు మనచేతికందిన వేమన పద్యములలో అతని వెన్ని? ఇతరుల వెన్ని? యని కచ్చితముగాఁ దేల్చి చెప్పుట తలకుమించినపని. పండితాధీనమయిన సాహిత్యము, భారతాది గ్రంథజాలము పాఠాంతరముల బరువుతోఁ గ్రుంకిననాఁడు, భాషాధికారము లేని పామరుల నోళ్లలోఁబడి నలిగిన వేమన పద్యములు వ్రేతలు వేయుటలో వింతలేదు. పూర్వకాలమున సంఘములో శిష్టులయినవారికి వేమనరీతి నచ్చినది గాదు. తాము త్రికరణశుద్ధిగా నమ్మిన సంస్కృతిని ఎడపెడ దూది యేకినట్టులు ఏకినవానిని వారు మెచ్చుకొందురా? పండితుల యుదాసీనత, పామరుల యశక్తత వేమన సాహిత్యమునకు చెదలుపురుగులయినవి.

తనవాడెంత గొప్పవాడో యితరులు చాటిచెప్పిన

దాక తెలిసికొనలేని ద్వేషబుద్ధి తెలుగువానిలో ఒక పాలెక్కువగావున, పాశ్చాత్యులకే వేమన మహత్తు, మహస్సు ముందుగా గోచరించినవి. వారిలోను నిష్కామ సేవాపరాయణుడై, తాళపత్రగ్రంథములలో మూలుగుచున్న యాంధ్రసాహిత్యము నుద్ధరించి, సంస్కరించిన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను దొరగారు ప్రప్రథమముగా వేమనను గుర్తించిరి. ఆయన వేమన పద్యములను ఆంగ్లభాష కనువదించెను. ఆనాడు వేమన సాహిత్యము నంగలి హాసోపహాసములకు సిపమెత్తినవారి కుట్రచే బ్రౌనుదొరగారి యనువాదము పాఠ్యగ్రంథము గాలేదు. క్రీ. శ. 1829 లో బ్రౌనుదొర తన యనువాదము ను ప్రకటించెను. క్రీ. శ. 1839 నాటికది ద్వితీయ ముద్రణ మందినది. దీనిని సమీక్షించుచు ఆర్. యస్. మాక్డొనాల్డ్ ఒక పెద్దవ్యాసము వ్రాసెను. మొన్నమొన్నటిదాక బ్రౌనుదొర యనువాదము తెలుగువారికి దొరకలేదు.

ఇది యిట్లుండగా క్రీ. శ. 1961 లో శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, గద్వాల సంస్థాన పండితులునగు శ్రీరామ నృసింహమూర్తి కవులు (గంథము శ్రీరామమూర్తి, ఈరంకి నరసింహమూర్తి), 'శ్రీ వేమగీతా ప్రథమసహస్రము' ప్రకటించిరి. శ్రీరామ నృసింహమూర్తి కవులు వేమన పద్యములను సంస్కృతమునకనువదించిరి. ఈ యనువాద గ్రంథములో మాతృకలయిన వేమన పద్యములు, వాని యనువాదములయిన సంస్కృత శ్లోకములు దేవనాగరలిపిలోఁ గలవు. అంతేకాదు. అనువాదకులు బ్రౌనుదొర యాంగ్లానువాదమునుగూడఁ దమ యనువాదమునకుఁ జేర్చిరి. క్రీ శ. 1967 లో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ బ్రౌనుదొర గ్రంథమును 'Verses of Vemana, In the Telugu Original with English Rendering' అను పేరితోఁ బ్రకటించెను. ఆ సంస్థయే యన్.టి.జి. వరదాచార్యుల 'సుమతి వేమన శతక' సంస్కృతానువాదము ప్రకటించినది.

మొట్ట మొదట వేమన ప్రస్తావన చేసిన పాశ్చాత్య విద్వాంసుడు జె. ఎ. దూబాయ్. తరువాత హెన్రీ బ్యూఛాంప్—దూబాయ్ చెప్పిన మాటలకు నొకకొన్ని సొంతమాటలు చేర్చెను. పిదప సి. వి. గోవర్, హెన్రీ బవర్స్, డబ్ల్యు. హెచ్. కాంబెల్, ఎల్. డి. బార్నెట్. జె. డి. బి. గ్రిబిల్ అను పాశ్చాత్యులు వేమననుగూర్చి కొలదిగనో గొప్పగనో సత్యము వెల్లడించిరి.

మఱి తెలుగువారు చేసినదేమి? కట్టమంచి రామలింగారెడ్డిగారు 'కవిత్వ తత్త్వ విచారము'లో వేమన నుత్తమకవిగా కొనియాడిరి. వారు మరణించుటకు ముందు మద్రాసు ఆకాశవాణీ నిలయమునుండి వేమననుగూర్చి యాంగ్లమున నొక ప్రసంగముచేసిరి. వంగూరి సుబ్బారావుగారు వేమన చరిత్రము వ్రాసిరి. ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి యాజమాన్యమున రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు కొన్ని యుపన్యాసములిచ్చి 'వేమన చరిత్రమును జాల సంగతముగ నాంధ్రలోకమున కొసంగి మహోపకారము' చేసిరి. అదియే నాటికి నేటికి ప్రామాణిక గ్రంథమైనది. నేదునూరి గంగాధరముగారు 5010 వేమన పద్యములను ప్రకటించి, వానిలోఁ గొన్నిటికి ఒకటి రెండు వాక్యములలోఁ దాత్పర్యము వ్రాసిరి. తరువాత నార్ల వేంకటేశ్వరరావుగారు కేంద్ర సాహిత్య—అకాడమీవారి 'భారతీయ సాహిత్య నిర్మాతలు' అను గ్రంథమాలలో 'వేమన' అను నాంగ్ల గ్రంథమును రచించిరి. ఇటీవల బండారు తమ్మయ్యగారు 'వేమనచరిత్ర' వ్రాసిరి.

వేమనకవి చరిత్రకారుల చూపునకు ఆనలేదు. వీరేశలింగముగారికి వేమన మహత్తు బొత్తిగా తెలియలేదు. వీరేశలింగముగారినిగూర్చి వ్రాయుచు బండారు తమ్మయ్యగారు 'నవనాగరక శిఖామణులయి యెన్నియో తెలుగుల సంస్కారములు నెలకొలిపిన శ్రీ వీరేశలింగము పంతులుగారుకూడ వేమనను కవిగా గణించి తమ యాంధ్రకవి చరిత్రమున నాతనికి స్థానమొసంగఁ జాలకపోయి రన్నచో నీ విషయమున నిఁక వ్రాయుట యనవసరము' అనిరి. చాగంటి శేషయ్యగారు (ఆంధ్ర

కవి తరంగిణి, 6 వ సంపుటము) వేదము వేంకట కృష్ణశర్మ (శతక వాఙ్మయ సర్వస్వము) వేమనను గూర్చి వ్రాసిరి.

పాశ్చాత్యులు వేమననుగూర్చి యెక్కడెక్కడ నేమేమి వ్రాసిరో యెవరికిని దెలియదు. ఆ వ్రాతల నన్నిటిని, అభినివేశముతో శ్రమపడి బయటబెట్టి పుణ్యము గట్టుకొన్నవారు నార్ల వేంకటేశ్వరరావు గారు. తెలుగువారు నార్లవారికెంతో ఋణపడి యున్నారు. వేంకటేశ్వరరావుగారు పాశ్చాత్యుల వ్రాతల నన్నిటిని నొకచో గుదిగ్రుచ్చి 'Vemana, Through the Western eyes' అను గ్రంథమును సిద్ధము చేసిరి. దానిని యం. శేషాచలం అండ్ కో వారు ప్రకటించిరి. ఆంగ్లభాషలో నున్న యా గ్రంథమునే మరుపూరు కోదండరామ రెడ్డిగారు తెలిఁగింపఁగా నెల్లూరు వర్ధమాన సమాజమువారు ప్రకటించిరి. ఆంగ్లభాష చదువని ఒకవేళ చదివినను ఆంగ్లగ్రంథములు చదువఁజాలని తెలుగువారు ఎందఱో యున్నారు గావున నార్లవారు కూర్చిన ఆంగ్ల గ్రంథమును దెలిఁగించిన కోదండరామరెడ్డిగారిని, ఆ తెలిఁగింపును ప్రకటించిన నెల్లూరు వర్ధమాన సమాజమువారిని గొనియాడ వలయును.

నార్లవారి గ్రంథమునకు, కోదండరామ రెడ్డిగారి గ్రంథమునకు స్వరూపమున భేదము గలదు. నార్లవారు తమ గ్రంథములో రామలింగారెడ్డిగారి యాకాశవాణీ ప్రసంగమును ద్వితీయానుబంధముగాఁ జేర్చిరి. కాని కోదండరామరెడ్డిగారు దానిని 'ప్రవేశిక' పేరితో గ్రంథాదిని జేర్చిరి. అంతేకాదు. 1946 ఫిబ్రవరి 23 వ తేదినాఁడు గుంటూరిలో జరిగిన ఆంధ్రమహాసభ కధ్యక్షులై రామలింగారెడ్డిగారు చేసిన ప్రసంగములో వేమన ప్రస్తావనయున్న భాగమును, 1908 లో బీజపూరుజిల్లా దేవనాల పట్టణమున జరిగిన బొంబాయి రాజధాని రెడ్డిమహాజన సాంఘిక విద్యాసంఘ ద్వితీయ వార్షికసభ కధ్యక్షులై వారే యొనర్చిన యుపన్యాసములో వేమననుగూర్చి యున్న భాగమును కోదండరామరెడ్డిగారు డాక్టరు రెడ్డిగారి యాకాశవాణీప్రసంగమున కాద్యంతములలోఁజేర్చిరి. ఈ రెండుభాగములు నెల్లూరు వర్ధమాన సమాజము వారు ప్రకటించిన 'C. R. Reddy on Vemana, **Veeresalingam, Drama in the East and west, Kanyasulkam'** అను ఆంగ్ల లఘుగ్రంథములో నున్నవి. అట్లే రామలింగారెడ్డిగారు 'కవిత్వ తత్త్వ విచారము'లో వేమననుగూర్చిచేసిన పొగడ్తను 'పరిచయము'అను భాగమునందు 28, 29 పుటలలో అధస్సూచికగా నిచ్చిరి. ఈ పనివలన రామలింగా రెడ్డిగారు వేమననుగూర్చి చెప్పినదంతయు నొకచోఁ జేర్చినట్లయినది. ఇది లెస్సగా నున్నది.

నార్లవారు కూర్చిన గ్రంథములో బ్రౌనుదొర వ్రాసిన వ్రాతల తరువాత మాక్డొనాల్డ్ సమీక్ష యున్నది. పిదప గోవర్, బవర్స్, కాంబెల్, బార్నెట్ వ్రాసిన వ్రాతలున్నవి. కోదండరామరెడ్డిగారీ క్రమమును మార్చిరి. బ్రౌనుదొర తరువాత కాంబెల్, మాక్డొనాల్డు, బార్నెట్, గోవర్, బవర్స్ వచ్చిరి. నార్లవారి సంకలనములో ప్రథమానుబంధముగానున్న గ్రిబిల్ వ్రాత కోదండరామరెడ్డిగారి తెలిఁగింపులోఁ జివర నున్నది. తెలిఁగింపులో ననుబంధములు లేవు. నార్లవారి గ్రంథమున కాలక్రమము ముఖ్యము. రెడ్డిగారి తెలిఁగింపులో విషయప్రాధాన్యక్రమము ముఖ్యము. ఈ వ్యాసముల కన్నిటికి నాయకమణిగానున్న కాంబెల్ వ్యాసము, బ్రౌన్దొర వ్రాతల తరువాతఁ జేర్చుట యెంతో బాగుగా నున్నది.

నార్లవారి సంకలనములోఁ జివర నామానుక్రమణికయు, వారు ప్రతినామమున కెదుట వ్రాసిన సంగ్రహ వ్యాఖ్యయుఁ గలవు. కోదండరామరెడ్డిగారు దానిని వదలిరి. వారు గ్రంథములో నెక్కడెక్కడ నేయేవ్యక్తుల నామములు వచ్చుచున్నవో, యక్కడనే యా వ్యక్తులనుగూర్చి కొన్నిచోట్ల విపులముగా, కొన్నిచోట్ల సంగ్రహముగా అధస్సూచికలలో వ్రాసిరి. నార్లవారు వ్రాసినవారినిగూర్చి కోదండరామరెడ్డిగారు వ్రాయలేదు. వారు వ్రాయనివారినిగూర్చి వీరు వ్రాసిరి. ఈ యధస్సూచికలు సమగ్రముగా సంగ్రహముగా నుండుటకు రెడ్డిగారెంతో శ్రమించిరని చెప్పక తప్పదు. పాశ్చాత్యులు వేమననుగూర్చి వ్రాసిన వ్యాసములను, ఉపోద్ఘాతములను, అధస్సూచికలను సంపూర్ణముగా నర్థముచేసికొనుటకు రెడ్డిగారి 'పాదజ్ఞాపిక' లెంతో తోడ్పడును.

తాము ప్రకటించిన గ్రంథమునకు, వేమన్న హాసోపహాసములకు, సాంఘికదృష్టికిఁ బరవశించు వార్ల వెంకటేశ్వరరావుగారు తొలిపలుకు వ్రాసిరి. ఆ తొలిపలుకులో వారు వెల డించిన యభిప్రాయములతో వెల్లరు నేకీభవింపకపోవచ్చును. కాని వారి చిత్తశుద్ధి నెవ్వరును శంకింపరు. ఆ తొలిపలుకును కోదండ రామరెడ్డిగారు యథాతథముగా ననువదింపలేదు. 'ఎం. శేషాచలం కంపెనీవారు ప్రచురించిన గ్రంథము లోని పీఠికభాగములను కొన్నిటిని శ్రీ వార్లగారి సౌజన్య ముతో ఇందు పొందుపరుచుచున్నాను అని రెడ్డిగారు 'పరిచయము' భాగమునఁ జెప్పిరి. వార్లవారు ఒక్కొక్క పాశ్చాత్యుని వ్యాసమునకుముందు వానినిగూర్చి యుపోద్ఘా తము సంగ్రహముగా వ్రాసిరి. రెడ్డిగారా యుపోద్ఘాత ములను పెంచి వ్రాసిరి.

ఇన్నిరకముల పెంపువలన మాతృకకంటె నను వాదము పెద్దదయినది. మొత్తముమీద పాఠకులు తమ యనువాదమును జదివి సంపూర్ణముగా జీర్ణింపఁ జేసికొనుటకు నెంత కృషిచేయవలయునో అంతకృషిని జేసి కోదండరామరెడ్డిగారు చదువరుల కృతజ్ఞతకుఁ బాత్రులయిరి.

కోదండరామరెడ్డి గారిది నెల్లూరు మండలము జాతుఁదెనుఁగు. కావుననే 'నిజమరి పరమటిదొరలు— పరమటిప్రొద్దు — ఒదిపిని కక్కించినది — నడ్డిసీల్గే పని—పదిసావులు - నిండుబిత్తరి — వందా పట్టించి నది— ఘనపరచు—చెత్త చెదారపు కొట్టులో దుంగి— నోటదురిగి—నిండా నచ్చినవి — ప్రేలుడు కోపులు— ఇంగ్లీషులో దిగవేయలేదు — నిలబలుకుట — దంటు బారిన పచ్చటి అడవిగడ్డి— జిలుగుమోడి — కొత్త కరకు మాయక — ఈ కులపాటినల పట్ల — మెండొడ్డి—శ్రీమంతమైన వాగర్థ ప్రాంతాలలోనే — ఒకొక్క పద్యము ఒక్కొక్క కార్డుమీదవ్రాసి అన్ని టిని ఎగగులిపి ఒకసంచిలో దునిగినట్లు చిల్లాపల్లాగా నున్నవి—అప్పటమైన సామెతలను — బుగ్గవంక— ఈయన తమిళమున మంచిగా భాషాజ్ఞానమును సంపా దించుకొనినాడు' వంటి పలుకుపడి వాక్య విన్యాసము అనువాదములో కలదు. తెలుగు నుడికారము గుట్టు తెలగా నెఱిగిన రెడ్డిగారి యనువాదము ధారాళముగా నున్నది. ఈ నాడు విద్యావంతులు వ్రాయు వ్యావహారిక భాషలో వారు తమ యనువాదమును సాగించిరి.

కోదండరామరెడ్డిగారు కొన్ని వాక్యముల తెలిఁగింపును పునఃపరిశీలింప వలయును. ఆంగ్లము నకు ననువాదమయిన యీ గ్రంథములో ఆ భాషా వాసన లెడనెడ గలవు.

మాతృకలో Vemana adds yet another line of attack' అని గలదు. దానికి రెడ్డిగారు 'వేమన యీ దూషణముపై మఱియొక ప్రయోగ మును జేయుచున్నాడు'అని తెలిగించిరి. (పుట 39). 'ఇంతటితో ఆగకుండ వేమన మఱియొకవైపు నుండి కూడ ఈ దురాచారములపై దాడిచేసెను'అని యనుట బాగుగా నుండదా ? మూలములో 'This Vemana Cult, which is directly opposed to the whole teaching and life of the poet, is happily confined to a comparatively small area...' అని యున్నది. 'ఈ కవిజీవిత మూలాదర్శమునకు, ఆయన ప్రవచనములకు వ్యతిరేక మైన యీ వేమన పూజాప్రకారము ఏ కొద్ది ప్రాంత మునకో పరిమితిమై యుండుట ఒక సంతోషము' అని యనువాదము. (పుట 79). Life అనుదానికి జీవిత తత్త్వము అని తెలిగించుట యుత్తమముగా నుండదా ? ఈ వాక్యమును 'వేమన జీవిత తత్త్వ మునకు, పరిపూర్ణ బోధలకు (లేక ప్రవచనమునకు) పూర్తిగా వ్యతిరేకమైన యీ ఆరాధనా విధానము ఒకానొక ప్రాంతమునకే పరిమితమై యుండుట సంతోషకారణము' అని తెలిగించుట సమంజసముగా నుండునేమో రెడ్డిగారు పరిశీలింపవలయును.

85 వ పుటలో 'కులవిభాగముల అన్పతత్వము పట్ల' అని యున్నది. మూలములో False అని యున్నది. అట్టిచో 'మిథ్యాకులభేదములపట్ల 'అని తెలిఁగించుట తగదా? మాతృకలో 'My own opinion is in favour of its discontinuance much as I approve of a good part of Vemana's teaching' అని కలదు. రెడ్డిగారు 'వేమన రచనలలో ఎక్కువగానున్న మంచిభాగములనిన నాకు యిష్ట మున్నను, పాఠ్యగ్రంథముగా తీసివేయవలెననుటే నా స్వాభిప్రాయము' అని యనువాదము చేసిరి. My own opinion అనుదానికి నా స్వాభిప్రాయము

అనునది తెలిగింపా? దీనికంటె మదీయాభిప్రాయము అనుట మంచిదిగాదా? రెడ్డిగారాలోచింతురుగాక! 'వేమన బోధలలో ఎక్కువపాలు నాకు సమ్మతమయి నప్పటికి దీనిని పాఠ్యగ్రంథముగా తీసివేయవలెననుటే నా యభిప్రాయము' అనిన నెట్లుండును? ఈ విధముగా ఆంధ్రభాషాకారకము, తెలుగు పలుకుబడి లోపించిన పట్టులు పెక్కులు. ఈ గ్రంథము అచిరకాలములో రెండవ కూర్పునకు రాఁగలదు కావున రెడ్డిగారు మఱొకసారి తమ యనువాదమునకు మెఱుఁగులు దిద్దుదురను పేరాస నాకుఁ గలదు.

కోదండరామరెడ్డిగారు 27 వ పుటలో 'డాక్టర్ జి. వి. కృష్ణారావుగారు (ఆకాశవాణి విజయవాడ) 'వేమన, ఆయన కవిత్వము—వేదాంతము'అను ఆంగ్లగ్రంథమును 1958 లో వెలువరించినారు'అని వ్రాసిరి. కృష్ణారావుగారు వేమననుగూర్చి ఆంగ్లగ్రంథమునుగాక యొక వ్యాసము వ్రాసిరి. ఆ వ్యాసము 1958 లో 'Half way' అనుపేర వెలువడిన నార్ల వేంకటేశ్వరరావుగారి అభినందన సంపుటములోఁ గలదు. (See.-Half way, Section II Generalia: On Life and Letters, Page 10). ఆ వ్యాసముపేరు Vemana: His poetry and philosophy,'. దాని తెలిగింపు కృష్ణారావుగారిటీవల ప్రకటించిన 'నవతోరణము'న కెక్కినది. నార్ల వేంకటేశ్వరరావుగారు ఆంగ్లగ్రంథసంకలనము చేయుటకుఁ దోడ్పడినవారు కొందఱు గలరు. వారు వారికిఁ గృతజ్ఞతలు చెప్పుకొనిరి. మఱి యా యాంగ్లగ్రంథమునకు ననువాదమైన దీనిలోఁ మాతృకకుఁ దోడ్పడిన వారి ప్రస్తావనకూడ నెక్కడనో యొకచోట నుండిన బాగుగా నుండెడిది.

ఆంగ్లములోనున్న గ్రంథమును ఎక్కువమంది తెలుగువారు చదువుకొనుటకు వీలుగా ననువదించిన కోదండరామరెడ్డిగారి ప్రయత్నము పొగడఁదగినది.

—'శాక్యసింహ'

## జర్మన్ సంప్రదాయ సాహిత్య దర్పణం

(అనువాదకులు: శ్రీయుతులు బి. వి. సింగరాచార్య, పా. పద్మరాజు, బొ. శ్రీనివాసాచార్యులు: ప్రచురణ: దక్షిణభాషాపుస్తకసంస్థ, మద్రాసు—10, హార్స్ట్ ఎర్డ్‌మన్‌వెర్లాగ్ (పశ్చిమ జర్మనీ), బాసెల్ (స్విడ్జర్లెండ్): పుటలు: డెమ్మీసైజులో 526+12: పూర్తి కాలికోబైండింగు; వెల—రు. 15—00.)

జర్మన్ సాహిత్యంతో మన కంతగా పరిచయం లేకపోయినా, గొథే, బెర్టోల్ట్‌బ్రెక్ట్ మొదలయిన ప్రముఖుల రచనలుమాత్రం మనకు కొత్తవికావు. మహాకవి గొథే అపూర్వదృశ్యకావ్యమైన ఫౌస్ట్ తెలుగుసేతను సాహిత్యఅకాడెమీవారు 1962 లో ప్రచురించారు. బ్రెక్ట్ రచనలు కొన్ని ప్రస్తుతం అనువాదంలో ఉన్నవి. అయినా జర్మన్ సంప్రదాయ సాహిత్యంగురించి తెలుసుకోవలసిన విషయాలెన్నో లేకపోలేదు. ఇందుకు ఈ బృహత్సంకలనం బహుధా ఉపకరిస్తుందనడంలో ఏమాత్రమూ సందేహంలేదు. నిజం చెప్పవలెనంటే, తెలుగులో ఈ నడుమ వెలువడిన ఉద్గ్రంథాలలో ఇదొకటి. దీన్ని సర్వాంగసుందరంగా ప్రచురించిన ప్రకాశకులు ప్రశంసనీయులు.

జర్మన్ సాహిత్యంలో మధ్యయుగాల ప్రారంభదశనుండి నేటిదాకా—అనగా క్రీస్తుశకం 7 వ శతాబ్ది నుండి 20 వ శతాబ్ది మధ్యభాగంవరకు- కానవచ్చే వివిధ పరిణామములనూ తెలియజేసే యీ సాహిత్య చరిత్ర రచనా విధానంలో ఒక విశిష్టత ఉంది. ఒక వైపు చారిత్రక ధోరణిలో సాగుతున్నట్లు కనిపిస్తూనే, మరో వైపు ఆయా జర్మన్ కావ్యాలలోని చవీ చక్కనలను తెలియజేస్తుంది యీ పుస్తకం. ఇదే యీ రచనలోని విశిష్టత. సాధారణంగా సాహిత్య చరిత్రలు అలవోకగా చదివేటట్లు ఉండవు. అందులోనూ అన్యభాషాచరిత్రను చదివేటప్పుడు సాహిత్యాభిరుచి గల పాఠకుడు సైతం కొంచెం తికమక చెందుతాడు. కారణం, పరిచయంలేని కవుల పేర్లూ కవిసంప్రదాయాలూ మొదలైనవి మాటి మాటికి అడ్డు తగులుతూ వుండడమే. కాని యీ పుస్తకం చదువుతున్నంతసేపు మనకు చక్కని కథలు, చిక్కని కవితలు, ఉదాత్తములైన నాటక భాగాలు, ఉత్తేజకరమైన లేఖలు మొదలైనవి అడుగడుగునా కనిపిస్తూ వుండడంతో, జర్మన్ సాహిత్య వీథుల్లో విహరిస్తున్నామా అనే భావం కలుగుతుంది. జర్మన్ సాహిత్యపు మచ్చుతునుకలుగా నూరు గద్య పద్య

కావ్య ఖండాలు, 'అనువాద' రూపంలో, ఇవ్వబడినవి. ఇవి ఆయా కవుల రచనలకు ప్రాతినిధ్యం వహించేవిగా ఉన్నవి. ఒక భాషతో పరిచయం లేనివారికి, తద్భాషా సాహిత్య చరిత్రను పరిచయం చెయ్యడానికి ప్రశస్తమైన విధాన మిది. కాగా ఈ సంకలన కర్తల పరిశ్రమను కొనియాడక తప్పదు.

క్లీస్ట్ వ్రాసిన 'లొకార్నో బిచ్చగత్తె' కథ, లెస్సింగ్ వ్రాసిన కుర్రవాడు త్రాచుపాము కథ, భావ గీతాకారుడైన వాల్థెర్ రచించిన 'ప్రవహించే నీటి పాట నేను విన్నాను' అనే గీతం, కుర్ట్ పింతున్ అనే సాహిత్య విమర్శకుడు చేసిన 'యువ కవులకు ఉద్బోధ' అనే ప్రసంగం, హౌప్ట్మన్ వ్రాసిన 'నేత గాళ్లు' అనే నాటకంలోని ఒక దృశ్యం మొదలైనవి అవశ్యపఠనీయాలు. ఫౌస్ట్ దృశ్యకావ్యంనుంచీ, బ్రెఖ్ట్ వ్రాసిన లైఫ్ ఆఫ్ గలీలియో, మదర్ కరేజ్ ల నుంచి కూడా రసవద్ఘట్టాలు కొన్ని యీ సంకలనంలో చేర్చివుంటే బాగుండేదని నా అభిప్రాయం.

'అనువాదకుని కర్తవ్య పరామర్శ' అనే వ్యాసంలో గొథే మహాకవి చెప్పిన యీ కింది వాక్యాలు పరికించండి.

'...ప్రతి అనువాదకుడు ఈ అంతర్జాతీయ ఆధ్యాత్మిక వినిమయంలో సంధాయకుడుగా పరిగణింప దగినవాడు...అనువాదాలలో లోపాలను గురించి ఎవ్వరేమి చెప్పినా, అది ప్రపంచ సామరస్య సాధకమైన వృత్తి. అందువల్ల ఉత్తమోత్తమ ప్రముఖ వృత్తులలో ఒకటిగా పరిగణింపదగినది. భగవంతుడు ప్రతి జాతికి ఆ జాతి భాషలోనే ఒక ప్రవక్తను ప్రసాదించాడు-అంటుంది కొరాను. ఆ విధంగా ప్రతి అనువాధకుడు తన జాతి కొక ప్రవక్త.'

అనువాద కళను గురించీ అనువాదకుని గురించీ ఇంత చక్కగా వివరించిన మహా రచయిత మరొకడు లేడన్నా అతిశయోక్తి కాదు.

సుప్రసిద్ధ జర్మన్ మహాకవి షిల్లర్ 150 వ వర్ధంత్యుత్సవ సందర్భంలో ప్రముఖ నవలా రచయిత అయిన థామస్ మన్ చేసిన ప్రసంగం కూడా పరిశీలింపదగింది. ఆయన అన్నాడుగదా. '......షిల్లర్‌ను మరచిపోవడంగాని, మన కాలానికి ఆయన తగిన వ్యక్తికాడని, పాతబడి పోయాడని, ఇంక ఆయన మనకు చెప్పగలిగింది ఏమీ లేదని భావించడంగాని బుద్ధి పెడతలపట్టటమే అవు తుంది. అలాంటి భావమే పాతబడినభావం. ఆయన రచనలు ఈ మధ్య నేను తిరిగి చదువుతూఉంటే నాకు చాలా గాఢంగా ఈ మాట అనిపించింది తన వ్యాధిని వశంవదం చేసుకున్న ఆ మహావ్యక్తి వ్యాధిగ్రస్తమైన మన యుగానికి మంచివైద్యుడు కాగలడు—ఆయన మాటలు వినడానికి మనం సిద్ధపడితే చాలు.'

ఈ మాటలు మహారచయితలు — ఏకాలపు వారైనా, ఏభాషవారైనా—అందరికీ వర్తిస్తాయి. ఆలోచనామృతము అనదగిన యిటువంటి భావాలు ఎన్నో ఈ సంకలనంలో అందాలు దిద్దుకున్నవి.

జర్మనీ చరిత్రకూ జాతీయతకూ సంస్కృతికీ సాంఘికజీవనానికీ ప్రశస్తదర్పణంగా ప్రతిభాసిస్తున్న యీ చక్కని సంకలనాన్ని తెలుగు చేసిన అనువాద కులు ముగ్గురూ వైపువాటము లెరిగిన రచయితలు కావడం తెలుగు పాఠకలోకం చేసుకున్న అదృష్టం. అనువాదం సరళసుందరంగా సాఫీగా సాగింది.

ముచ్చటైన ముద్రణ, మంచికాగితం, మధ్య మధ్య చేర్చిన రయిచేఖల బొమ్మలు మొదలైనవి ఈ గ్రంథం విలువను ఇనుమడించుచున్నవి. వెల కూడా సరసంగానే ఉంది.

— చల్లా రాధాకృష్ణశర్మ.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.